# కండక్టరు కథ

రచన:

ఎస్. ఎస్. పెండ్సె

అనువాదం:

ఎన్. జగన్నాథ్

విశాలాంధ్ర ప్రచురణాలయం,
విజయవాడ - 4.

# ఇందులో :


| | |
|---|---|
| | పుట. |
| కొండక్టరు కథ ... | 3 |
| పెద్దిగాడి మేక ... | 71 |

3

# కండక్టరు కథ

కథకి ఏదో ఒక పేరు పెట్టాలి గనక, "కండక్టరు కథ" అన్నాను. కాని నిజానికి ఇది కండక్టరు రామశరణుడి కథో, నా కథో నాకీరోజు వరకు నిర్ణయం కాలేదు. ఇవాళ నేనొక పెద్ద కంపెనీలో గొప్ప ఉద్యోగం చేస్తున్నాను. చాలా తెలివైన వాణ్ణి గనకా, చచ్చేటట్లు చాకిరీ చేస్తానుగనకా యీ చిన్న వయసులోనే యింత పెద ఉద్యోగం లభించిందని కొంతమంది అంటూంటారు. ఉద్యోగ ధర్మమూ, జబాబు దారీ చాల నిక్కచ్చిగా పాటించే స్వభావంగల నావంటి వాణ్ణి యూనియన్‌లో ఉంచుకోకూడదన్న ఉద్దేశంతోనే కంపెనీ వాళ్ళు ఒక ఉద్యోగి బిరుదు తగిలించి, నన్ను యూనియన్‌లోంచి తప్పించారని అనే వాళ్ళు కూడా కొంతమంది వున్నారు. వాస్తవానికి ఈ రెండు అభిప్రాయాలూ కూడా సగం నిజాలే. పై అధికారుల దృష్టిలో నేను చాలా జబాబు దారీగల మనిషినన్న అభిప్రాయం ఉన్నమాట నిజమే. యూనియన్‌లో వుండి పనిచేస్తున్నరోజుల్లో నేను ఆ యూనియన్‌లో చైతన్యం పుట్టించిన మాట అబద్ధం కాదు. కాని రామశరణుడే గనక నా జీవితంలో ప్రవేశించి యుండకపోతే, ఇంత స్వల్పకాలంలో నాకింత పెద్ద ఉద్యోగం వచ్చేది కాదనటానికి ఏ సందేహమూ లేదు. ఈ రోజున రామశరణుడు చాలా ముఖ్యుడయాడు. నామట్టుకు నేనూ తక్కువ స్థితిలో లేను. తల

వని తలంపుగా, అయాచితంగా, ఒకరికొకరం సన్నిహితులమయాం. ఇప్పటికి కూడా, మాయిద్దరిలోనూ వున్న సౌజన్యం ఫలితంగా, మళ్ళీ మాకు పరస్పరానుబంధం వృద్ధి పొందుతూనే వుంది. 'చిట్టచివర తియ్యగా వున్నవస్తువు అంతా తియ్యగా వున్నట్టే పరిగణించ'మని ఒక ఆర్యోక్తి వుంది. అలాగే అనుకుందామన్నా, ఆ తొలిరోజు తలచుకుంటే మాత్రం నాకు నుంచున్న చోటే భూకంపం వచ్చినట్లుంటుంది.

# 2

ఆ పెద్ద మూడంతస్తుల మేడలో, నా ఆఫీసు మూడో అంతస్తులో వుంది. క్రింది అంతస్తులో కావలసినంత ట్రాఫిక్ రద్దీ వుంటుంది. వందల కొద్దీ మనుషులు మహా హడావిడిగా అహోరాత్రులు తిరుగుతూ వుంటారు. రోజంతా పని చేసి సగం ఊపిరితో వున్న ముఖాలతో కండక్టర్లు క్యాష్ కౌంటరు దగ్గర నుంచుని డబ్బు లెక్కపెట్టుకుంటూ వుంటారు. ఆ ప్రక్కనే అడ్డదిడ్డంగా పడేసివున్న బెంచీలమీద గోడలకి తలకాయలానించి డ్రైవర్లు కునుకు తీస్తూ వుంటారు. అనేక భాషలు మాట్లాడుతూ అక్కడ పోగైన వేలకొద్దీ డ్రైవర్లలో, కండక్టర్లలో ఎవరో ఒక శాబాన్‌ఖాన్‌దలె అహమ్మద్‌ఖాన్ ఉండడం ఎంత సంభవమో, అతని ప్రక్కనే తిరుచినాపల్లి నుంచి వచ్చిన ఓ పి. ఎన్. రామలింగం మొదలియార్ వుండడం కూడా అంతే సంభవం. ఓ ప్రక్కని యిద్దరు ముగ్గురు కండక్టర్లు తేలికగా కూచొని ఉన్నారు ఇవాళ తొంభై ఒకటి వచ్చి తీరుతాయని ఒక అతను దృఢంగా తీర్మానిస్తున్నాడు. ఆ మాటలు విని చెడిపోకుండా చూచుకుంటూ, తన యిద్దరు స్నేహితులను వారిస్తూ, మీసాల్లోనే ముసి ముసి నవ్వులు నవ్వుకొంటున్నా డొకతను. అంచేత, అంత గట్టి జోస్యాన్ని నమ్మి, సొమ్ము పోగొట్టుకునే దురదృష్టం ఒక్కడికీ పట్టలేదు. డ్యూటీలోకి వెళ్ళ డానికి పావుగంటో, అరగంటో వుం దింకా.

అంచేత ఏవో కబుర్లు చెప్పుకుంటూ గడుపుతున్నారు. అందరూ తలో ప్రాంతం నుంచీ వచ్చిన వాళ్ళు. అద్దం ముందు నుంచుని దర్జాగా తల పాగా చుట్టుకుంటున్నాడొక శిక్కు డ్రైవరు. తను గంభీరంగా వున్నానో లేదో చూచుకొంటూండడం అతనికో వ్యసనం. మీసాలొకసారి మెలి పెట్టాడు. గడ్డం ఒకసారి దువ్వుకున్నాడు. కుడి ప్రక్కకీ, ఎడం ప్రక్కకీ ఎంత తిరగ్గలడో అంతా తిరిగి, అద్దంలోకి ప్రక్క చూపులతో తన ఆకృతిని చూసుకుంటున్నాడు. ఇలా సింగారించుకోడానికి అంత మంటూ లేదతనికి.

కండక్టర్లూ, డ్రైవర్లూ కలిసి డ్యూటీలో ప్రవేశించబోయేముందు ఎంత సమ్మర్దంగా వుంటుందో చెప్పడానికి వీలుండదు. డ్రైవర్లకీ, కండక్టర్లకీ డ్యూటీలు ఏర్పరిచే గుమాస్తా కూచున్న కటకటాల గదిదగ్గర గందరగోళం ఒకప్రక్క, ఊళ్లో పేట పేటకీవున్న ట్రాన్సుపోర్టు డిపోల ఆఫీసులనుంచివచ్చే టెలిఫోనులమోత ఒక ప్రక్క, ఆ జనసమూహం చేసే కోలాహలంలో, టెలిఫోనులో "హలో" "హలో" అనే వెర్రికేక లొక ప్రక్క. ఈ మధ్యలో, ఎవరో గది కటకటాల మధ్యనుంచునో, కిటికీలో తలపెట్టో ఒక కండక్టరుమీద విరుచుకుపడి అరుస్తూంటాడు. వాడిమీద కోపంతో కండక్టరు యింకా గట్టిగా అరుస్తూంటాడు. గడచిన నెలలో 28 రోజులు పనిచేసినా హాజరుపట్టీలో తప్పుగుర్తులు పెట్టావేమని పోట్లాట జరుగుతూంటుంది.

మా ఆఫీసులోకి వెళ్ళడానికి మేడమెట్లు ఎక్కాలంటే, ఈ జన సమూహంలోంచీ, యీ రొదలోంచీ చొచ్చుకు పోవాలి. అసలు ఆ మెట్లు ఖాళీగా వుంటాయని కూడా గట్టి నమ్మకం లేదు. సాధారణంగా నలుగు రైదుగురు డ్రైవర్లు టోపీలు మోకాళ్ళమీద అలంకరించుకు కూచుని కబుర్లు చెప్పుకుంటూ వుంటారు. ఆ చివరని, మెట్లమీదే దేహం పరచి సాచుక్కూర్చున్నతను యార్‌జంగ్ అనే పఠాను డ్రైవరు. చూడ్డాని కెంత కొట్టొచ్చినట్టుంటాడో, అంత వెన్నలాంటివాడు. కాస్త పరిచయమయితే వినోదాలతో కాలం గడపడంకంటె అతనికి కావలసింది లేదు. అతని కెప్పుడు ఉత్సాహం పుట్టుకొస్తుందో, ఏ క్షణంలో ఎదటు మనిషిని అమిత ఆపేక్షతో

'తమ్ముడూ' అంటూ పిలిచి ముద్దెట్టుకుంటాడో చెప్పడం కష్టం. ఎటువంటి మనుషుల్నయినా అర్థం చేసుకోగలిగిన ప్రతిభ వుందికూడా, మౌనంగా ఏమీ తెలియని వాళ్ళలాగా తల వంచుకు తిరిగే బుద్ధిమంతులూ వున్నారు.

ఈ ప్రపంచంలో నేనూ కొన్నాళ్ళుగా సంచరిస్తూనే వున్నాను. ఇంతమందిలోనూ ముప్పాతిక మువ్వీసం మంది నాకు పరిచయస్తులే. అంతే, వాళ్లు నన్ను బాగా ఎరుగుదురు. చాలా మర్యాదగా దణ్ణం పెడుతూంటారు. నేను కనిపించగానే, యితగాడే మన సెలవు రోజులూ, జీతాలూ, అవీ లెక్కలు వేస్తూంటాడు గనక యితన్ని మంచి చేసుకోడం మంచిదని వాళ్ళ అభిప్రాయం. వాళ్ళుపెట్టే నమస్కారాలకి యింతకంటె అర్థమేమీ లేదు.

ఈ జనసముద్రంలో రామశరణు ఓక బిందువు. ఒక అల్ప విషయం మూలకంగా మా యిద్దరికీ మాటామాటా కలిసి, పరిచయం ఏర్పడింది.

ఆ రోజున తప్ప మరోరోజున అతడు వచ్చివుంటే, అసలు మేమిద్దరం కలుసుకోడం పడేదో లేదోకూడా సందేహమే. కాని, అది నెలలో ఆఖరివారం. ఆఖరివారంలో పనిరద్దీ ఎలావుంటుందంటే, క్షణం సేపు తలెత్తడానికైనా వీలుండదు. వందలకొద్దీ ఫారాలూ, లెక్కలూ, జాబితాలూ బల్లమీద మేటలుగా పడివుంటాయి. వేలకొద్దీ డ్రైవర్లకి, కండక్టర్లకి సంబంధించిన జీతాల పట్టికలూ, సెలవురోజుల లెక్కలూ రాసులుగా వుంటాయి. ఇవన్నీచూచి, ప్రతివాడికీ రావలసిన జీతాలు లెక్క కట్టడం — అంతే మూడేసి రిజిష్టర్లలో ఎక్కించడం, వాళ్ళ సర్వీసు రిజిష్టర్లు వ్రాయటం, సెలవులూ సస్పెన్షన్లు పుస్తకాల్లో ఎక్కించటం — యిలాంటి పనుల్తో రోజుకి తొమ్మిది, పది గంటలు పని చేసినా, పని తరగనే తరగదు. పైగా రోజురోజుకీ ఎక్కువవుతున్నట్లు కనిపిస్తుంది. ఆ చిరాకువల్ల ఆఫీసులో తోటి వుద్యోగస్తులతో కూడా చిన్న చిన్న పోట్లాటలు వస్తూంటాయి. అప్పుడప్పుడు కాస్త ముందు వెనకలు తెలిసిన డ్రైవర్లూ, కండక్టర్లూ మమ్మల్ని చూట్టానికి యీ వారంలో మాత్రం ఎప్పుడూ రారు. కర్మంచాలక ఎవరైనా ధైర్యం

చేసి వచ్చినా, మా దగ్గరనుంచి సరైన సమాధానం రాదు. మేం తలెత్తకుండానే, ఏదో రెండు మామూలు ప్రశ్నలు వేసి, నాలుగు రోజుల తరవాత మళ్ళీ కనిపించమని చెప్పి పంపించేస్తూ వుంటాం. అసలు మా పని ఒత్తిడి చూసింతరవాత వచ్చినవాడు అట్టేసేపు వుండకుండానే వెళ్ళిపోతాడు.

రామశరణుడు నాబల్ల దగ్గరకొచ్చి, నా అంతట నేను పలకరిస్తానేమోనని ఎదురు చూస్తూ కొంతసేపు నుంచున్నాడు. ఆ తరవాతనే "మాస్టర్‌సాబ్!" అన్నాడు అతి మెల్లిగా.

"ఊఁ ఏమిటి చెప్పు. నీ నెంబరేమిటి?"

"రెండువందల ఎనిమిది సాబ్."

"పేరు?"

"రామశరణ లలితా ప్రసాద్‌శర్మ"

"ఏం కావాలి?"

"నేనక చిన్న సంగతి తెలుసుకుందామని వచ్చాను. ఏమిటంటే..."

అంతవరకూ అని, కాస్సేపు ఊరుకున్నాడు.

"అదేమిటో అడుగు."

"మీరు కాస్త తలెత్తి చూడనైనా చూడండి."

"వీల్లేదు."

"ఏమిటి వీల్లేదు సాబ్?" అని కొంచెం స్వరం పెంచి అడిగాడు.

"తలెత్తడానికి..." ఏదో టైపు యంత్రంలోంచి అక్షరాలు పడ్డట్టు నానోటివెంట మాటలు బయటికి ఉరికాయి.

"నేను ఎవరనుకొంటున్నారేమిటి?" అని కాస్తకోపం వచ్చిన స్వరంతో మాట్లాడాడు.

"ఓస్, కండక్టరు; నెంబరు 208," అన్నాను. 1954 నంబరు బస్ కండక్టరు ఎన్ని రూపాయల బియ్యం తీసుకున్నాడో చూసి, అతని జీతపు లెక్కలో ఖర్చు రాస్తూ అన్నాను. ఇప్పుడుకూడా నేనతని వంక చూడలేదు. నా పక్కనున్న గుమాస్తాలు మాత్రం అతనివంక ఒకసారి చూచి, ఎవళ్ళ పనులు వాళ్ళు చూసుకుంటున్నారు.

"మాస్టర్ సాబ్ !"

"ఏంకావాలి నీకు ?" అని బొమలు ముడివేసి అడిగాను.

"ఈ యేడు నేను యెన్నాళ్ళు సెలవు పెట్టవచ్చునని."

"నాలుగు రోజుల తరవాత రా, ఇప్పుడేమీ చెప్పడానికిపీల్లేదు." అని మళ్ళీ నా పనిలో నేను మునిగి పోయాను.

కాని మొండివాడిలాగా అతడు అక్కడనుంచేనే వుండి పోయాడు. అతనలా నుంచున్నందు వల్ల నాకు పని మీద ధ్యాస నిల్వటం లేదు. అంచేత చేతిలో కలం బల్లమీద విసిరివేసి, కొట్టొచ్చి నట్టు కసిరాను.

"పో యిక్కణ్ణించి! సాలా, * అనవసరంగా విసిగిస్తాడు !"

"నే వెళ్ళ నిక్కణ్ణించి. ఏం చేస్తా వేమిటి ?" అన్నాడు ముఖం ఓ మాదిరిగా పెట్టి. నాకు గుండెలు గతుక్కు మన్నాయి. పొగరుబోతు కండక్టర్ల జాబితా నా దగ్గరెన్నాళ్ళ నుంచో వుంది. అందులో 208 నెంబరులేదు. పైగా, యితగాణ్ణి అదివర కెప్పుడూ చూచినట్టు కూడా జ్ఞాపకం లేదు నాకు. తీరా యింత అధికారమూ చెలాయించాక యిప్పుడు వెనక్కి తగ్గడం యిష్టం లేక పోయింది నాకు. అంచేత, మాటలతోనే మరోసారి గద్దించి చూదామను కున్నాను. ఒక్క ఉదుటున కుర్చీమీద నుంచి లేచాను

"ఏం చేస్తానో చూడాలని వుందా ?"

"అవును. చూడాలనే వుంది. ఏం చేస్తారో చెయ్యండి. మీరు మాటలు మాత్రం తిన్నగా రానియ్యండి. తిట్లూ గిట్లూ రానిచ్చారంటే ప్రాణం తీసేస్తా. జాగ్రత్త "

ఓరి వెధవ! ఏమిటి యిలా పేలుతున్నాడు!

"ఎవరు తిట్టారు నిన్ను ?" అని అడిగాను.

ఈ లోగా మా పై అధికారి రామశరణుని పిలిచాడు.

"ఏయ్! రెండువందల ఎనిమిదీ!"

"సాబ్"

---

* 'సాలా' అనే మాట ఊత పదం అసలు అర్థం 'బావ' అని. అలా అంటే కొంత మందికి కోపం వస్తుంది.

"ఇక్కర్ ఆవ్"

"చూడండి సాబ్. మనిషన్నాక కాస్త మర్యాద ఉండక్కర్లేదా?"

"ముందర యిలా రా?"

రామశరణుడు చకచకా ఆయన దగ్గిరికి వెళ్లాడు. ఇలాంటి ఘటన ప్రతిరోజూ జరుగుతున్నట్లూ, అందులో విశేషం వున్నట్లు నేను పరిగణించనట్లూ నటిస్తూ, చాలా పరాఖతుగా నేను మళ్లీ పని చూచుకోడం మొదలు పెట్టాను. అయినా, రామశరణుడూ పై అధికారీ ఏం మాట్లాడుకుంటున్నారో ఒక చెవి ఆలకిస్తూనే వుంది.

రామశరణుడి స్వరం యింకా తగ్గలేదు. అధికారి అతన్ని సముదాయించడానికి ప్రయత్నిస్తున్నాడు. నేను ఓరకంటితో ఒకసారి పరికించాను. కళ్లు ఉరుముతూ, నాకేసి వేలుపెట్టి చూపిస్తూ, ఏదో చెబుతున్నాడు. అతడు మాట్లాడుతున్న ఉత్తరహిందూస్థానపు స్వచ్ఛమైన హిందీ నాకర్థంకాలేదుగాని, అతను చెప్పటంలో నేనతన్ని "సాలా" అన్నానని మాత్రం ఆరోపిస్తున్నట్లు అర్థమయింది. నేనెందుకు తిట్టాలి – అనేదే అతని ముఖ్యవాదన. అదే అతనికి కోపకారణమూను. చాలా సేపయాక అతని స్వరం కొంత తగ్గింది.

"నీ సెలవురికార్డు తీసుకురా," అన్నాడు అధికారి. ఈ తగాదాల మనిషి మళ్ళీ నాదగ్గరకి రావడం ఎందుకన్న ఆలోచనతో, ఆ రికార్డు కాగితం పైకితీసి నౌకరు చేతే ఆఫీసరు దగ్గరకి పంపించేశాను. కొంచెం సేపయాక రామశరణుడు వెళ్ళిపోయాడు.

అతను వెళ్ళగానే ఆఫీసరు నన్ను పిలిపించాడు.

"యస్‌సార్"

"నువ్వు పనిచెయ్. కాస్త హిందీ నేర్చుకో."

"ఏం? ఏంజరిగింది సార్?"

"ఈ గడబిడ జరగడానికి కారణం, నువ్వు మాట్లాడే హిందీయే."

"సార్! అసలా కండక్టరే ఉత్త తగాదా మనిషండీ. లేకపోతే నేను మాటవరసకి 'సాలా' అని అంటే, అది అతన్ని తిట్టడానికి వాడేనని ఎందుకనుకోవాలి?"

"నిజమే అనుకో! మన జహంగీరు మాట మాటికి 'భాంచోత్', 'భాంచోత్' అంటున్నా మనం తప్పు పట్టుకోం."

"అదే నేను చెప్పొచ్చిందీను! ఏదో మాట వరసకి అంతే..."

"కాని, అలాంటి వాళ్ళ దగ్గర అలా మాట్లాడకూడదు. అయినా నువ్వు 'సాలా' అనడం మా మంచివాణ్ణి వెతికి అన్నావులే!"

"ఏం?"

"నీకి కండక్టరు సంగతి తెలియదా ఏమిటి? ఉత్త అడివి మనిషి! చూడ్డానికి గంగిగోవులా వుంటాడు మళ్ళీ. వాడిజోలికి పోకు. ఉత్త అమాయకుడే అనుకో. అయినా యిట్టే కోపం వస్తుంది. ఇహ కోపం వచ్చిందా – ఎంత పనైనా చేసేస్తాడు. కొట్టినా కొడతాడు. ఇవాళ అసలు యింత పెద్ద గొడవ జరిగేది కాదనుకో. నేను మొదటి నుంచీ కనిపెడుతూనే వున్నాను మీ యిద్దరినీ. డ్యూటీలో ఏదో జరిగి వుంటుంది ఆ చిరాకు అంతా యిక్కడ చూపిస్తారు గాడిదకొడుకులు."

"వీళ్ళలాంటి వాళ్ళయితే, ఇంక ఈ ఉద్యోగం చేయడమే అసాధ్యమై పోతుంది."

"ఇప్పుడింక గాబరా పడక్కర్లేదు. వాడు నిన్నెక్కడా పట్టుకు కొట్టడులే. కాని వా డట్లాంటివాడని మాత్రం జ్ఞాపకం ఉంచుకో. అంతే"

ఇహ ఆ మర్నాటి సంగతి. డ్రైవర్లూ, కండక్టర్లూ కలిసి వున్న గుంపుల మధ్యనుంచి నేను దారి చేసుకుంటూ ఆఫీసుకి వెళ్తున్నాను. కుడిచేతివైపు ఒక మలుపుదగ్గిర 208 కూచుని వున్నట్టు కనిపించింది. పెదిమలు కదుపుతూ తనలో తనే ఏదో గొణుక్కుంటున్నాడు. ఆఫీసులోకి వెళ్తున్నప్పుడల్లా 208 ఆ మూల కూచుని వున్నాడో లేదో ఒక కంట గమనించటం నాకొక వ్యసనమైపోయింది. ఒకవేళ అక్కడ ఉండటమేతటస్థిస్తే, అమిత శ్రద్ధతో ఏదో జపిస్తూఉండేవాడు అన్ని వేల మంది లోనూ ఏ ఒక్క స్నేహితుడూ లేకుండా, ఎవరితోనూ మాట్లాడే అవసరం లేకుండా, ఒంటెత్తుగా వున్నవాడు అతనొక్కడే కనిపించాడు.

208 సెలవు లెక్కలు తిరిగేశాను ఓ రోజుని – ఊరికేనే ఏమీ తోచక. అందులో వున్న అంకెలన్నీ అతి జాగ్రత్తగా పరిశీలిస్తూ పేజీలు

తిరగేస్తున్నాను. ఆ నాలుగు సంవత్సరాల లెక్కల్లోనూ అతనొక్క రోజైనా సెలవు తీసుకున్నట్టులేదు. ఏ పని వాడయినా ఆదివారం రోజున పనిచేస్తే, అతనికి ఒక రోజు సెలవు ఉన్నట్టు జమకడతాం లెక్కల్లో. పైగా ఆరోజుకి సగం జీతం కూడా వుంటుంది. ఈ 208 లెక్కల్లో అటువంటి రోజులు తెగ జమకట్టి వున్నాయి. ఆ అంకెలు చూచి గుండెల మీద చెయ్యి వేసుకున్నాను నేను. పందొమ్మిది వందల యాభై ఒకటీ, నలభైఎనిమిదీ, యాభై, నలభైఆరు - ఆనాలుగేళ్ళల్లోనూ అతను పదిహేను రోజులు మాత్రమే పనిలోకి రాలేదు. సెలవులు ఉపయోగించుకోక పోవడం వల్ల 40 సెలవు రోజులు మురిగి పోయాయి కూడాను.

ఇంత అస్తవ్యస్తపు మనిషి అసలు ఏవూరివాడోమరి. ప్రక్క సెక్షను లోకి వెళ్ళి అతని సర్వీసు రిజిష్టరు చూశాను. అల్హాబాదు ప్రాంతం వాడుట. నాలుగేసి నెలలు సెలవు పెట్టి సొంత వూళ్ళకు పరుగెత్తే కండక్టర్లు మా కంపెనీలో చాలా మంది వున్నారు. గడచిన ఆరు సంవత్సరాల్లోనూ ఒక్కసారైనా సొంతవూరికి పోని కండక్టరు యితనొక్కడే.

ఎందుచేతనో గాని, యితని విషయం పూర్తిగా తెలుసుకోవాలనే కుతూహలం యేర్పడింది నాలో. అంచేత పుస్తకాలు వెతకడం, లెక్కలు చూడ్డం ఆరంభించాను, ఏమీ అవసరం లేకపోయినా. 208 నెంబరు బస్ కండక్టరు నా మనసులో బస యేర్పాటు చేసుకున్నాడని నాతోటి గుమస్తాలందరూ నిశ్చయించుకున్నారు. నేను ఆ కండక్టరు విషయం గూఢంగా ఆలోచిస్తున్నానని వాళ్ళు స్థిరపరచు కున్నారు. నేను ఆ కండక్టరంటే భయపడి యీ దరియాప్తు అంతా చేస్తున్నాననుకున్నారు. నా పరోక్షంలో గుసగుసలాడుకోడం సాగించారు. ఈ ఆపత్సమయంలో నాకు ధైర్యం చెప్పాలని అందరూ కలిసి ఏకగ్రీవంగా తీర్మానించుకున్నారు. సెక్షన్‌లో నాకు సహాయంగా పనిచేస్తున్న ఒక గుమస్తా ఒకరోజున నా చెవికొరకడం మొదలుపెట్టాడు.

"ఇప్పుడింక భయంలేదు."

"ఏ విషయం ?" అన్నాను ఆశ్చర్యంగా.

"208 విషయమే."

దానికి నేను సమాధానం చెప్పలేదు. అంచేత నాకు ఆ విషయం మాట్లాడ్డానికి కూడా ధైర్యం చాలటంలేదని ఊహించుకున్నా డతను.

"ఏదైనా జరిగేటట్టయితే ఆ రోజే జరిగి వుండేది."

ఇలాంటి మనిషితో నేను యింకేం మాట్లాడను ? నాకు చిరాకు పుట్టుకొచ్చింది. "ఏమిటోయ్ ? ఏం జరిగిం దేమిటి మహా ? చాలు, నువ్వు నీ పని చూసుకో."

నే నతన్ని మందలిస్తూ మాట్లాడుతున్న సమయంలోనే, కాక తాళీయంగా 208 కండక్టరు నా దగ్గిరికే రావాలని ఆఫీసు మెట్లు ఎక్కుతున్నాడు. నేను తల వంచుకొని పని చూసుకుంటున్నాను. ఎవరో నాకు వినిపించేటట్లు "మీా కండక్టరు వస్తున్నాడు" అన్నాడు రహస్యంగా. చటుక్కున తలెత్తి చూశాను. తలెత్తడానికి పట్టిన అరక్షణంలోనూ అనేక ఆలోచనలూ ఊహలూ నా మెదడులో మెరిశాయి

ఈ పొగరుబోతు కండక్టరు నాదగ్గిర కొచ్చాడు... మన ప్రతిష్ఠ నిలబెట్టుకోడానికి యిదే మంచి సమయం. ఆ రోజుకిమల్లేనే మొఖం విసుగ్గా పెట్టి బొమలు అలాగే ముడి పెట్టిఉండాలి నేను. ఆ రోజుకి మల్లేనే అతనంటే లెక్కలేనట్టు మాట్లాడాలి. కండక్టరు పొగరు బోతట. అలాగేం ? అయితే నేం ? నేనంత తగ్గి మాట్లాడాలా ఏమిటి ?

అతనితో ఏ తరహాగా వ్యవహరించాలో నేను మనసులో ఒక నిశ్చయానికి వచ్చేలోపలే అతనికీ నాకూ చూపులు కలిశాయి. చేతులు జోడించి నాయెదట నిలబడివున్నా డతను. పరిచయ పుర స్సరంగా చిరునవ్వు నవ్వాలనే ఉద్దేశం అతనిలో వుంది గాని, ఆనవ్వు నా కిష్టం వుంటుందో వుండదోఅనే సందేహంకూడా అప్పుడే కలిగింది అతనికి. నాకు దగ్గరగానే నుంచున్నాడు. నాకు లభించిన యీా సగం సగం విజయం నా కేమీా సంతృప్తి కలిగించలేదు. నిజానికి అసలు అతనికీ నాకూ మధ్య వచ్చిన తగాదా ఆరోజునే ముగిసిపోయింది ఈ వేళ మిగిలివున్న తగాదా అల్లా నాకూ, నాతోటి గుమాస్తాలకూ మధ్య.

ఆ వెధవలంతా నే నేదో యీ కండక్టరుని చూసి బెదిరిపోయా నను కొంటున్నారు!

నే నతనికేసి కొంచెం కంగారుగా నే చూశాను. అతను నన్నేదో క్షమాపణ అడుగుతున్నాడు. ఆ రోజున తనకీ ఎవరో ప్రయాణీకుడికీ మధ్య మాటామాటా పడిందట. అంచేత తనమనస్సు నిలకడ లేదుట. కేవలం ఆ కారణం వల్లే నాదగ్గిరకూడా అలా మోటుగా ప్రవర్తించాట్ట!

అలాగే ఏవేఁవిటో చెప్పుకుపోయాడు. కాస్సేపయాక నేను నోరు తెరిచి మాట్లాడాను, అతని కేదో పెద్ద ఉపకారం చేస్తున్నట్టు. అతనొక చిన్న పనిమీద వచ్చాడు.

తనకి సెలవు కావాలిట!

నేను అతికంగారుగా అతని కేసి చూశాను. నేను పొరపాటు విన్నానా ఏమిటి?

"సెలవు కావాలా?" అని అడిగాను, నా సందేహం తీర్చుకోటానికి.

"హాఁ సాబ్."

కాశీ క్షేత్రంనుంచి ఎవరో పెద్ద సాధువు బొంబాయి వచ్చాట్ట. ఆయన దగ్గిర ఉపదేశం పొందాలని తన కెంతో కోరికగా వుందట. ఇదంతా నేనడగలేదు. తనంతట తనే చెప్పుకుపోయాడు. సెలవు తీసుకోటానికేమి చెయ్యాలో తనకి తెలియదుట. నేను కొంచెం సహాయంచేసి పెట్టాటానికి వీలుంటుందా అని అడుగుతున్నాడు నన్ను.

ఆఫీసు వెనకాల గదిలోవున్న సెక్షనులో కెళ్లి, ఒక సెలవు దరఖాస్తుఫారం తెచ్చాను. అతని పేరూ, నెంబరూ అదీ వేసి పూర్తి చేశాను. అలాగే, నాపై ఆఫీసరు సంతకం కూడా చేయించి, పెద్ద అధికారి వద్దకు దరఖాస్తు పంపించేశాను. పేదరికపు నిస్సహాయపు చూపులతో నాకు కృతజ్ఞత తెల్పుకుని వెళ్లిపోయాడతను.

# 3

రాత్రి పన్నెండు కొట్టింది. 'పాంలెస్' థియేటరు నుంచి తొందర తొందరగా బయటపడి దాదర్‌వెళ్ళే బస్సు పట్టుకున్నాను. అదే ఆఖరు బస్సు. పై అంతస్థు మీదికి వెళ్ళి ఒక చివర కూచున్నాను. రెండో చివర 203 ఏదో ఆలోచిస్తూ నిలబడి వున్నాడు. నేను గమనించనే లేదు. నేనూ ఏవో ఆలోచనల్లో మునిగి వున్నాను. అతను వంగి నమస్కారం చేశాడు. రెండు రోజులక్రితం అతని సెలవు దరఖాస్తు పూర్తిచేసి పంపించటంలో నే నతనికి ఉపకారం చేశానుట. ఆ కృతజ్ఞతా భావంచేతనే యితనిఃత వంగిపోయా డనిపించింది నాకు.

టిక్కట్టుకోసం నేను చిల్లర అందించాను. కాని అతడు టిక్కట్టు యివ్వలేదు. చిల్లరా తీసుకోలేదు.

"బాబూ, నువ్విలాంటి ఉపకారాలు మాత్రం చెయ్యకు ! ఇద్దరికీ కూడా ముప్పు వస్తుంది."

నేను బాగా పరిచయస్తుడితో మాట్లాడే స్వరంతో మాట్లాడాను. అతనేమీ మాట్లాడకుండా, ఒక మూడణాల టిక్కెట్టు పొడిచి నా చేతికి చ్చాడు. డబ్బుతీసుకోడానికి మాత్రం ఒప్పుకోలేదు.

"ఆఖరి ట్రిప్పా ?"

"హాఁ సాబ్"

ఆ తరవాత నేను మౌనంగా ఊరుకున్నాను, అతను నాదగ్గిర నుంచున్నాడు. మధ్య మధ్య నావేపు చూస్తున్నాడు. రైల్వే వర్కుషాపు దగ్గిరికి బస్సు వచ్చేసరికి అతను ఊరుకోలేక పోయాడు.

"మాస్టర్ సాబ్ !"

"యెస్ !"

"ఇంకా మీకు కోపం పోలేదు కదూ !"

"నే నేదో ఆలోచించుకుంటున్నాను – ఏదో సొంత విషయం."

"అచ్ఛా ! అచ్ఛా !"

అతను వెళ్లి ఒక ప్రక్కన కూచున్నాడు. నేనో సిగరెట్టు ముట్టించాను. అతను నాకేసి చూశాడు. అప్పుడు జ్ఞాపకం వచ్చింది నాకు, బస్సులో సిగరెట్లు కాల్చకూడదని.

"అరెరె! సిగరెట్టు తాగకూడదు కదూ?" అని అతనితో అంటూ, సిగరెట్టు ఆర్పేయడానికి తయారయాను.

"ఫరవాలేదండీ!" అంటూ అతను చటుక్కున లేచి నాదగ్గిరకి వచ్చాడు. కాని యీ లోపుగానే సిగరెట్టు క్రిందపడేసి, బూటు కాలితో నలిపేశను. ఆ నలిగిపోయిన సిగరెట్టు చూచి అతను చాలా ఖిన్నుడయాడు.

"అదేమిటి బాబూ, నేనుండగా? మీరు మీ యిష్టం వచ్చినట్లు సిగరెట్టు కాల్చుకోండి!"

నన్ను మళ్ళీ సిగరెట్టు వెలిగించుకోమని పట్టుపట్టుక్కూచున్నాడతను. నేను ప్యాకెటు విప్పి, అతనికొక సిగరెట్టు యివ్వబోయాను.

"తీసుకోవోయ్! నీ సంగతి మాత్రం గమనించడాని కెవరున్నారు యిక్కడ?"

"నాకు సిగరెట్లూ అవీ అలవాటు లేదండీ బాబుగారూ!"

నా ప్రక్కనున్న కిటికీలోంచి చల్లటిగాలి తగుల్తోంది. నేను గీసిన అగ్గిపుల్ల ఆరిపోయింది. అతను అతి చురుగ్గా నా ప్రక్కనున్న రెండు కిటికీలూ మూసేశాడు.

"మంచు మహా పడుతోంది. కాదు బాబూ?" అన్నాడు, కిటికీ వేస్తూ వేస్తూ.

"ఎన్ని సంవత్సరాలనుంచి యీ ఉద్యోగం చేస్తున్నావు?"

"ఎనిమిదేళ్ళయిందండి, యిప్పటికి"

"208 దీ, ఒకసంగతి అడగనా?"

"అడగండి సాబ్."

"డ్యూటీలో కెళ్ళేముందు ఒక మూల కూచుని రోజూ ఏమిటి గొణుక్కుంటూ వుంటావు నువ్వు?"

"ఏముంది బాబూ! ఏదో పిచ్చిగొణుగుడు. అంతే!"

"రామనామమా?"

నేను వూరికే తమాషాగా వేశా ఆ ప్రశ్న. అతను భక్తిగా ఔనని తల వూపాడు.

"రేపటి నుంచి సెలవుమీాద వెళ్తున్నానండి."

"నీకు సెలవు మంజూారయిందా ?"

"ఓ! తక్షణమే అయిందండి!"

"నీకు సెలవు దొరకడానికేం !"

అతను యింకా చాలా మాట్లాడే వాడే ననుకుంటూను. కాని మా యిల్లు వచ్చేసింది. నేను బస్సు దిగి మా యింటి పంచకి చేరుకున్నాను. అతను కిటికీలోంచి బయటికి వంగి నాకు దణ్ణం పెడుతున్నాడు.

ఆ రెండవ రోజు ఆఫీసు పని ముగించుకుని బయటపడే వేళకి నేను కుర్చీలోంచి లేవబోతుంటే, 208 తొందర తొందరగా నా బల్ల దగ్గరకి వచ్చి నుంచున్నాడు. చాలా సేపు ఏమీా మాట్లాడనేలేదు. చివరికి నేనే ప్రశ్నించాను.

"యెస్! ఏంకావాలి? నువ్విప్పుడు సెలవుమీాదున్నావుగా!"

అతనేమీా జవాబు చెప్పలేదు. ఏదో మతిపోయినవాడిలాగా యింకో కాస్సేపు నుంచుని, వెళ్ళిపోవడానికి వెనక్కి తిరిగాడు.

"208 ది!"

"పెద్దగా పనేంలేదు బాబూ. రేపు కనిపిస్తాను."

ఆ మర్నాడు ఆఫీసు మొదటి అంతస్థులో వున్న హాల్లో మళ్ళీ కనిపించాడు. చురుగ్గా నా దగ్గరకి వచ్చి, తొందర తొందరగా జేబులోంచి రెండు చిన్న పొట్లాలు తీసి, నా చేతిలో పెట్టాడు.

"ఏమిటిది ?"

"గురువుగారి ప్రసాదమండి! ప్రత్యేకంగా మీా కివ్వాలనే తీసుకొచ్చాను."

"సరిసరి! బాగానే వుంది!"

నేను ఆ పొట్లాలు విప్పాను. ఆ పొడి కొంచెం నుదుట రాసుకుని, రెండు చిటికలు నోట్లో వేసుకొని, ఆ పొట్లాలు మళ్లీ అతని కందించాను.

కాని, అతను తీసుకోలేదు.

"ఉణ్ణియ్యండి! మీ కోసమే తెచ్చా."

ఆ తరవాత అతనూ, నేనూ ప్రతిరోజూ కలుసుకొంటూ ఉండే వాళ్లం. నాకోసం ఎదురు చూస్తూ ఒకమూల కూచునే వాడతను. నేను కనిపించీ కనిపించగానే అక్కణ్ణించి లేచి, దణ్ణంపెట్టి నా దగ్గరకి వచ్చేవాడు. ప్రతిరోజూ ఏముంటుంది అతనితో మాట్లాడ్డానికి ? ఏవో రెండు మామూలు కుశల ప్రశ్నలడిగి వెళ్లిపోయేవాణ్ణి.

రెండు మూడు రోజులు అలాగే గడిచాయి. అతను మనసులో ఏదో ఉత్సాహం పొందుతూన్నట్లు తోచింది నాకు. ఆఖరికి ఒకరోజు బయటపడి నన్నొక ప్రశ్న అడిగాడు.

"ఏవండీ! పోయిన రెండు మూడు రోజుల్లోనూ ఏమయినా జరిగిందా ?"

"అంటే ?..."

"ఏదైనా శుభం జరగాలి. ఆ విభూతి చాలామందికి మేలు చేసింది లెండి !"

"అంత చెప్పుకో దగినట్లు ఏమీ జరగలేదే !"

నేను చెప్పింది అబద్ధం. ఆ విభూతి పెట్టుకున్న మర్నాడే నాకు టెంపరరీ హెడ్‌క్లర్క్ ఉద్యోగం దొరికింది. కాని చాలా రోజుల్నించి యీ అవకాశం వస్తుందనే అనుకుంటున్నాను. అయినా నేను అబద్ధం చెప్పవలసిన అవసరం ఏమీలేదు. అతని మనస్సు తృప్తిగా వుండటానికైనా నేను నిజం చెప్పేవాణ్ణే. కాని, ఉన్న విషయం చెబితే యింకా చాలా ఫలితాలు పుట్టుకొస్తాయి. నేను కూడా అతనికి మల్లేనే చాలా భక్తిగలవాణ్ణని అతను రూఢి చేసుకోవచ్చు. అతనికి ఆ భావం కలగటం నాకు సుతరాం యిష్టంలేదు. నేను ఏమీ జరగలేదని నీళ్ళు చల్లేటుగా అనే టప్పటికి, అతనికి చాలా నిరాశ కలిగింది.

"ఏమీ జరగనే లేదాండి ?"

"ఏమీ జరగనూ లేదు, జరుగుతుందని నాకు నమ్మకమూ లేదు."

నే నిలా మాట్లాడతాననుకోలేదు అతను. నిర్ఘాంతపోయి నాకేసి చూస్తూ నిలబడిపోయాడు.

"ఏఁవిటలా చూస్తున్నావు? నిజంగానే నాకు నమ్మకంలేదు అలాంటి వాటిలో."

"సాబ్! శ్రీరామచంద్రుడి ప్రసాదమండీ అదీ!"

"ఎక్కడి శ్రీరామ చంద్రు డేమిటి? నేనెరగను."

"మీరు దేవుడికి దణ్ణం పెట్టరా?"

"ఈ జగత్తులో ఎక్కడా దేవుడు లేడు. ఇంక నమస్కార మెవరికి?"

"అందరూ అట్లాగే అంటారులెండి బాబూ! ఏదైనా కష్టంవస్తే మాత్రం అప్పుడు జ్ఞాపకం వస్తుంది దేవుడిసంగతి."

"కష్టాలు వచ్చినప్పుడు కంగారు పడిపోతాడు మనిషి. ఏదో చిన్నప్పట్నుంచీ పెద్దవాళ్లు చెప్పి పెట్టారు, దైవం అన్ని కష్టాలూ తీరుస్తాడని. అంచేత తనుకూడా దైవాన్ని ప్రార్థించడం మొదలెడతాడు. అంతే. అంతమాత్రాన దైవం ఉన్నట్లు రుజువు కావడం లేదే!"

"వేళాకోళం చేస్తున్నారు మీరు. అవునా?"

"వేళాకోళం కాదోయ్! అసలు దేవుడు-దేవుడని దేవుళ్ళాడిన వాళ్ళు ఎవళ్ళు బాగుపడ్డారు పెద్దగా? మానవుడు స్వశక్తి మీద తప్ప దేనిమీదా ఆధారపడ కూడదనే నా అభిప్రాయం."

## 4

దీని తరవాత మా యిద్దరి మధ్య పరిచయం బాగా వృద్ధి అయింది. ఎప్పుడూ ఎవరితోనూ ఏమీ మాట్లాడని మనిషి ఏదో ఒక సాకు చూచుకుని నాతో కబుర్లు పెట్టుకునేవాడు. నాలాంటి 'అంతా అబద్ధం' అనే వ్యక్తిని బాగుచేసి, భక్తుణ్ణి చేయడానికి పరిపరి విధాల ప్రయత్నించడం మొదలెట్టాడు. "చెట్టుని విత్తు ఎలా పుట్టు కొస్తుంది?" "చెట్టు ఎలా అవుతుంది?" "మనం మాట్లాడ గలిగేటట్లు చేసిన శక్తి ఏది?" "గాలి ఎలా వీస్తుంది?" "మనం ఎలా పుట్టాం?" ఇలాంటి

ప్రశ్నలు నా యెదుట లేవదీసి లేవదీసి విసుగెత్తిపోయాడు. అతనితో రోజూ జరిగే ఈ సంభాషణ ఏదో కాలక్షేపం కోసమే సాగిస్తున్నానని అతనికి తెలియదు పాపం! ఓరోజున మాత్రం ఒక తెలివైనపని చేశాడు. నేను కాంటీన్‌లో కూచుని టీ తాగుతున్నాను తేలిగ్గా. దూరాన్నించి చూశాడు నన్ను. చకచకా నా దగ్గరకి వచ్చాడు.

"మాస్టర్‌సాబ్ !"

"ఏమోయ్ ! టీ తీసుకుంటావా ?"

"పేపర్లో విశేషం చూశారా ?"

నే నా వార్త చదవడం, ఆఫీసులో చాలాసేపు దాన్ని గురించి మిగిలిన వాళ్లూ నేనూ మాట్లాడుకోవడం పొద్దున్నే అయిపోయింది. గడచిన పాతిక ముప్పై సంవత్సరాల్లోనూ ఎప్పుడూ లేనంత వర్షం పడిందట బీహారులో. ఊళ్లకి ఊళ్లే - ఉన్నచోటు తెలియకుండా - మునిగిపోయాయి; కొట్టుకుపోయాయి. వేలకొద్దీ మైళ్లవరకు వ్యాపించిన జలమయం తలచుకొని మే మందరం కలవరపడ్డాం. 208 ని తృప్తిపరచడంకోసం ఆ పేపరువంక ఓసారి చూచి, హెడ్డింగు చదివాను. నా మనస్సులో ఉన్న సానుభూతిని వ్యక్తపరిచాను. అతను కూడా ఆ ప్రాంతానికే చెందినవాడని నాకు ఉన్నట్టుండి జ్ఞాపకం వచ్చింది.

"మీ వూరుకూడా ఆ చుట్టుప్రక్కనే కదూ ?"

"అక్కడికి చాలా దూరమండి. మా వూరుపేరు 'జలువా' అండి."

"ఏ ప్రాంతం అది ?"

"జాన్‌పూర్ ఎక్కడో తెలుసా మీకు ?"

"తెలియదే !"

"కాశీ అయినా ?"

"కాశీ తెలియకుండా ఎట్లావుంటుంది ?"

"ఏమో 'అంతా అబద్ధం' అనేవారు కదా మీరు ! కాశీనుంచి పద్దెనిమిది మైళ్ళు జాన్ పూర్. అక్కణ్ణించి పదకొండు మైళ్ళు వెడితే, గోమతి నది ఒడ్డున ఒక కనుమ వుంది. ఆ కనుమ దాటితే మావూరు."

'ఈ వరదలూ వర్షాలూ ఎక్కడ ?'

'మావూరికి చాలా దూరంగానే. మాకేం ఫరవాలేదు !'

'అంచేతనే నిర్భయంగా వున్నట్టున్నావు నువ్వు. నే చెప్పేదేమిటంటే...'

'అదేమిటి సాబ్ ? నాకూ బాధగానే వుంది, ఆ వరదలు వచ్చాయని వింటే.'

'నీ ముఖంలో మాత్రం ఆ బాధేమీ కనిపించటంలేదు.'

'మిమ్మల్ని ఒక సంగతి అడగవచ్చా ?'

'దానికేం? అడుగు.'

'ఈ వరదల్ని, వర్షాన్ని ఎవరు తెప్పించారు ?'

'అంటే ?'

'పోనీ యివి ఆపి చూపించ గలరూ ?'

'నావల్ల కాదురా బాబూ !'

'మరి మానవుడు సర్వమూ చేయగలడుగా ?'

'ఓహో ! ఆ సంగతా ? నాలుగు రోజుల తరవాత కనిపించు. ఈ వరదలకీ, వానలకీ తట్టుకొనేటట్లు మానవు లెలాంటి కట్టుదిట్టాలు చేశారో చెబుతాను నీకు. ఇదంతా ప్రకృతియొక్క లీల. అంతే.'

'అయితే సరే ! మీరు ప్రకృతి అంటారు. మేము దేవుడు–రాముడు అంటాం.'

'అయితే, నీకూ మాకూ అట్టే తేడా లేదు. ఒకే వస్తువుకి మనం వేరువేరు పేర్లు పెట్టుకున్నాం. అంతే, కాని ఆ పేరు 24 గంటలూ జపిస్తూండడంవల్ల నీకేం ఉపయోగమనేది మాత్రం నా కర్థం కావడం లేదు.'

వాదనలో నన్ను ఓడిద్దామనే వుద్దేశంతో వచ్చాడు పాపం. కాని నా ఆఖరు వాక్యం విని మాత్రం అతనికి చాలా చిరాకు పుట్టింది.

# 5

208 రెండు మూడు రోజులనుంచి మామూలుగా అతను కూచునే స్థలంలో కనిపించడం లేదు. వాకబు చేద్దామని అనుకున్నాను గాని, ఎవర్నీ అడగలేదు. నేను యీ 208 కండక్టరుతో మరీ ఎక్కువ చనువుగా వుంటున్నాననే విషయం కొద్ది రోజులుగా నన్ను బాధపెడు తోంది. పదిమంది గమనిస్తున్నా నేనతనితో ప్రతిరోజూ బాతాఖానీ పెట్టుకోవటం నా ప్రతిష్ఠకి మంచిదికాదని నే నెరుగుదును కూడాను. అంచేతే, ప్రస్తుతం అతను ఏమయిపోయాడన్న సంగతి ఎవర్నీ చొరవగా అడగలేకపోయాను.

కాని, అతన్ని ఆరురోజులు సస్పెండు చేశారన్న వార్త నాకో రోజున అకస్మాత్తుగా తెలిసింది ఆఫీసులో. దాంతో అతన్ని గురించి వాకబు చెయ్యడానికి ఎక్కువ ఆతురత చూపించకూడదని నేను చేసుకున్న నిశ్చయం నీరసపడిపోయింది. ఆఫీసులో నా చుట్టుప్రక్కల వాళ్ళలో యితన్ని సస్పెండ్ చేసిన విషయమే సంభాషణ జరిగింది, కొంచెంసేపు. అతనివల్ల ఏనాడూ ఏలోపం జరిగినట్లూ అతని రికార్డులో లేదు. అంత స్వచ్ఛమైన రికార్డుగల కండక్టరు యిప్పుడు ఆరురోజులు సస్పెండ్ అయేటంత తప్పు ఏం చేసివుంటాడు? నేను వున్నట్టుండి కుర్చీలోంచి లేచి వెళ్ళి స్టార్టరుతో ఫోనులో మాట్లాడాను.

"హలో! 208 వచ్చాడా?"

"ఆ!"

"అతని డ్యూటీ ఎన్ని గంటలనుంచి?"

"అతన్ని సస్పెండ్ చేశారు."

"ఇక్కడికోసారి పంపించు. నా పేరు చెప్పు."

అతని రాకకోసం ఎంతో ఆదుర్దాగా ఎదురుచూస్తూ కూచున్నాను. కాని తీరా అతను వచ్చి నా కెదురుగా నుంచునే టప్పటికి నిశ్చేష్టుణ్ణయిపోయాను. అతని ముఖంలో విచారంగాని, అవమానంగాని ఏమీ కనిపించలేదు. అతని ముఖ భావం మామూలుగా వున్నట్టే,

ఓపికా పట్టుదలా వున్నవాడిలాగానే వుంది. నేనెంతో గుచ్చిగుచ్చి అడిగాను. కాని అతను ఏ విషయమూ స్పష్టంగా చెప్పలేదు. తను యీ శిక్షమీద అపీలు చేశాట్ట. తప్పకుండా గెలుస్తాట్ట.

208 వెళ్లిపోయాడు. అతను సగం సగమే సంగతులు చెప్పినందుకు నాకు ఏమీ తెలియనప్పటికంటె ఎక్కువ ఆదుర్దా పట్టుకుంది. అతని కేసు కాగితాలు తెప్పించి చదివాను. అనుకోకుండానే తారీకు గమనించాను.

అతనికీ నాకూ మొట్టమొదట మాటా మాటా పదినరోజున జరిగింది. ఎవరో ఒక పార్సీ ఆవిడతో అమర్యాదగా మాటాడాడని కండక్టరుమీద కేసు పెట్టారు. ఆ కేసు కాగితాలు చూస్తూ అక్కడే నుంచుండి పోయాను కొంచెంసేపు.

"ఏమి అంతగా ఆలోచిస్తున్నారు?" కోర్టు క్లర్కు వేసిన యీ ప్రశ్న వినబడేటప్పటికి నాకు స్పృహ వచ్చింది.

"ఈ కేసు పెద్ద బలంగా వున్నట్టు ఏం లేదే!"

"దాని ముండామోసిరి! ఇట్లాంటివి లక్ష కేసులు వస్తూంటాయి. పోతూంటాయి.

అతనన్నమాట నిజమే. నిరంతరం లక్షపనులతో ఊపిరాడకుండా వుంటూంటే, యిలాంటి చిన్న విషయాలు లెక్కచెయ్యటానికి ఎవడికి కేమి పట్టింది?

"ఈ కేసు విషయంలో యిప్పుడిహ ఏమిచెయ్యడానికీ వీలు లేదుగా!"

"మీరు నిన్న వచ్చివుంటే... ..."

"నాకివ్వాళే గదటయ్యా యీ సంగతి తెలుస్త."

"మీకీ కేసును గురించి యింత ఆసక్తి దేనికి?"

"ఆసక్తి ఏమీలేదు. ఏదో పేదవాడుగదా అనీ, అమాయకుడు గదా అనీను. అయినా అపీలు చేశాట్టగా! చూద్దాం! ఆ అపీలువల్ల ఏమీ ఉపయోగం వుండదు.

208 అపీలుభారం నెత్తినవేసుకున్నప్పటినుంచీ మనిషే మారిపోయాడు. తులసిమాల జపంచేసుకుంటూ ఓమూల కూర్చున్నా, ఇన్నాళ్లూ

అతనిచూపు చుట్టుప్రక్కల ఏమి జరుగుతున్నదీ కనిపెడుతూనే వుండేది. నా రాకపోకల అలికిడి అతనికి అజ వుండేది. ఇప్పుడదేమీ లేదు. ఒక్కక్షణం వ్యవధిదొరికినా, రామనామం జపిస్తూ ఉండేవాడు ఏ కాగ్రతతో. తన ప్రభువయిన శ్రీరామచంద్రుడి శక్తికీ, అస్తిత్వానికీ కూడా పరీక్ష దగ్గర పడుతున్నట్లు తోచింది అతనికి

చివరకి పరిస్థితి చాల విచిత్రంగా తయారైంది. అపీలు విషయంలో వెంగ పెట్టుకోవలసిన అతను నిశ్చింతగానే ఉన్నాడు! నేను మాత్రం పిచ్చివాడిలాగా, అపీలు వాయిదా ఎప్పుడు పడుతుందో అని గుంజాటు పడిపోతున్నాను. మా కంపెనీలో యీ కేసులు, అపీళ్లు అనేవి ఒక పెద్ద కర్మకాండ అనీ, కంపెనీ చాలా చాలా గంభీరంగా ఆలోచిస్తుందనీ, తీర్పు చెప్పడానికి నిర్ణయించిన ఆఫీసరుకి అదో పెద్ద విషమ సమస్య అయిపోతుందనీ నాలో అభిప్రాయం ఏర్పడిపోయింది.

చివరకీ అపీలు ఎప్పుడు విన్నారో, సాక్షుల్ని ఎప్పుడు విచారించారో, తీర్పు ఎప్పుడు చెప్పారో నాకు తెలియనే లేదు.

# 6

ఆఖరి మెట్టు దగ్గర మోకాళ్ళమీద కూచుని వున్నాడతను. నేనతని వెనక ప్రక్కనుంచి చనువుగా బుజం మీద చెయ్యివేసి, "రామశరణ్!" అని పిలిచాను. బుజం పట్టుకుని ముందుకీ వెనక్కీ ఊపాను. చివరకి మెట్టు దిగి, అతని ముందరికి వచ్చి నుంచున్నాను. మొగాన్ని కప్పి వున్న చేతులు యివతలకి తీశాను.

అతను ఏడుస్తున్నాడు!

అతని చెయ్యి నా బుజంమీద వేసుకుని లేవతీశాను. అలాగే మెల్లిగా నడిపించుకుంటూ రెస్టు రూమ్‌లోకి తీసుకెళ్ళాను.

"ఆ కుర్చీలో కూచో నువ్వు!"

'నాకు సిగ్గుగా ఉంది!'

"ఆ పార్టీ ఆవిణ్ణి తిట్టినప్పుడు సిగ్గెయ్య లేదూ?"

నా ప్రశ్న వినగానే, మొగం ఎత్తి నా వైపు ఉరిమి చూశాడు.

'ఏమిటలా చూస్తావ్?'

'ఈ ప్రశ్న వేసింది నేను గనక, చూడ్డంతో సరిపెట్టాను. ఇంకెవరయినా అయితే చెప్పు తీసేవాణ్ణి'! 'అయితే ఆవిడ చేసిన ఆరోపణ అబద్ధమా?'

'కాకపోతే నిజమా?'

'ఆపైన ఏం జరిగింది ఆ రోజున?'

'పోనిద్దురూ! యింతకీ నా రికార్డులకి ఒక కళంకం మట్టుకు వచ్చి పడింది.'

'తుడిచేయడానికి సాధ్యమవుతుందేమో చూదాం!'

'అయిదేళ్ళ కుర్రాడికి టిక్కెట్టు తీసుకోనంది. వాడికి ఏణ్ణర్థమేనని బుకాయించింది.'

'వదిలిపెట్టేయాల్సింది! ఏం కొంప మునిగిపోయింది? డబ్బులు లేవేమో పాపం!'

'మంచివారే! ఆవిడ కట్టుకున్న చీర చూడాల్సింది మీరు. ఆవిడ ఠీవి చూడాల్సింది. ఇనస్పెక్టరు వస్తే వదిలేసేవాడేనా?'

'నువ్వు టిక్కట్టు కొనిపించావా?'

'ఓ! టిక్కట్టు కొనకుండా .'

'అందుకే యిలా పగతీర్చుకుంది నీ మీద. సరేగాని, నువ్వీ తగాదా అంతా యూనియన్ ద్వారా ఎందుకు నడపలేదు?'

'యూనియనా?'

'అసలు నువ్వు వాళ్ళతో సంప్రతించావా?'

'అయ్యో! ఆ యూనియన్ కేవలం చందాలు పోగుచేసుకోటానికే!'

'మరి నీ ప్రభువు రామచంద్రుడో? ఆయన ఏంచేస్తున్నట్టు? మీ గురువుగారిని కనుక్కో పోనీ!'

నేనతని హృదయాంతరాళంలో చెయ్యి పెట్టి కెలికాను. అంత వరకూ నీరసంగా కుర్చీలో పడివున్న శరీరాన్ని సరిగా లేవదీసి కూచో పెట్టాను. అతన్ని అణిచేసిన సిగ్గూ, అభిమానం అంతర్ధాన మయాయి. నామాటల కడ్డువచ్చి మాట్లాడాడు అతను.

'మాస్టర్ సాబ్ ! దీనంతటితోనూ దేవుడికేం సంబంధంవుంది ? అయినా మీకు దేవుడంటే నమ్మకమే లేదుగా !'

'నా అభిప్రాయంలో దేవుడి కేమీ సంబంధంలేదు. కాని నీకు ఆయనమీద భక్తి విశ్వాసాలున్నాయి గనక అడిగాను. మీ దేవుడు తన భక్తుల్ని బహూకరించే పద్ధతి చాలా విశిత్రంగా వుంది.'

'ఇదంతా నా పూర్వ కర్మ !'

'నోరు మూసుకో ! కార్మా గిర్మా అనే సాకులు నాకు పనికి రావు ఏదైనా నాకు మంచి జరిగితే. అది భగవంతుడు చేసినట్లూ, చెడు జరిగితే ...'

'మీరు ఎన్ని చెప్పినా నాకు దైవంలో నమ్మకం పోదులెండి ! ఇంతకీ, యిప్పుడు ఏమంత పెద్ద విపత్తు సంభవించిందని? భగవంతుడు పరీక్ష చెయ్యకలచుకుంటే, యింతకంటె చాలా విషమమైన పరీక్షలు పెట్టగలడు.'

'నువ్విలాగే అనుకుని తృప్తిపడుతూ ఉండాలనుకుంటే, అలాగే చెయ్యి ! అదే నేనయితే, మీ శ్రీరామప్రభువు చెవి మెలివేసి సంజాయిషీ చెప్పమనే వాణ్ణి.'

'దైవం ఏమైనా దుకాణం పెట్టాడా ఏమిటీ బాబుగారూ, వస్తువుకి ఖరీదిచ్చాం అనుకోటానికి ? అలాకాదు. అది కానేకాదు బాబూ !'

'నీకు నచ్చదేమోగాని, నిజమైన రామ ప్రభువు మనుషుల్లోనే వున్నాడు; యింకెక్కడో లేడు.'

'అయితే రామ ప్రభువు ఉండడం మట్టుకు ఉన్నాడు.'

ఈముక్క అని అతను లేచి నుంచున్నాడు. టీ తాగమని బలవంతపెట్టాను. కాని అతను తీసుకోలేదు.

'ఎక్కడికి బయలుదేరావు ?'

"ఇంటికి."

"ఇంటికెళ్ళి ఓ మూల కూచుంటావా?"

"ఊరికే ఎందుక్కూచుంటాను? తులసీ రామాయణం పారాయణ చేసుకుంటూ కూచుంటాను. ఇన్నాళ్లూ తులసీదాసుని మరిచే పోయాను. ఈగొడవ జరగడం మంచికే వొచ్చింది ఒక విధంగా."

వారంరోజులవగానే, మళ్లీ అతని మామూలు చోటులో అతను చేరుకున్నాడు. మొగం చాలా తీసిపోయింది. మనిషి బాగా చిక్కాడు. కళ్లు లోపలికి పోయాయి. అతనివంక చూస్తే బాధ కలుగుతుంది. చూడాలనిపించటం లేదు.

అతనికి కనిపించకుండా తప్పించుకోడానికి నేను అక్కడనుంచే వెనక్కితగ్గి, ఆఫీసుచుట్టూ తిరిగి, వెనకవేపు మెట్లమీదనుంచి నా రూముకి చేరుకున్నాను.

కాని అతని చిక్కినశరీరం నాకళ్ళయెదుట కనిపిస్తూనేవుంది. నేను ఎటుచూచినా అదే కనిపిస్తోంది. ఒకసారి అతన్ని కలుసుకుని, కష్టసుఖాలు అడిగి తెలుసుకుని, అతనికి ధైర్యంచెప్పి ఊరడించాలని నామనసు బాధిస్తోంది.

కాని ధైర్యం చాలలేదు. అతనితో ఏమనాలో, ఎలా అనాలో అనేదే నాకు సమస్య అయిపోయింది. పోయినవారం మేం కలుసుకున్నప్పుడు జరిగిన సంభాషణ నాకు అప్రయత్నంగా జ్ఞాపకమొచ్చింది. నేనతన్ని అడిగిన మర్మభేద్యమైన ప్రశ్నలన్నీ జ్ఞాపకమొచ్చాయి. ఆ పరిస్థితుల్లో నేనంత అపసవ్యంగా మాట్లాడి అతన్ని నొప్పించకుండా వుండవలసిందని పించింది. జీవితంలో అతనికున్న ఒక్క ఆధారమూ, నమ్మకం భక్తి. దాన్ని ధ్వంసంచేస్తే నా కొచ్చే దేముంది? అతన్ని నాస్తికుణ్ణి చేసినందువల్ల యిప్పటికంటె ఎక్కువ సుఖపడతాడా ఏమన్నానా? ఇకమీదట యీ విషమై రామశరణుడితో చర్చ పెట్టుకోరాదని నిశ్చయించుకున్నాను.

మళ్ళా అది నెలలో నాలుగోవారం. కాలెండరుకేసి చూశాను. మేం తగవులాడుకున్న తేదీకి మొదటి పుట్టినరోజు! కాదు కాదు;

మొదటి మాసికం! ఆరోజున రామశరణుడు కనిపిస్తే మా తగవులాట సంగతి అతనికి జ్ఞాపకం చేయాలని నిశ్చయించుకున్నాను.

కాని ఆరోజున అతను కనిపించనేలేదు. మర్నాడు అవుపించాడు. తను సస్పెండు అయినందువల్ల జీతంలో ఎంత నష్టం వస్తుందో ఆలెక్క కావలసివచ్చిం దతనికి. అతని జీతం, బేటా అన్నీ అంకెలువేసి, మొత్తం కూడాను. అతను శ్వాస బిగపట్టి నాకేసే చూస్తున్నాడు. జీతభత్యాలు లెక్కకట్టి, మినహాయింపులు తీసేసి, చివరికి వచ్చిన అంకెచూస్తే, షాక్ కొట్టినట్టయింది. అంచేత యింకా ఏమేమిటో అంకెలువేస్తూ కాలం గడుపుతున్నాను. కొంతసేపటికి అతనే చొరవ చేసుకుని అడిగాడు.

"ఎంతండి అయ్యగారూ?"

"కాస్త ఎక్కువే," అన్నాను.

"ఫరవాలేదు, అంకె చెప్పండి!"

"ఇరవై రూపాయలు."

నష్టం ఎక్కువగా వున్నా, అదెంతో తెలుసుకోడానికి సిద్ధపడే వచ్చాడతను. అయినా, నేను చెప్పిన అంకె వినగానే అతని ముఖం వాడిపోయింది.

"అంత ఎక్కువయిందండీ?" అన్నాడు, తడబడుతున్న మాటలతో.

"రెండు మూడు రూపాయలు ఎక్కువ తక్కువ లుండవచ్చుమహా వుంటే."

కొంతసేపు అలాగే నిలబడి వుండిపోయాడు. నేను తలపైకెత్తలేదు. అతన్నెలా సముదాయించడమా అని ఆలోచిస్తున్నాను. నిమిషం అయాక నేనే లేచాను. ఇదివరలో సస్పెండయిన కండక్టర్ల కార్డులు వెతికి, అయిదారు తీసి అతనిముందు పడేశాను.

"ఏమిటండివీ?"

"సస్పెండయిన కండక్టర్ల కార్డులు."

"అయితే, ప్రతినెలా ఎంతమంది సస్పెండవుతూంటా రేమిటండీ?"

"బోలెడంతమంది! ఎవరు లెక్కపెడుతూ కూచుంటారు? నిన్ను ఆరురోజుల వరకు సస్పెండు చేశారు. 8, 10, 12 రోజులవరకు సస్పెండయిన వాళ్లు చాలామంది వున్నారు."

"ఏం తప్పులు చేశారు వాళ్లందరూ?"

"ఏదో ఒకటి. నీలాగే! ఎవరు దర్యాప్తు చేస్తారు? ఎవరికి తీరిక వుంది?"

"అయితే మాకు త్రాత ఎవరూ లేరా?"

"నీ త్రాత నీ ప్రభువు రామచంద్రుడు."

ఆ ముక్క అన్న తక్షణం నాలుక కరచుకున్నాను. అతన్ని ఉడికించ కూడదని నేను నిశ్చయించుకున్న మాట నిజం. కాని అతను యిలాంటి వాటిని సహించడం అలవాటు చేసుకున్నాడు. నా ఎగతాళిని అతడు లెక్కపెట్టలేదు.

"అయ్యగారూ! రామచంద్రప్రభువు త్రాత అన్నమాట నిజమే. కాని మనుషులం కూడా కాస్త ప్రయత్నం చెయ్యాలి."

"అయితే నే చెబుతా విను. మీకు జరిగే అన్యాయాలని ప్రతిఘటించాలంటే, ఒకడో యిద్దరో సాధించగలిగేదిలేదు. ఏ ఒక్క కండక్టరుకి తగిలిన దెబ్బయినా... పద, మనం కాఫీ హొటల్‌కి వెళ్దాం!"

కాఫీ హొటల్లో కూచున్నాం. రామశరణుడు బెదురుతూ బెదురుతూ, "ఏమిటిసాబ్ మీరంటున్నది?" అని అడిగాడు.

"ఏ ఒక్క కండక్టరుకి తగిలిన దెబ్బయినా, మీ అయిదువేల మంది కండక్టర్లూ, డ్రైవర్లూ తమకు తగిలిన దెబ్బేనని అనుకోగలిగితే, అప్పుడొక శక్తి ఉద్భవిస్తుంది."

"నిజమే మీరు చెప్పినమాట. అందరిలోనూ భగవంతుడున్నాడని ఊరికే నోటితో అంటున్నాం."

"టీ తాగుతావా?"

"ఆ"

రామశరణుడు లేచాడు. నే నతన్ని కూచోపెట్టబోయాను.

"వెడతాను అయ్యగారూ. డ్యూటీకి టైమయింది."

"వారం రోజుల్లో ఎంత చిక్కిపోయావు!"

"పొలుతప్పు యింకేమీ పుచ్చుకోలేదండి యీ వారంరోజులూ."

"ఊరికే ప్రాణాన్ని హైరాన పెట్టడం తప్ప, అలాంటివాటి వల్ల ఏమి ఉపయోగం ?"

"ఊరికే ఏమిటి సాబ్ ? లోపల కుతకుత లాడుతూంటే! నా యాతన ఎట్లాంటిదో మీ కెలా చెప్పగలను ?

"పైకం ఏమయినా అవసరమయితే చెప్పు నేనిస్తాను. నీ వీలు చూసుకుని తీర్చుకోవచ్చు."

'పైకం విషయం కాదండి! నా రికార్డు మీద కళంకం వచ్చి పడింది. ఆ తాపమే నేను భరించ లేకుండా వున్నాను. నే వెళ్ళొస్తానండి!''

# 7

ఇట్లా ఒక సంవత్సరం గడిచిపోయింది. ఒక సంవత్సరం పూర్తిగా తిరిగి పోయే లోపల అనేక ఘటనలు జరుగుతాయి. ఈ సంవత్సరంలోనూ చాలా ఘటనలు జరిగాయి. నాకు హెడ్ గుమాస్తా కుర్చీ ఖాయం అయిపోయి చాలా రోజులయింది. ఛీఫ్‌క్లర్క్ ఉద్యోగం కూడా రావచ్చుననే అనుకుంటున్నాను. ఒక విధంగా సంతోషించ వలసిన విషయమే మరి!

పెద్ద దొరగారు పిలుస్తున్నారని కబురు రాగానే అందరూ నన్ను అభినందించడం మొదలు పెట్టారు. ప్రమోషను సంగతి చెప్ప టానికే పిలుస్తున్నారని అందరికీ తెలిసిపోయింది. ఇది చాలా రోజుల నుంచీ అనుకొంటున్న విషయమే. అందుచేత అపరిమితానందం చెంద వలసిన అగత్యంలేదు.

నేను పెద్ద దొరగారి గదిలోకి వెళ్ళేటప్పటికి ఆయన ఏదో పనిలో మునిగి వున్నారు. తల ఎత్తకుండానే "ఇప్పటికి తీరిక దొరి కిందా ?" అని అడిగారు.

"గోల్నాకా డిపోకి తనిఖీకి వెళ్ళి యిప్పుడే వచ్చానండి."

"మంచిది. కూచో. నీకో శుభ వర్తమానం చెప్పాలి. నీకు ఛీఫ్ క్లర్కు ఉద్యోగం వచ్చింది. వచ్చిందీ అంటే వస్తోంది. అర్డరుపడి ఐ. డి. సి. టి. సంతకంపడి, టి. ఎ. ఒ. దగ్గరకి వెళ్ళింది. ఒకటి రెండు రోజుల్లో వచ్చేస్తుంది."

ఇంతమాత్రం చెప్పి ఆయన మళ్ళీ తన పనిలో పడిపోయారు.

"థాంక్యూ సర్!" అని నేను లేవబోయాను. నన్ను సౌంజ్ఞతోనే కూర్చోమన్నారు. చాలా సేపయాక తలఎత్తారు. కళ్ళజోడు అద్దాలు తుడుచుకుంటూ నాకేసి చూసి, ఒక చిరునవ్వు నవ్వారు.

"చిత్తం?"

"కూచో! నీతో కొన్ని ప్రైవేట్ విషయాలు మాట్లాడాలి. ఇప్పుడు నీతో చెప్పబోయే విషయాలు నేను నీ పై అధికారి హోదాలో చెప్పడంలేదు. నీ శ్రేయస్సుకోరినవాణ్ణి గనక వ్యక్తిగతంగా మాట్లాడుతున్నాను. అవి జ్ఞాపకంపెట్టుకో. నువ్వు జాగ్రత్తగా మసులుకొంటే కొద్దికాలంలో యీ కుర్చీలోకే రావచ్చుకూడాను. నీకు కాలేజీడిగ్రీ వుంది. కష్టపడి పనిచేస్తావు. పెద్ద ఉద్యోగుల కుండవలసిన చొరవా, బాధ్యతలు స్వీకరించే ధైర్యమూ ఉన్నాయి. కాని, ఒక్క సంగతి మాత్రం ... ... "

"ఏంవిటండి?"

"ఇంకో రెండుమూడేళ్ళలో పెద్ద ఆఫీసరుగ్రేడ్లోకి రావచ్చు నువ్వు. ఇంత చిన్నవయసులో ఆఫీసరుపదవిలోకి రాగలిగినవాడివి నువ్వొక్కడివే ఆఫీసంతకీ. ఏ మనిషైనా బాగా వృద్ధిలోకి రావాలంటే, బుద్ధిబలం, శ్రమపడి పనిచెయ్యడం మాత్రమే చాలదు. లౌకిక దృష్టికూడా చాల అవసరం. ముఖ్యంకూడాను. ఇదివరలోకూడా ఒకసారి చెప్పాను నీతో యీ విషయం. బహుశా నీకది జ్ఞాపకం ఉండి వుండవచ్చు."

"ఎందుకుండదండీ?"

"నేనూ అట్లాగే అనుకున్నాలే!"

'ప్రస్తుతం నేను ఆ యూనియన్ వ్యవహారాల్లో ఏమీ కలగ జేసుకోడంలేదండి!'

'మంచిదే!'

'తమకా విషయం తెలిసివుంటుందనే అనుకున్నాను.'

నా మాటలవల్ల ఆయనకేమీ తృప్తికలిగినట్లు కనిపించలేదు. ఆయన వినీ విననట్టు ఊరుకున్నారు. ఆయన చాలాసేపు మౌనంగా వుండిపోయారు. నాకేమీ పాలుపోలేదు. చాలాసేపటికి ఆయన తల యెత్తారు.

'అయితే, నా మాటల్లో తమకు నమ్మకం లేదాండి?'

'నమ్మకం లేక కాదు. నువ్వన్నది అక్షరాలా నిజమే అయి వుండవచ్చు. అయివుండవచ్చు కాదు, నిజమే అందాం పోనీ. కాని ...'

అర్ధోక్తిలోనే ఆపేశా రాయన.

'తమరు స్పష్టంగా సెలవియ్యండి. నేనేమీ నొచ్చుకోను.'

'చూడు! ఇప్పుడు నేను నీతో వ్యక్తిగతంగా మాట్లాడుతున్నాను. పై అధికారినని కాదు.'

'మీరు చేస్తున్న ఉపకారానికి నేను చాలా కృతజ్ఞుణ్ణి.'

'నువ్వు స్వయంగా ఏమీ చెయ్యక పోయినా, యిప్పుడు నువ్వు ఆరంభించిన వ్యవహారం చాల వరకు ముదరవచ్చు.'

'అంటే నండి?'

'బి. సి. 208 నీదగ్గరకి తరుచు వస్తూ పోతూ ఉంటాడు కదూ?'

'అవునండి!'

'అతను వచ్చినప్పుడల్లా మీరిద్దరూ కాఫీ హొటల్లో కూచుని ...'

'అవు నండి!'

'అతను యూనియన్‌కి దొరికిన కొత్త బిచ్చగాడు. సమర్ధుడన డంలో సందేహం లేదు. మరి అటువంటివాడు ప్రతిరోజూ నిన్ను కలుసుకోవటమూ ...'

"అతనికి ఆ యూనియనంటే పెద్ద అభిమానం లేదండి ! అందు కనే నాదగ్గిరకి వస్తూంటాడు."

"నాకు తెలుసు. అసలు మీా యిద్దరూ తగాదా పడుతూంటే నేనే విడిపించానని నీకు జ్ఞాపకం ఉందనుకుంటాను. ఆ రోజుల్లో మీా యిద్దరూ మాట్లాడుకున్నా, పోట్లాడుకున్నా ఏం ఫరవా ఉండేది కాదు. కాని యిప్పుడలా కాదు. అతను యీా మధ్య వేస్తున్న ఎత్తులూ, చేస్తున్న వాదులూ అతని తెలివి తేటలకి మించిన స్థాయిలో ఉంటు న్నాయి. నెంబరు 908 బాపతు కేసు నీకు తెలిసే వుంటుంది. ఆ సందర్భంలో 908 కి ఎట్లాగైనా ఆరు నెలల పాటు ప్రమోషను ఆలస్యం చెయ్యాలని మొదట్లోనే నిశ్చయించుకొని కేసు నడుపుతున్నా మని నిండు సభలో మేనేజిమెంటును నిందించాడు ఆ 208 ఆ కేసు విచారణ అంతా ఒక ఫార్సు అన్నాడు. అలాంటి అల్పుల ఆరోపణల వల్ల కంపెనీకి పెద్దగా వచ్చే నష్టం ఏమీా లేదనుకో. కాని, ఆఫీ సర్ల మధ్య నిలబడి అతను యింతటి ఆరోపణ చేయడం, వాదించడం ఎలా సంభవించింది? ఆఫీసులో రహస్యంగా వుండే విషయాలు అతని కెలా తెలిశాయి ? ఇది మాత్రం ఆచూకీ తీయాల్సిన విషయం."

"నాకా విషయంలో ఏమీా సంబంధం లేదండి !"

"నీ మాట నేను నమ్ముతానే అనుకో. కాని,ఇతరఆఫీసర్లు నమ్ము తారా ? ఇంతకీ, అదొకటేకాదు. అలాంటివి యింకా చాలాఉన్నాయి. ఆ 208 ఏ రోజున ఏ రహస్యం బయటపెడతాడో అర్థంకాకుండావుంది. ఇలాగే యింకా ఒకటి రెండుసార్లు జరిగిందంటే, ఎవరికొంప మునుగు తుందో చెప్పలేం. ఇంకా ఎవరూ నీపేరు ఎత్తడం లేదనుకో. అంచేత నువ్వే ఆలోచించుకో. అటువంటి మనిషి నిన్ను అఫీసులోనే కాదు, ఇతర ప్రదేశాల్లోకూడా కలుసుకోకుండా వుండడమే నీకు మంచిది. నీ శ్రేయస్సు వేరు, అతని శ్రేయస్సు వేరూను."

"మే మిద్దరం కేవలం స్నేహితులమండి."

"బస్ కండక్టరుతోనా నీకు స్నేహం ?" అని ముఖం వికారం గాపెట్టి, తలవంచి పనిచేసుకోడం మొదలుపెట్టాడాయన.

"అది విచిత్రమే అనుకోండి. కాని పరిస్థితి అటువంటి దంటే. నే

నంటే అతనికి పంచ ప్రాణాలూను ఎంచేతో! కాని, కంపెనీ రహస్యాలు మాత్రం అతనికి చెప్పేటంత అకార్యం చేస్తానాండి నేను? నా కంత మాత్రం జబాబుదారి తెలియదా?'

'మళ్ళీ అదే మాటంటున్నావు. నీ నైజం, నీ నీతి నాకు తెలుసు ననుకో. మిగిలిన వాళ్ళేమంటారు? ఇదుగో చూడు. మీ స్నేహం పాడు చెయ్యాలని నాకేమీ కోరికలేదు. కాని యీ వ్యవహారం అనేక రకాలుగా అర్థం చేసుకోడానికి అవకాశం వుంది. నీ జీవిత భవిష్యత్తు గురించీ, నీ కుటుంబ శ్రేయస్సుగురించీ నువ్వే కాస్త జాగ్రత్తగా ఆలోచించుకో. ఆ తర్వాతకూడా నీకు ఆ స్నేహం మంచిదని తోస్తే సరే. కాని, నా కోరిక ఏమిటుంటే, నీలాంటి సమర్థుడు అనవసరంగా పాడై పోకూడదని. ఇక నువ్వు వెళ్ళ వచ్చు.'

'థాంక్యూ సర్!'

# 8

ఇలాంటి విపరీతార్థాలేవో పుట్టుకొస్తాయని నాకు మొదటినుంచీ ఒక భీతి ఉంటూనేవుంది. ఒక సంవత్సరం క్రితంనుంచీ రామశరణుడు యూనియన్‌లో అతిశ్రద్ధగా పనులు చూస్తున్నాడు. ఇదివరలో చందాలు వసూలుచెయ్యడం తప్ప యింకేమీ చేయని యూనియన్ యిప్పుడు అతి బలవత్తరమైనదిగా మారిపోయిందన్న సంగతి పనివాళ్ళందరికీ రుజువైంది. ఈ పరిణామాన్ని తేగలిగిన సమర్థత రామశరణుడిదే. కాని రామశరణుడిలో యీ సమర్థతని సృష్టించిందెవరు?

ఈ విషయంపై అధికారి నాతో ముచ్చటించినప్పుడు నాలుక చివరివరకూ వచ్చింది, నాలుగు ముక్కలందామని. రామశరణుని యింతటి దక్షతగల వాణ్ణిగా చేసింది నేను కాదు; కంపెనీ. కంపెనీయే పని వాళ్లని హింసించి యీ రామశరణుడికి విశ్వరూపం తెప్పించింది.

తనను పనిలోంచి సస్పెండు చేయడంవల్ల ఎన్ని రూపాయలు నష్టపడ్డాడో తెలుసుకోవడానికి ఆ రోజు వచ్చిన రామశరణుడు మళ్ళీ వారం రోజుల వరకూ నాకు కనిపించలేదు. ఆ తరవాత ఒక రోజున హఠాత్తుగా వచ్చి "నాకు మీతో సొంత పని కాస్తవుంది. మీ యింటికి వచ్చి కనిపించేదా ?" అని అతి ఆతురతతో అడిగాడు. నే నేమీ సమాధానం చెప్పకుండా, అతని ముఖం పరీక్షగా చూస్తూ వుండి పోయాను. అతనెంతో వ్యాకులంగా "సాబ్! నిజంగానే పనుందండండీ! రావచ్చునా ?"

చివరకి ఓ రోజున నాగది ఎక్కడంటూ వెతుక్కుంటూ వచ్చి గుమ్మంముందు నిలబడ్డాడు. అతని పల్చని మల్లుజుబ్బా, మెలివేసిన మీసాలూ, నున్నగాదువ్విన జుట్టూ వెనక వేళ్ళాడేజుట్టుముడీ — నా యిరుగుపొరుగువాళ్ళు కబుర్లు చెప్పుకోడానికివి వారం రోజులవరకు పనికివచ్చాయి. ఈ వ్యక్తి ఈయనగారిదగ్గరకెందుకు వచ్చినట్లు? అని ఆలోచించడం మొదలుపెట్టారు. ఇరుగు పొరుగువాళ్ళవరకెందుకూ, నాకూ ఆ ఆలోచనే పట్టుకుంది, అతన్ని చూడగానే.

అతన్ని గదిలోకి పిలిచి, కూర్చోమన్నట్టు కుర్చీచూపించాను.

"ఎందుకులెండి అయ్యా!" అంటూ అతను నిల్చునే మాట్లాడడం మొదలెట్టాడు. చివరకి నేనే అతన్ని బుజమ్మీద చెయ్యేసి అణిచి కూర్చోపెట్టాను.

"నువ్వు నాతో నుంచుని మాట్లాడానికి యిదేం ఆఫీసు కాదు. కూచో కుదురుగా. ఊరికే కంగారు పడకు! నువ్వొచ్చిన పనేమిటి?"

"ఆఫీసులో జరిగే కొన్ని విషయాల్నిగురించి నాకు వివరాలు కావాలండి."

"ఎందుకోయ్?"

"అయ్యగారూ! మా రికార్డుల్లో పనిచేసిన రోజులు తగ్గించి పడుతూంటాయి. లెక్కల్లో నష్టం వస్తూంటుంది. కాని అదెట్లా జరుగుతుందో, ఎవరు చేస్తారో అర్థం కావడం లేదు. 320 నెంబరు డ్రైవరు లెక్కల్లో పాతికరూపాయలు కోసేశారు, పోయిన నెలజీతం లోంచి!"

"ఊహూ! ఇప్పటికి కళ్ళు తెరిచారన్నమాట! ఇన్నాళ్ళనుంచీ

నెత్తిన నోరెట్టుకుని చెప్పటంలా, అసలు కంపెనీ చట్టంక్ ఏమిటో, నిబంధన లేమిటో తెలుసుకోండోయ్ అనీ ? మీ లెక్కలు మీరు వివరంగా అడిగి తెలుసుకోండోయ్ అనీ ?"

"ఒకసారి జొప్పికట్టిందిగనక ఈ మాత్రమైనా జ్ఞానంవచ్చిందండి! లేకుంటే. మట్టిబుర్రతో సర్వీసులో చేరినవాణ్ణి అలాగే రిటైరయి, పింఛను తీసుకుని, ఆ మట్టిబుర్రతోనే జాన్‌పూర్ చేరుకొనే వాణ్ణండి."

"ఏమిటా బైండు పుస్తకం, చేతిలో ?"

"తెల్లకాగితాలండి. ఈ కంపెనీ రూల్సు అవీ రాసుకుని అర్థం చేసుకోవాలని నిశ్చయించుకున్నాను."

ఇదివరలో రామనామం జపించటానికి ఉపయోగించుకునే తీరిక సమయం యావత్తూ కంపెనీ నిబంధనలు నేర్చుకోటానికి ఉపయోగించడం ఆరంభించాడు రామశరణుడు. సర్వీస్ కండిషన్‌కోడ్ అంతా కంఠోపాఠం చేశాడు. ఇలాంటి వ్యవహారాల్లో యింగ్లీషు తెలియక పోతే ప్రయోజనం లేదని యింగ్లీషు నేర్చుకోడం మొదలుపెట్టాడు.

కంపెనీలో జీతాలిచ్చే రోజున అతని చుట్టూ జనం పోగవడం మొదలెట్టారు. తమకు రావలసిన జీతాల్లో ముట్టిన మొత్తాలు సరిగా వున్నాయో లేదో తెలుసుకోడానికి రామశరణు డొక్కడే లెక్కలు చూసిపెట్టగలవాడని అందరికీ నమ్మకం పుట్టింది.

మొట్టమొదటిసారి రామశరణుడు ఒక డ్రైవరుని వెంటబెట్టుకుని ఆఫీసులో ప్రవేశించినప్పుడు అందరూ ఆశ్చర్యంగా చూశారు అతనివైపు. ఆరోజున అతను చూపించింది చాలా చిన్న పొరపాటే. కాని ఆ పొరపాటు యిన్నాళ్లూ పనికి మాలినవాడులా కని పిస్తూన్న రామశరణు డెట్లా గమనించాడా అనే అందరూ ఆశ్చర్య పడ్డారు.

కాని, కొన్నాళ్ళు గడిచాక, ఆశ్చర్యపడవలసిన అవసరం లేక పోయింది. నెలనెలా జీతాలబాపతు లెక్కలకాగితాలు పట్టుకుని రామశరణుడు ఆఫీసులో హాజరవటం అందరికీ అలవాటయింది. అతను గుర్తుపెట్టి చూపిన లెక్కలతప్పులూ, అధికారుల్ని అడిగే సందేహాలూ,ఎంతో జాగ్రత్తగా ఆలోచించి సమాధానం చెప్పవలసిన విషయాలని అందరికీ

అనుభవంలోకి వచ్చింది. అతని పిలక, అతని వాలకం మట్టుకు యిది వరకుమల్లేనే వున్నాయి. ఆ గంధపుబొట్టు ఏమీ మారలేదు. ఆ మెళ్లో తులసిమాలా పాతదే. మారిందల్లా కళ్ళలో చూపు. ఈ రోజుల్లో అతని సమర్థతలో అతనికున్న విశ్వాసం అతని ఆకృతిలో ఉట్టిపడుతూండేది. అతని హాజరుపట్టీలో నెల నెలా నాలుగు రోజులు సెలవుపెట్టిన గుర్తులు పడుతున్నాయి. స్టార్టర్లూ, ఇన్‌స్పెక్టర్లూ, సూపర్వైజర్లూ అతను కంట పడితే హడలిపోతున్నారు. చెయ్యెత్తి దణ్ణాలు పెడుతున్నారు.

రామశరణుడిలో రోజు రోజుకీ చురుకుతనం ఎక్కువయింది. ఒక రోజున ఉగ్రుడై వచ్చాడు ఆఫీసుకి. అతన్ని చూచీ చూడగానే యిదేదో ముదిరిన వ్యవహారమే అయి వుంటుందనిపించింది నాకు. అంచేత నా దగ్గరకి పిలిపించాను.

ఒక డ్రైవరు పనిలోకి వచ్చి పని చేసినా రెండు రోజులు 'అబ్సెంటు' వేశారట.

అసలు మా ఆఫీసులో 'అబ్సెంటు' వేయడంలో ఒక పాడు పద్ధతి ఉంది. ఎవరైనా ఒకరోజు అకస్మాత్తుగా 'అబ్సెంటు' అయితే, ఆరోజు ఎలాగూ 'అబ్సెంటు' పడుతుంది. కాని, ఆ నేరానికి శిక్షగా యింకొక రోజుకూడా, పూర్తిగా పని చేసిన రోజుకూడా 'అబ్సెంటు' వేస్తారు. అంచేత యిప్పుడు ఏం జరిగిందో చూద్దామని కుర్చీమీదనుంచి లేచాను

"అయ్యగారూ! తమ కెందుకులెండి శ్రమ!" అని కంగారు పడ్డాడు అతను. కాని, నేను వినిపించుకోకుండానే, బీడువా దగ్గిరకి వెళ్ళి రిజిస్టర్లు తెచ్చాను. ఒకరోజు మానేస్తే రెండురోజులు 'అబ్సెంటు' వెయ్యటం ఒక దురలవాటు. దాన్ని తేలుద్దామని నా ఊహ. స్టార్టర్లు గుర్తులు పెట్టిన హాజరు పట్టీ తిరగేశాను. ఆ పేజీ చూచి నిర్ఘాంత పోయాను ఇది ఆఫీసులో జరిగిన పొరపాటేనని రామశరణుడికి నా ముఖంలో కనిపించింది. అంచేత ధైర్యంగా ధారాళంగా మాట్లాడ్డం మొదలెట్టాడు. నేను నవ్వు ఆపుకుంటూ, అతనివైపే చూస్తూ నుంచు న్నాను.

"మీరు దీన్ని నవ్వులాటగా పరిగణించవద్దు బాబుగారూ!

పాపం ఆ బీదవాడి జీతంలో 20 రూపాయలు అన్యాయంగా కోసేశారు."

"నేను ముజరా యిచ్చేదా?"

"ఒద్దండి! దీని విషయం ఏమిటో అంతు తేలేవరకు విచారణ చేయించాలి."

"ఉహూం! అప్పుడేమి జరుగుతుందేమిటి?"

"అసలు యీ పొరపాటెవరు చేశారో వాళ్ళకి శిక్షపడాలి."

"రామశరణ్!"

"అదికాదండీ! కండక్టరు పొరపాటున కోటుకి బొత్తా పెట్టుకోకపోతే ఒకరోజు సస్పెండు చేస్తారు కదా. ఆఫీసులో యింతపొరపాటు జరిగినా మీరు వెనకేసుకు వస్తే..."

"మరీ బాగుంది నీ వరస! ఇక్కడ పనిచేస్తున్నవాళ్లు నీలాంటి కంపెనీ నౌకర్లే. వాళ్ళలో ఒకణ్నో యిద్దరినో శిక్షిస్తే నీ కొచ్చేలాభం ఏమిటి?"

"అంతేనంటారా?"

"కాకపోతే?"

"అయితే ఆ పైకం ఎప్పుడిప్పిస్తారు?"

"వచ్చే నెల జీతంలో ఏర్పాటవుతుందిలే!"

"ఏర్పాటంటే?"

"అంటే ఏమీలేదు. జీతంతోపాటు యీ పైకంకూడా ముట్టచెబుతారు."

"అంటే యింకా నెలరోజులకా? అది వీల్లేదండి అయ్యగారూ! ఇవ్వాళ, రేపట్లో పైకం యిప్పిస్తే సరి. లేకపోతే మాత్రం..."

"సరే అయితే. యీ పొరపాటు నేనే చేశాను. నువ్వు విచారణ జరిపించేట్టయితే, ఆ శిక్ష అనుభవించవలసింది నేను."

అతనికి పై ప్రాణం పైకిపోయింది. గాంభీర్యం అంతా అడుగంటిపోయింది. అతని నోట మాటే రాలేదు. ఎటూ తోచక, అట్లాగే

కొయ్యబారి నుంచుండిపోయాడు. కాస్సేపయాక, ఆ వెంటపెట్టు కొచ్చిన డ్రైవరుబుజంమీద చెయ్యివేసి,

"ఏం భాయ్! వచ్చేనెల డబ్బు దొరికితే సరిపోతుందిగా! ఏం అంతేనా? సరిపోతుందిలే! ఆఁపద పోదాం."

# 9

కంపెనీ చరిత్రలో ఎప్పుడూ అటువంటి సమ్మె జరగలేదు. గంట, రెండుగంటలలోపల ఊరిమీదనున్న బస్సులన్నీ ఆగిపోయాయి. పట్టణంలో జనం అందరూ ఆశ్చర్యపడి అలా చూస్తూ నుంచుండి పోయారు. ఈ సమ్మె ఎందుకొచ్చిందో, ఎలా వచ్చిందో, ఎప్పు డొచ్చిందో ఒకళ్ళకీ అంతుచిక్కలేదు. ఏదో అంతా మాయగా జరిగి పోయింది. ఎక్కడ చూచినా వాతావరణం వేడెక్కిపోయింది.

గోల్‌నాకా దగ్గిర కండక్టర్లూ, డ్రైవర్లూ వేలకి వేలు పోగ య్యారు. అమితంగా ఆర్భాటం చేస్తున్నారు.

ఊళ్ళో అక్కడక్కడ దొమ్మీలు ప్రారంభమయాయనీ, రక్త పాతం కూడా జరిగిందనీ, కొంత మందిని పోలీసులు అరెస్టు చేశారనీ తాజా వార్తలు క్షణక్షణం అఫీసుకి చేరుతున్నాయి. పెద్ద ఉద్యోగస్తు లందరూ అత్యవసర సమావేశంలో కూచున్నారు. ఉదయం ఎనిమిది గంటలకి ఆరంభమైన సమ్మె, సంజ వేళ అయినా సర్దుబాటుకి రాలేదు. అసలు వర్కుషాపులో పని వాళ్ళు కూడా పని విడిచిపెట్టి బయటికి వచ్చేసే ఆలోచనలో వున్నట్లు తెలిసింది. సాయంత్రం సుమారు 4 గంట లకి "రామశరణుని అరెస్టు చేశారు" అన్న వార్త ఊరంతా పొక్కింది. మా ఆఫీసు నుంచి 5 నిమిషాల్లో చేరుకోగలిగిన గోల్‌నాకా దగ్గిరే అతన్ని పట్టుకున్నారట. లాఠీఛార్జి జరిగిందనీ, యింకా పది పన్నెండు మందిని అరెస్టు చేశారనీ కబురు తెలిసింది. ఇందులో నిజమెంతో, అబద్ధమెంతో, అసలు జరిగిందేమిటో తెలుసు కునేందుకు వీలుపడలేదు.

సాయంత్రం 5-30 కాగానే ఆఫీసులోంచి బయటు పడ్డాం. గోల్‌నాకా దగ్గిరకి వచ్చేటప్పటికి ఆదుర్దా ఎక్కువయింది. అక్కడ ఎటు చూచినా జనం గుంపులుగుంపులుగా నుంచుని ఏవో మాట్లాడు కుంటున్నారు. మేము పరకాయిస్తూ తచ్చాడుతున్న సమయంలో రామశరణుని, మిగిలిన వారినీ విడిచి పెట్టారని వర్తమానం వచ్చింది. వాళ్లిక్కడికే వస్తున్నారని కూడా తెలిసింది. సంధి కుదిరిందనీ, సమ్మె చాలించి అందరూ పనిలోకి వెళ్ళవచ్చనీ ఒక కబురు పుట్టింది.

రామశరణుడు నలుగు రైదుగురు తోటివాళ్ళతో వచ్చాడు. అతనిచుట్టూ జనం పోగయ్యారు. వారి మధ్యనుంచి అతను తోవ చేసుకుంటూ మైదానం మధ్యకి వచ్చాడు. ఎవరో ఒక అతను స్టూలు మీద నిలబడి, "మిత్రులారా!" అని గర్జించాడు అయిదు నిమిషాల్లో తను చెప్పవలసింది ముగించాడు. వాళ్ళకి సంపూర్ణ విజయం లభించిం దిట. మామూలు ప్రకారం బస్సులు నడపమని చెప్పి దిగిపోయాడు. "యూనియన్ జిందాబాద్!" "రామశరణ్ జిందాబాద్!" అనే కేకలు మిన్నుముట్టాయి.

ఆ సందడి యింకా తగ్గకముందే, జనంలోంచి తోవ చేసు కుంటూ నే నతనివైపు వెళ్ళాను. ప్రక్కన నుంచుని రామశరణుడి బుజంమీద చెయ్యివేశాను.

"అయ్యగారూ! మీరా?" అని మొదట ఆశ్చర్యపడ్డాడు. కాని, వెంటనే చిరునవ్వు నవ్వుకుంటూ నాతోపాటే నడవటం మొద లెట్టాడు. మైదానందాటి టిఫిన్లపాకలో రద్దీలేని మూల ఒకటి చూసు కొని నిలబడ్డాం.

"రామశరణ్! ఏమిటి నీ పేరుపెట్టి జే జేలు కొడుతున్నారు?"

"పోయిన పదిహేను సంవత్సరాలూ పరమేశ్వరుణ్ణి సేవించు కుంటూ వచ్చాను. ఆయనకి యిప్పటివరకూ దయకలగలేదు."

"ఇప్పుడు కలిగిందా?"

"ఇదంతా రామచంద్రప్రభువుని దర్శించడమే కాదుటండీ?"

"అంత అర్థాంతరంగా సమ్మె ఎలా వచ్చింది?"

"అర్థాంతరం ఏముందండీ? నెలరోజులనుంచీ గడబిడగానే ఉంటోందిగా?"

ఒక డ్రైవరు ఎక్కువ స్పీడుగా బస్సు నడిపాడని సస్పెండు చేశారట. ఎన్నివిధాల సౌమ్యంగా రాయబారాలునడిపినా లాభం లేక పోయిందట. అంచేత యీ సమ్మె అస్త్రం ప్రయోగించవలసి వచ్చిందట. దీన్ని సక్రమంగా నడిపించడానికి రామశరణుడు రాత్రింబగళ్ళు కష్ట పడ్డాట్ట. అతను అంతపట్టుపట్టి పనిచేయకపోతే బస్సులన్నీ ఆగి పోయేవి కాదట. డ్రైవర్లకి ధైర్యం చాలలేదు. ఆఖరికి రామశర ణుడు రోడ్డు కడ్డంగా పడుకుని "ఇప్పుడీ బస్సులు నా శరీరం మీంచి నా శవం మీంచి నడవవలసిందే!" అని కేక వేశాట్ట. ఒక బస్సు అతని దగ్గరకొచ్చి ఆగిపోయింది. ఆ వెనక వచ్చిన బస్సులన్నీ లైనుగా ఆగి పోయాయి. అంతే. అరగంటలోపల పట్టణంలోని బస్సులన్నీ ఎక్కడి వక్కడ నిలిచిపోయాయి.

ఈ వృత్తాంతం అంతా అతను చెప్పుకుపోతూంటే, నా ముఖంలో ఏదో వ్యాకులం ఏర్పడింది.

"అలా వున్నారేం సాబ్? ఏం జరిగింది?"

"ఏంలేదు. నువ్వు కీర్తి సంపాదించావు, బాగానే వుంది. కాని, కొంచెం ఎక్కువగా సంపాదించావు!"

"ఇందులో నాదేముందండి? చేసేవాడూ, చేయించేవాడూ ఆ రామచంద్రుడే కదా!"

"ఇంకా రాముణ్ణి విడిచిపెట్టలేదన్నమాట నువ్వు!"

"ఇదంతా ఆయన దయేకదండి?"

అప్పటికి జనం మా చుట్టూ పోగయారు. అందరూ మావైపే పదే పదే చూస్తున్నారు. అంతట్లోనే ఒక పోలీసు యినస్పెక్టరు అక్క డికి రావడం, జనం అంతా పల్చబడి అటూ యిటూ సర్దుకోవడం జరిగింది. అక్కడి వాతావరణంలో వున్న రౌద్రభావం నేనెక్కువ సేపు సహించలేనేమో ననిపించింది అంచేత, మధ్యలోనే మాటలుఆపి బయటికి దారితీశాను.

ఆఫీసులో ప్రతిమనిషీ నా రాకకోసమే చూస్తున్నాడు. అసలు

యీ సమ్మెని గురించిన సమస్త వివరాలూ నే నొక్కణ్ణే చెప్పగలనని ఆశతో కూచున్నారు. కాని నే నెవరినీ లెక్కపెట్టలేదు. నిన్న రోజు రోజంతా గుమాస్తాలందరూ నా టేబులుచుట్టూ నే మూగివుండిపోయారు, ఛీఫ్‌క్లర్కు నన్న సంగతే మరిచిపోయి. నేను వాళ్ళందరితోను సహజంగా, సమానంగా మాట్లాడుతూనే గడిపేశాను. అందులోనూ నిన్న మా పెద్ద ఆఫీసరు రాలేదు గనక సరిపోయింది. అతని కంటపడితే, నన్ను గురించి ఏమనుకునేవాడు ?

ఆ కోలాహలం మధ్య ప్రవేశించి రామశరణుని నేను పలకరించాల్సిన పనేమొచ్చింది అసలు ? నాలో అంతర్గతంగా వున్న గర్వం కాకపోతే, ఎవడి కృషివల్ల యీ సమ్మె జరిగిందో, ఎవడికి జయజయ ధ్వానాలు రేగాయో, వాడు నా యెదట మేకపిల్లలా ఎలా వుంటాడో చూపించడానికి కాకపోతే నే నక్కడి కెందుకెళ్ళాలి ? తలుచుకుంటే యీ వేళ సిగ్గువేస్తోంది, నా అల్పత్వానికి. రామశరణుడు ఉద్రేకంతో మాట్లాడ్డం మొదలెట్టినప్పుడు మాత్రం నాకు నిజంగా గాబరా పుట్టింది. అందరూ పోగయారు. పోలీసులు వచ్చారు. జరగకూడని వెన్నో జరిగాయి. తరవాత... తరవాత... పశ్చాత్తాప పడ్డాను.

రామశరణుడి జీవితంలో యీ సమ్మె చాలా ముఖ్యమైన సంఘటన. 24 గంటల్లో అతని పలుకుబడి పదింతలు పెరిగింది. మా గట్టివాడని అందరూ అతన్ని మర్యాద చేయడం మొదలెట్టారు. ఇన్నాళ్ళూ యూనియన్‌కి చందాకట్టడం అంటే పనివాళ్ళందరికీ ఒక గండంగా వుండేది. ఇప్పుడు చందాకట్టడానికి బారులు తీరి నుంచుంటున్నారు రామశరణుడి యెదట.

అతనుకూడా, మా యింటికి వచ్చినప్పుడు గంటల తరబడి కూచుని కబుర్లు పెట్టుకుంటున్నాడు. జీతాల విషయంలో కంపెనీలో ఎన్ని రకాల చట్టాలూ, నిబంధనలూ వున్నాయో అవన్నీ వివరాలడిగి తెలుసుకునేవాడు. ట్రేడ్ యూనియన్ ఎలా నడపాలో నన్ను సలహాలు అడిగేవాడు. బిలియర్డ్ దొరగారు యూనియన్ పేరు చెబితేనే హడిలిపోతున్నారనీ, విల్కిన్ సన్ దొరగారు అసలు యెదట పడ్డమే

మానుకున్నారనీ, అక్సిడెంట్స్ ఆఫీసులో వాళ్ళందరూ తమ దర్పం వదలేశారనీ, మెడికల్ డిపార్ట్మెంటు పూర్తిగా తమ చేతుల్లోకే వచ్చేసిందనీ – యిలాంటివే అనేక సంతోష వార్తలు చెబుతుండేవాడు. ఆ ఒక్క రోజు సమ్మె మూలాన చాలా పరిణామాలు జరిగాయని వివరించేవాడు. ఆఫీసులో వున్న గుమాస్తాలని కూడా యూనియన్‌లో చేర్పించడానికి తను కృషి చేస్తున్నాడట. అసలు పోనుపోను కంపెనీలో వున్న ప్రతిఎంప్లాయీ యూనియన్‌లో చేరేటట్లు ప్రయత్నం చేస్తానవేవాడు. ఆ తరవాత బోనసు కోసం, జీతాల పెంపుదల, తదితర సౌకర్యాలను గురించీ కంపెనీతో బేరమాడటం సులభం చేయవచ్చునంటూ, తన ఆశలూ ఆశయాలూ అతి వుత్సాహంగా చెప్పేవాడు

వింటూంటే బాగానే వుండేదిగాని, అతని దారివేరూ నా దారి వేరూ అని స్ఫురణకు వచ్చినప్పుడల్లా, యీ పురోగతి అంతా నా ఇంటి మీదికి రాకుండా వుంటే బాగుండు ననిపించేది.

# 10

నాకూ రామశరణుడికీ వున్న స్నేహాన్ని గురించి ఆఫీసులో పెద్ద అధికార్లందరికీ తెలిసింది. నాపై అధికారి నన్ను అతి అర్జంటుగా పిలిపించి నాతో చర్చించిన విషయాల్లో యీ సంగతె ప్రస్తావించారు. నేను ఈ విషయమే ఆలోచిస్తూ ఆయన గదిలోంచి బయట పడ్డాను.

నా కుర్చీలో కూచుని ఆలోచించుకున్న కొద్దీ, యీ వ్యవహారం అంత సులభంగా తేలేది కాదని గోచరించింది. ఆ రోజంతా యీ విషయంతప్ప యింకొకటేదీ తోచలేదు. ఇవాళో రేపో రామశరణుడు మళ్ళీ నా దగ్గిరకి తప్పకుండా వస్తాడు. అప్పుడు నే నెలా ప్రవర్తించాలి ? ఇదివరలో లాగే అతనితో సన్నిహితంగా, స్నేహంగా, మనసిచ్చి మసలుకోడం సాధ్యమేనా ?

ఈ రోజున నేను అతనితో తెగ తెంపులు చేసుకుంటేమాత్రం నాకుగాని, అతనికిగాని ఏం నష్టంవుంది? అతని జీవితంలో నేనదో ప్రమేయం కలగజేసుకున్నందువల్ల అతనికేమీ హాని కలగలేదు సరి కదా, కొంత మేలే కలిగింది. అంచేత యిక ఆజన్మాంతం నేనతనికి సహాయం చేస్తూండాలనీ, స్నేహంగావుండాలనీ అతను పట్టుపట్టడంలో ఏం అర్థంవుంది? నా వుద్యోగానికి ముప్పువస్తున్నప్పటికీ అతని స్నేహం నిలబెట్టుకోవలసిందేనా? ఇదీ అసలు సమస్య. ఈ చిక్కులన్నీ అతనికి అర్థమయేలాగ చెబితే, నా స్నేహం వదులుకోడానికి అతను మనః పూర్వకంగా అంగీకరిస్తాడు కాని యింకోవైపునుంచికూడా ఆలోచించవచ్చుగా! నా మనస్సుని చంపుకుని, నా యిష్టాల్ని వొదులుకొనేటట్టు చేసే యీ నిరంకుశపు నౌకరీలో నేనెందుకుండాలి అసలు? రేప్పొద్దున్న రాజీనామాయిచ్చి నేను నా వూరికెళ్ళిపోదలచుకుంటే ఆపగలవాళ్ళెవరు?

నిజంగా చూస్తే యీ విషమ పరిస్థితి ఎందువల్ల ఏర్పడింది? నేను నోరు తెరిచి రామ శరణుడికి ఉపదేశాలు చేయడం వల్లా కాదు; అతను ఉత్సాహంతో యూనియన్ వ్యవహారాలు నిర్వహించడం వల్లా కాదు. ఈ రెండిటికీ లంకె పెట్టి నా పై అధికారి నన్ను జాగ్రత్తగా వుండమని చెప్పినందువల్ల. ఆ దొరగారు తనకు చూచాయిగా తెలిసిన విషయాలని చూసీ చూడనట్లు ఊరుకోలేక, నాతో తర్కించి, నాకు హెచ్చరిక చేయటం ఎందుకు? ఆయన గూఢంగా ప్రస్తావించి గుట్టుగా వదిలెయ్య వలసింది యీ విషయం. నాకుమాత్రం ఆపాటి యింగితం లేదూ? నా ప్రవర్తన మార్చుకునే వాణ్ణి. ఆయన నోరుతెరచి, కుండ బద్దలు కొట్టినట్లు నన్ను హెచ్చరిక చేసినందువల్ల నేను ఏ నిర్ణయానికీ రాలేక యింత ఆవేదన పడవలసి వస్తోంది. సరే ఏమయితేనేం? ఇక ముందు రామశరణుడితో సంబంధం తెంపుకోవడమే మంచిది. ఆఫీసు నుంచి బయలుదేరి, ఆలోచిస్తూ నడుస్తూ యింటికి చేరుకునేటప్పటికి యీ నిర్ణయం ఏర్పడింది నా మనసులో.

కాని, యింట్లో ప్రవేశించి ఒకచోట కూచోగానే మాత్రం

'అతనితో సంబంధం తెంపుకోడానికి నిర్ణయించాను. బాగానే వుంది. కాని దానికి మార్గం ఏమిటి ?' అన్న ఆలోచన పట్టుకుంది.

రేపో మాపో రామశరణుడు నన్ను చూడటానికి వచ్చి తీరుతాడు. ఎంతో ఆప్యాయంగా పిలుస్తాడు. స్వతంత్రంగా మాట్లాడతాడు. నా విముఖత చూచి, 'మీకు వంట్లో ఏమైనా సుస్తీచేసిందా ?' అని ఆదుర్దాతో అడుగుతాడు.

నాకు మాత్రం యితన్ని వదుల్చుకోడం ఎలాగా అనే ఆలోచన బుర్రలో తిరుగుతూ వుంటుంది. ఒకవేళ నేను స్వార్థపరుణ్ణి, నీచుణ్ణి అనుకుంటాడేమో ! ఎండనక, వానసక తెగ తిరిగినందువల్ల నల్లబడ్డ శరీరంతో రామశరణుడి రూపం కనిపించింది నాకు. ఏంవేమిటో నిష్ఠూరాలు పలుకుతున్నట్లు నోరు మెదుల్తోంది.

కాసేపు నడుం వాలుద్దామని అనుకొంటున్నాను. ఇంతట్లో తలుపు తట్టిన చప్పుడయినట్లు అనిపించింది. గుండె గుభేలుమంది. కాని అది కేవలం నాభ్రమేననీ, తలుపెవరూ తట్టలేదనీ తెలిసింది. అయినా ప్రాణం కుదుటబడలేదు. అతను ఆ పూట రాలేదు. నా నిద్ర చెడిపోతుందేమోనని నా కంటె అతనే ఎక్కువ శ్రద్ధ చూపుతూవుంటాడు. స్విచ్చివేసి దీపం ఆర్పివేశాను. పంకా తిప్పుకున్నాను. మంచంమీద పడుకుని కళ్ళు మూశానో లేదో-పన్నెండడుగుల ఎత్తున రామశరణుడి విశ్వరూపం సాక్షాత్కరించింది. నిశ్చలంగా, కదలకండా నుంచుంది నా యెదట. నేను దిగ్గునలేచి లైటు వెలిగించాను.

తెల్లవారి లేచేటప్పటికి నా మనస్సు కొంత కుదుటబడ్డది. గడచిన రాత్రి ఎందుకంత గాభరా పడ్డానో అర్థం కాలేదు. నే నేదో సామాన్య మానవుణ్ణి. సంసారిని. నా నడతకి కొన్ని హద్దులు ఉండవలసిన అవసరం వుంది. నా ప్రవర్తనకు నేను ఏర్పరచుకున్న హద్దుల వల్ల యితరులు బాధపడ్డం అనవసరం, అసమంజసమూను. ఇతరుల కెవరికీ హాని చేయకుండా, నా ఉద్యోగంలో నేను అభివృద్ధి కావడం దోషం కాదు. పాపం కాదు. రామశరణుడితో సంబంధం వొదులుకోడం కూడా పాపంకాదు.

కాని ఈ నిర్ణయం నేను రామశరణుడితో ఎప్పుడూ నోరువిప్పి చెప్పలేదు. పైగా, ఒక నెల రోజులు గడిచేవరకూ మేమిద్దరం కలుసుకోవటం పడనూ లేదు.

# 11

జరిగిన విషయాల్ని గురించి యిప్పుడు సావధానంగా ఆలోచిస్తూంటే, ఆ రోజుల్లో అంతటి పిచ్చిపనులెలా చేశానా అని పిస్తూంటుంది. రామశరణుడికి కనిపించకుండా తప్పించుకు తిరగాలని నిర్ణయించుకోవటం ఎంత అవివేకం! ఎన్నాళ్ళు తిరగ్గలను అలా? ఒకనాడు కాకపోతే మరొకనాడైనా అతణ్ణి కలుసుకోకండా తప్పించుకోవటం ఎలా? కాని అప్పుడు ఆ ప్రయత్నమే శరణ్య మనిపించింది. దానికి బదులు, అసలు అతనితో మాట్లాడి, మనసులోవున్న బాధ చెప్పేస్తే, మా యిద్దరికీ కూడా యితర బాధలు తప్పేవి. రామశరణుడికి తటస్థించిన ఆపద ఎట్లాగా తప్పేది కాదు. దాన్ని గురించి అతనికంత ఖాతరూలేదు. నేను మాత్రం అతని కంట బడకూడదనే వెర్రి ఊహతో తాపత్రయ పడ్డాను చాలా రోజులు.

రోజుకి 15 గంటలు యింటికి రాకుండా గడపడం మొదలెట్టాను. స్నానంచేసి ప్రొద్దున్నే 7 గంటలకి యిల్లు విడిచిపెట్టేవాణ్ణి రాత్రి పది దాటాక పడుకోడానికి వచ్చేవాణ్ణి. ఇంట్లోవాళ్ళకీ, యిరుగు పొరుగువాళ్ళకీ అయ్యగారికి ఆఫీసులో పనిచాలావుంది కాబోలుననే అభిప్రాయం స్థిరపడిపోయింది. ఎప్పుడు చూచినా నా బల్లమీద బొత్తులు బొత్తులుగా ఫైల్స్ పెట్టేసే వుంచేవాణ్ణి. ఎప్పుడైనా రామశరణుడు వస్తున్నట్లు అడుగుల చప్పుడు వినిపిస్తేచాలు, నేనేదో పెద్ద పనిలో ఉక్కిరిబిక్కిరయి పోతున్నట్లు నాలుగైదు ఫైళ్ళ విప్పి కాగితాలు తెగ తిరగేసేవాణ్ణి, మొగం పైకెత్తకుండా. ఈ నాటకం ఎన్నాళ్లు ఆడగలనని ఆలోచించుకున్నప్పుడు నాలో నాకే సిగ్గేసేది.

నే నసలు ఆఫీసులోకి రావటం పోవటం కూడా మామూలుగా వచ్చే పెద్ద గేటులోంచికాదు. వెనకవైపున్న ఆఫీసర్ల గేటు వుపయోగించడం ప్రారంభించాను. ఎప్పుడో రాత్రి 9 గంటలు దాటిన తరవాత ఆఫీసులోంచి బయటుపడి, తక్కుతూ తారుతూ పేవ్ మెంటు వారగా నడుస్తూ చేరుకునే వాణ్ణి. ఇంటి సమీపానికి వచ్చాక యింకో భయం పట్టుకునేది. ఒక వేళ రామశరణుడు నేను వచ్చేదాకా కూచోవాలని నిశ్చయించుకొని ఏ మూలో ఓమూల కూచుని వున్నాడేమోనని అనుమానం పట్టుకునేది.

ఒకటి రెండు సార్లు మా యింటికి వచ్చి వెళ్ళాట్ట. చాలా సేపు కాచుక్కూచుని వెళ్ళిపోయాట్ట. ఇంట్లో వాళ్ళతో నన్ను గురించి అనేక రకాలుగా పొగిడాట్ట. నా అంతటి చురుకైనవాడూ, తెలివైనవాడూ ఆఫీసు మొత్తం మీద యింకొకడు లేడనీ, అసలు నేనుండబట్టే ఆ ఆఫీసు పని చేస్తూందనీ – ఏమేమో అన్నాట్ట. అంచేత, ఆఫీసులో, నాకు మాట్లాడే వ్యవధి ఉండదుగనక తను యింటికి వచ్చానని యింట్లోవాళ్ళతో చెప్పాట్ట.

ఒకరోజున ఆఫీసునుంచి నడిచి వస్తూంటే, దూరంగా రామశరణుడు వస్తూండడం చూచి, నడుస్తూన్న బస్సుమీదికే పిక్కేసి తప్పించుకున్నాను! ఇలాంటి మతిలేని పనులవల్ల చివరకి ఎవరికి అరిష్టం వస్తుందో అన్న ఆలోచన కూడా లేకపోయింది నాకు.

# 12

ఆరోజున గట్టి నిశ్చయం చేసుకొనే రామశరణుడు ఆఫీసుకు వచ్చివుండాలి. నా బల్లదగ్గరకి వచ్చి నుంచున్నవాడు గంటసేపు గడచినా కదలలేదు. ఫైలు తరవాత ఫైలు చేతపట్టుకొని, కాగితాలు తిరగవేస్తూ, ఫైళ్ళు మూసివేస్తూ చాల తొందర పనిలో వున్నట్లు ఆ గంటసేపూ గడిపాను. నేను యింకో నాలుగ్గంటలసేపు యీ నాటకం పొడి

గించినా అతనుమాత్రం విడిచి వెళ్లడని నాకు అర్ధమయిపోయింది. అంచేత, విధిలేక తల ఎత్తాను. బొమలు ముడిపెట్టి, ముఖం చికాకు చేసుకున్నాను.

'నాకు చాలా పనుంది – చూస్తున్నావుగా!'

'అయితే, మీతో మాట్లాడ్డానికి వీలే లేదాండి?'

'ఏం చెయ్యమన్నావు? పని రద్దీ అట్లావుంది. నేనీ ఛీఫ్ క్లర్కు ఉద్యోగం ఎందుకొప్పుకున్నానా అనిపిస్తోంది.'

'రామ రామ! మీరుమాత్రం అట్లా అనకండి! ఇక్కడ మీరుండబట్టి మాకెంతో పెద్ద ఆధారం వున్నట్లుంది.'

'పొరబడుతున్నావు, అంతే. ఉద్యోగం పెద్దదయినకొద్దీ నిర్బంధాలుకూడా ఎక్కువవుతాయి. అసలు యీ రెండు ముక్కలూ నీతో మాట్లాడంవల్ల పని ఆగిపోతుందికూడాను.'

'మీతో చాలా ముఖ్యమైన పనివుందండి!'

'ఎంత ముఖ్యమయినా యిప్పుడు నేనేమీ చేయలేను.'

'ఇవ్వాళ అయితీరాలి ఆ పని. అంచేత నేనీ రోజంతా సెలవు కూడా పెట్టానండీ అయ్యగారూ!'

'ఏంటీ? యివ్వాళ అయితీరాలా? ఇప్పుడు నీకు నా బల్ల మీద కనిపిస్తున్నపనికూడా యీవేళ అయితీరాల్సిందే. వెళ్ళి, ఆ క్లర్కుని అడిగి నీ క్కావలసింది తెలుసుకో!'

నేను మళ్ళా తలవంచుకొని పనిలో మునిగిపోయాను. అతనక్కడేనుంచుని వుండిపోయాడు అది గమనించిన నాకు కలం ఆడటం లేదు. కాని తల యెత్తేందుకు ధైర్యం చాలలేదు అంతట్లో అతనే ప్రారంభించాడు.

'సాబ్! ఒకకేసుకి సంబంధించిన కాగితాలు తమవద్దనే వున్నాయి. ఆ క్లర్కుదగ్గిర లేవు. బి. సి. 924 నెంబరు కండక్టరుని సస్పెండు చేసిన బాపతు కాగితాలు చూచి...'

'నాకు యిప్పుడు – తీరదు.'

'ఈ కేసు విచారణ రేపే వాయిదా అండి.'

'నువు ముందర బయటికి వెళ్ళు. నే కబురు పంపిస్తాలే అనక.

తెలివైనవాడివి. నువ్వుకూడా ఏమిటి ఇలా మొండిపట్టు పడుతున్నావు? రామశరణ్! నువ్వెళ్ళు ముందర. తీరిక కాగానే పిలిపిస్తాలే నిన్ను."

"ఇప్పుడు అయిదు గంటలయిందండి. ఆనక అయిదున్నరయితే, ఆఫీసుటైం అయిపోయిందంటారు మళ్ళీ."

"అలా అనను. సరా? నా జబాబుదారీ నాకు తెలుసు. నీ పని చేస్తేనేగాని యీ ఆఫీసు విడిచిపెట్టను. సరేనా?"

"అదంతా ఒద్దండి. నా పని మీరు చూసిపెట్టిన తర్వాతే యిక్కణ్ణించి పోతాను."

"నువ్వు దయచేసి తర్కించవద్దు! బయటికి పద!"

"నేను ఒక్క అడుగయినా కదలను."

"రామశరణ్!"

"నేను రామశరణ్ కాదు యిప్పుడు. యూనియన్ వారు నియమించిన ప్రతినిధిగా నేను మీ యెదట నిల్చుని మాట్లాడుతున్నాను. మీరు నే నడిగే కేసు వివరాలు నామీద దయతలచి చెప్పనక్కర్లేదు. మీరు ఉద్యోగరీత్యా చెయ్యవలసిన విధి—కర్తవ్యం అది."

"ఓహో! నాకు కర్తవ్యం బోధిస్తున్నా వన్నమాట! కాని నేను చెయ్యకపోతే?"

"చెయ్యనని రాసియ్యండి. తరవాత సంగతి చూసుకుంటాను. ఈ కుర్చీలోవున్న అధికార గర్వం కాబోలు యిది!"

"రామశరణ్! గెటవుట్ ఫస్ట్!"

"సరే సాబ్! అదీ చూదాం!"

ఉద్రేకంలో నా స్వరం ఎప్పుడు హెచ్చిపోయిందో నాకే తెలియదు. ఆఫీసులో అందరూ అదిరిపోయి చూస్తూ కూచున్నారు. రామశరణుడు వెనక్కి తిరిగి వెళ్ళిపోయాడు. అతణ్ణి చిత్తు చేశానని ఆఫీసులో వాళ్ళందరూ సంతోషించారు. జరిగిన సంభాషణవల్ల నాకు మనసులో కలిగిన ఆందోళన అణచుకోడానికి ప్రయత్నిస్తూ కళ్ళజోడుతీసి జేబురుమాలుతో అద్దాలు తుడుస్తున్నాను. ఒక ముఖ్యమైన పనికోసం యూనియన్ నా దగ్గరకు పంపిన ప్రతినిధితో నేను నడచుకోవలసిన పద్ధతి యిది కాదని నాకు తెలియక పోలేదు. నే నా

ప్రతినిధినీ, యూనియన్‌నీ కూడా అవమానించిన వాణ్ణయాను. ఈలోగా రామశరణుడు మళ్ళీ నా యెదటకొచ్చి నిలబడ్డాడు.

'సాబ్ ! క్షమించండి నన్ను !'

'దేనికి ?'

'నేను హద్దుమీరి మాట్లాడాను. మీది అధికార గర్వం అని నిందించాను. నేను ఆ తప్పుచేసి వుండకూడదు.'

'నేనూ కొంచెం హద్దుమీరాను...' అని కేవలం అతనికి మట్టుకే వినిపించే హీనస్వరంతో అన్నాను.

'ఎంత అణచుకున్నా అహంకారం ఒక్కొక్కప్పుడు కొంప ముంచుతుందండి. మనుష్య స్వభావం.'

అతనికి కావలసిన కేసు వివరాలు చెప్పాను. అతను వెళ్ళి పోయాడు.

ఏదో పని చూసుకుంటూ ఆఫీసులో నే నొక్కణ్ణీ వున్నాను. దొరగారు పిలిపించారు. ఆయన గదిలోకి వెళ్లాను.

'కొంచెం సేపటిక్రిందట బి. సి. 208 నీ దగ్గర కొచ్చాడు కదూ?'

'ఔనండి !'

"ఏం జరిగింది ?'

కాస్త మాటా మాటా వచ్చిందండి.'

'నే నంతా విన్నాను."

'కాని జరిగినదానికి అతను వెంటనే వచ్చి క్షమాపణ చెప్పు కున్నాడండి.'

'ప్రైవేటుగా చెప్పిన క్షమాపణ పాటించనక్కర్లేదు.'

'అతను పదిమంది యెదటే క్షమాపణ చెప్పాడు.'

'అసలు విషయం అది కానేకాదు. అతను నిన్ను బెదిరిస్తూ మాట్లాడేడా లేదా ?'

'నాకది బెదిరింపు అనిపించలేదండి."

'అదీ చూద్దాం అంటే ఏమి టర్థం ?'

'అందుకనే క్షమాపణ చెప్పుకున్నాడు.'

"నువ్వతన్ని కాపాడాలని కిందామీదా పడ్డంలో దూరదృష్టి ఏమీ లేకుండా ప్రవర్తిస్తున్నావు. ఒక్క ముక్క చెప్పు సూటిగా. అతను నిన్ను బెదిరించాడా లేదా ?"

"బెదిరింపా ? అసలు సంగతి చెప్పాలంటే, దొరగారూ, చాలా రోజులనుంచీ మేమిద్దరం కలుసుకోనే లేదు. ఒక్క మాటయినా మాట్లాడుకోలేదు."

"అతని విషయం వచ్చేటప్పటికి నువ్విలా నీరయిపోతావెందు చేత ? చెప్పవలసింది త్వరగా చెప్పు."

"ఒకానొకప్పుడు మాకిద్దరికీ చాలా స్నేహం ఉండేదండి. అది జ్ఞాపకం పెట్టుకునిచూస్తే, అతనిమాటల్లో అంతటి విపరీతార్థం రాదండి."

"అయితే, మీ స్నేహం సంగతి మరచిపోతేమట్టుకు అతని మాటలధోరణి బెదిరింపులా కనిపిస్తుందని ఒప్పుకుంటావుగా ?"

"ఆఁ! అంతే... అదా ?"

"సరే అయితే వ్రాతపూర్వకంగా యిదంతా రిపోర్టువ్రాసి పట్టుకురా !"

"వ్రాతమూలకంగానా ?"

"ఏం యిస్తే ?"

"దాని పర్యవసానం ?"

"అది మేనేజిమెంటుకి సంబంధించిన విషయం."

"కానీ..."

"నువ్వు యివ్వకపోతె, అది వేరేసంగతి. వీల్లేదు. నువ్వారిపోర్టు వ్రాత పూర్వకంగా యిచ్చి తీరాలి."

"అయితే, నేను కొంచెం ఆలోచించు కోవాలండి."

"ఎంతసేపు ?"

"నాలుగైదు రోజులు."

"నీ కేమయినా పిచ్చి పట్టిందా ఏమిటి ? ఈ ఆఫీసులో కూచుని ఎంత సేపు ఆలోచించుకుంటావో ఆలోచించుకో. కాని, ఆ రిపోర్టు యీ రోజునే పై అధికారులకి వెళ్ళి తీరాలి. నా డిపార్టుమెంటులో యిటువంటి అరాజకపు ప్రవర్తన ఎన్నటికీ సహించను. ఇది ఆఫీసు

కాని, వాళ్ళ మైదానంలో పెట్టుకునే మీటింగు కాదు, నోటికొచ్చి నట్లు మాట్లాడ్డానికి. ఈ సంగతి వాళ్ళకి తెలిసిరావాలి."

ఈ పరిస్థితి చివరకి నన్ను యిరకాటంలో పెట్టేలా తయారవు తోంది నేను చేతికి వచ్చినట్లు ఒక రిపోర్టు బరికి, దొరగారి దగ్గరకి తీసుకెళ్ళాను. ఆయన అది చదివి చూసి నా మొగంమీద విసిరే శాడు

"ఇది సరిగ్గా లేదు. రెండు ముఖ్యమైన మార్పులు చెయ్యి అందులో. యూనియన్ సంగతీ, క్షమాపణ సంగతీ తీసేసెయ్యి!"

అప్పటికే నా మనస్థిమితం పూర్తిగా పోయింది. ఆలోచించే శక్తికూడా హరించి పోయింది. ఏం చేస్తున్నానో తెలియనిస్థితిలో, యూనియన్ ప్రతినిధి అన్నమాట తీసేశాను. క్షమాపణసంగతి ఉంచే టందుకు ఎంతోసేపు వాదించినా, దొరగారిని ఒప్పించలేక పోయాను. బయటికి వస్తున్నప్పుడు దొరగారు నా భుజంమీద చెయ్యివేసి "నాయనా! అనవసరమైన ఆలోచనలతో బాధపడకు. ఆ తర్వాత పశ్చాత్తాపపడవలసివస్తుంది" అని సలహా చెప్పారు.

# 13

గడియారం పదిగంటలు కొట్టేటప్పటికి జనరల్ మేనేజరుగారి గదిలో నేనూ, మా దొరగారూ, రామశరణుడూ, అతని ప్లీడరూ హాజరయాం. ప్లీడరుగారితో రామశరణుడు చాలాసేపు మాట్లాడాడు. నేను మా దొరగారితో ఏదో మాట్లాడుతున్నట్లు నటించాను. అప్పు డప్పుడు రామశరణుడివేపు దొంగచూపు చూస్తూనేవున్నాను. అతను మామూలుగా రోజూ వున్నట్లే ఉన్నాడు. కంపెనీవారు నడిపించే యీ విచారణ తంతు అతనికి అతి తుచ్ఛంగా కనిపించి వుండాలి. ఒకసారి మాత్రం మా యిద్దరి దృక్కులు కలిశాయి. అతనొక నవ్వు నవ్వాడు. నేనూ నవ్వాను. లాంఛన ప్రాయంగా చేతులు జోడించాను.

విచారణ ప్రారంభమవడానికి యింకా కొంచెం వ్యవధి వుంది. ఇంతట్లో బయట ఏదో కోలాహలం వినిపించింది. కండక్టర్లు, డ్రైవర్లు కలిసి ఆఫీసువైపుగా ఒక ఊరేగింపు యేర్పాటుచేసి వుంటారు. వాళ్ళ నినాదాలు అంతకంతకు దగ్గిరకొస్తూన్నట్లు వినిపించాయి. కొంచెం సేపట్లో అవి మేం కూచున్న గదిలో ప్రవేశించి మారుమ్రోగుతున్నాయి. రామశరణుడి పేరు పలుకుతూ జయజయ ధ్వానాలు చేస్తున్నారు. జనం క్షణక్షణం ఎక్కువవుతూన్నట్లు అనిపించింది. జనరల్ మేనేజర్ ఒకసారి రామశరణుడివేపు చూశాడు. రామశరణుడు నిబ్బరంగా, తనకేమీ సంబంధం లేనట్లుండిపోయాడు. నేను ముఖంలో భయం కనిపించకుండా వుండేందుకు తంటాలు పడుతున్నాను. పాడు చెవులతో బయటి నినాదాలు వింటూన్నాను. మొదట్లో నాకు అస్పష్టంగా వినిపించిన నినాదం నా భయంకొద్దీ నేను ఊహించుకున్నదేమో ననుకున్నానుగాని, కాస్త జాగ్రత్తగా విన్నతర్వాత, అది నా ఊహకాదనీ, నిజమేననీ రుజువైంది. ఎవరో ఒక వ్యక్తి నా పేరు గట్టిగా ఉచ్చరించాడు. తక్షణం వంద కంఠాలు మ్రోగాయి, "నశించాలి!" అంటూ. నా దృష్టి జనరల్ మేనేజరు దగ్గిర మొదలుపెట్టి, ఆ గదిలోవున్న వాళ్ళందరివైపూ చిన్న పచారు చేసింది. అఖరికి రామశరణుడి ముఖంమీద అది నిలిచి పోయింది. అతను కొంచెం చికాకు పడుతున్నట్లు కనిపించాడు. ఇంకొంచెం సేపటికి మళ్ళీ నా పేరు ఉచ్చరించటమూ, "నశించాలి!" అనే పల్లవీ వినిపించాయి. హఠాత్తుగా రామశరణుడు లేచి బయటికి వెళ్ళాడు. ఎవరితోనో చాలా బిగ్గరగా అతను మాట్లాడుతున్నాడు. జనం అతన్ని ప్రశ్నలు వేశారు. అతను జవాబులు చెప్పాడు. కొంత సేపటికి బయటి కోలాహలం తగ్గింది. జనం వెళ్ళిపోవడం మొదలు పెట్టారు. ఆరోజు కొంచెంసేపు విచారణ జరిపి కేసు వాయిదా వేశారు.

రామశరణుడితో రెండు మాటలు మాట్లాడాలని నేను వెనక నిలబడ్డాను. కాని సందర్భపడలేదు. నా కోసం ఎదురుచూస్తూ అతను అవతల నుంచున్నాడు. నేను బయటికి రాగానే దణ్ణం పెట్టాడు. నాకు

ధైర్యం చెప్పాలని కాబోలు, అతను మెల్లిగా మాట్లాడ్డం మొద లెట్టాడు.

"నేను కట్టు దిట్టం చేశాను లెండి. మళ్ళీ అలాంటి నినాదాలు చేయరు."

"కాని, వాళ్లు అలాంటి నినాదం చెయ్యడానికి నేను అర్హుణ్ణే నేమో!"

"ఎన్నటికీ కాదండి. తమవల్ల మాకు మేలే జరిగింది."

"అట్లాగా?

"ఇప్పుడు మేనేజిమెంటు పడుతున్న అవస్థలు చూడండి ఓసారి. అదంతా, మీరు చాల తెలివి తేటలతో మీ|రిపోర్టు వ్రాయబట్టి. మా ప్లీడరుగారు మీ చాకచక్యాన్ని చాలా మెచ్చుకున్నారు."

"దొరగారికి కోపంవచ్చింది నా మీద."

"తప్పకుండా వస్తుంది. అప్పుడప్పుడిలాంటి ఘటనలు జరుగుతూ వుంటాయి; సర్దుకుంటూ ఉంటాయి. మానవులకి కష్టాలే ఎక్కువ కాలం జ్ఞాపకం వుంటాయి."

"నువ్వేమన్నా అనుగాని, ఈ పరిస్థితికంతకీ నేను నిమిత్తమాత్రుణ్ణి కావడం నాకు కష్టంగానే వుంది."

"రామశరణుడు నిర్దోషి'' అని కంపెనీ ఒప్పుకోవడం తప్ప విచారణకి మరో పర్యవసానం ఉండదని జనం అంతా అభిప్రాయ పడ్డారు. మొదటి రోజు విచారణ తంతు విన్నప్పుడు నాకూ అలాగే తోచింది. మేనేజరు చాలా సానుభూతితో వ్యవహరించారు. ఇష్టా గోష్టిగా వినోదాలతోనూ, చలోక్తులతోను ఆయన విచారణ నడిపించారు. కాని వకీలు మాత్రం, అంతమాత్రంచేత యిదమిద్ధంగా ఏమీ నిర్ణయించలేమని నీళ్ళు నములుతూనే ఉండిపోయాడు.

ఇదంతా కంపెనీ వారి పన్నాగం. పని వాళ్ళలో ఉద్రేకాన్ని ఉపశమింపజేయటానికి చేసిన యుక్తి. విచారణతంతు జరిగిన తరవాత రామశరణున్ని పనిలోంచి తీసివేశారు. రామశరణుడు నా దగ్గరికి వచ్చినందు వల్లా, నాతో మాట్లాడినందువల్లా అతన్ని ఉద్యోగంలోంచి తీసివేశారు. ఇంతకంటె ఆశ్చర్యం ఏముంటుందనిపించింది నాకు.

తీర్పు చెప్పవలసిన రోజున ఆఫీసునిండా పోలీసు బందోబస్తు. ఊళ్ళోవున్న ప్రతి బస్సుస్టాండు దగ్గిరా, టర్మినసు దగ్గిరా పోలీసుకాపలా ఏర్పడింది. ఏ క్షణంలో బస్సులు ఆగిపోతాయో అని అందరికీ సందేహమే. కంపెనీవారు సర్వవిధాలా జాగ్రత్త తీసుకొని, ఎటువంటి పరిస్థితి ఏర్పడినా ఎదుర్కొనేందుకు సన్నాహం చేసుకున్నారు.

ఊరంతా యింత గందరగోళం జరుగుతూంటే, నేను ఆఫీసులో ఆలోచనా రహితుణ్ణయి కూచున్నాను. దొరగారు నన్ను అర్జంటుగా రమ్మని కబురుచేశారు. లేచి ఆయనగదిలోకి వెళ్ళాను. ఆయన నాచేతికి ఒక కాగితం అందించారు.

"ఇది 208 నెంబరు కండక్టరు తాలూకు కాగితం. అతనికి చేరవలసిన పైకం లెక్కచూచి, త్వరగా ఆడిట్ డిపార్టుమెంటుకి పంపించు. ఇదుగో, యింకోసంగతి. ఈ పని నువ్వింకెవరికీ అప్పగించకు. ఇది జబాబుదారీ గలవాళ్ళు శ్రద్ధగా చేయవలసిన పని. అంచేత..."

"ఈ పని నేనే చెయ్యాలని మీకు పట్టింపు ఉందాండి? నా చేతిమీదుగా ఒక పాపిష్టిపని జరగనే జరిగింది. ఇంక యీ శ్రాద్ధ కర్మ కూడా నేనే..."

"ఏఁవిటా పాపిష్టిపని?" అని గద్దించాడు. అదే స్వరంతో, "నువ్వు శ్రమపడి పాపపుణ్యాలని అనుకునేవాటిని పరిగణించేందుకు కాదు యీ కంపెనీ పని చేస్తూంట. తొందరగా వెళ్ళి ఆ పని పూర్తి చెయ్యి. రెండు గంటల్లో లెక్కలుచూసి, స్టేట్ మెంటు తీసుకురా."

"ఇంత స్వల్పవ్యవధిలో ఈ పని పూర్తిచేయడం నావల్ల కాదండి."

"అయి తీరాలి. ఎలా పూర్తి చేస్తావో అది నీ సొంతవిషయం"

నే నక్కడే నిలబడిపోయాను. దొరగారు యీ వేళ ఏ విధమైన సానుభూతీ చూపించరని నాకుతెలుసు. ఆయన మరీ కోపంగా

"ఇంకా యిక్కడే నుంచున్నావా?"

"నే నీ పని చెయ్యనండి!"

ఎలా అనగలిగానోగాని, అనేశాను.

ఆయన దిగ్గున లేచి నిలబడ్డాడు. ఆ వేగానికి వెనక్కి తోసి

వేసిన కుర్చీ గజం దూరం వెళ్ళింది. ఆయన నిబ్బరంగా నా వైపే చూస్తున్నాడు.

'నువ్వు గనక, యింకొక్క అవకాశం యిస్తున్నాను ఈ కాగితాలు కిక్కురు మనకుండా తీసుకెళ్లి లెక్కలుచూచి పట్టుకురా. లేకపోతే యీ వ్యవహారం చాలా దూరం వెళుతుంది. ఇక ఆ తర్వాత నా దగ్గరనుంచి నువ్వు ఏ సహాయమూ అపేక్షించనక్కర్లేదు.'

నేనా కాగితాలు తీసుకెళ్ళి, రెండు గంటలు గడవకుండానే లెక్కలు తయారుచేసి, స్టేట్‌మెంటు ఆయన బల్లమీద పెట్టాను.

రామశరణుడి లెక్కల్లో ఆరునెలల సెలవు నిలవవుంది. దానంతటికీ జీతంకట్టి జమకట్టారు కంపెనీ వారు. ప్రావిడెంటు ఫండులో మా భాగం జమకట్టారు. గ్రాట్యుయిటీ పూర్తిగా మంజూరుచేశారు. ఎటొచ్చీ తాంబూలం, ధోవతుల చాపూ పెట్టలేదు. అంతే.

# 14

ఒకటి రెండు రోజుల్లో మళ్ళీ మామూలు పరిస్థితు లేర్పడ్డాయి. బస్సులు ఆగిపోతాయేమోనన్న భయం పోయింది. రామశరణుడి లెక్కల కాగితాలు ఆడిట్ డిపార్టుమెంటునుంచి జనరల్ మేనేజరు దగ్గరకి వచ్చాయి. ఇక అతను రసీదుమీద సంతకంపెట్టి పైకం తీసుకెళ్ళిపోయాడంటే, కంపెనీకీ అతనికీ ఏ విధమైన సంబంధం ఉండదన్నమాట.

ఈ రెండు రోజులనుంచీ అతన్ని కలుసుకోవాలని నేనెంతో ప్రయత్నించాను. అసలు అతన్ని ఉద్యోగం నుంచి తీసివేసిన రోజునే నన్ను చూడ్డానికి వస్తాడేమో ననుకున్నాను. కొన్ని రోజుల క్రితం అతన్ని తప్పించుకోటానికి ఎంత తాపత్రయ పడ్డానో యిప్పుడతన్ని కలుసుకోటానికి అంత ఉబలాటు పడుతున్నాను. అతనొకసారి నాకు కనిపించి, నా యెదటపడి నన్ను నాలుగు తిట్టినా బాగుండు ననిపించింది. అప్పుడతన్ని క్షమించమని అడగనైనా వచ్చు. ఆఫీసు

పనులమీద నాకు ధ్యాసే నిలవడంలేదు. ఒక్కొక్కప్పుడు ఈ ఆఫీసునీ, యీ పనినీ కాలదన్ని ఎక్కడికైనా వెళ్ళిపోదామా అనిపించేది. కాని, ఆ మాత్రం ధైర్యమే నాకుంటే, యిట్లాంటి విషమ పరిస్థితి ఎందు కేర్పడేది అసలు ?

సాయంకాలం ఆఫీసునుంచి బయటికి వచ్చాక ఎటుపడితే అటు నడిచిపోతుండేవాణ్ణి. నేను కంటపడగానే, ఒక్కొక్క కండక్టరు తన ప్రక్కనున్న వాళ్ళకి నన్ను వేలుపెట్టిచూపించేవాడు. పదిమందిలోనూ నా పేరు నిందాస్పదమయిపోయిందని నాకు తెలుసు. తమ నాయకుడి ఉద్యోగం ఊడిపోవడానికి నేనే కారణమని వాళ్ళందరికీ గట్టి నమ్మకం ఏర్పడింది.

ఎవళ్ళకో ఏమిటి ? అసలు నాకే ఆ నమ్మకం ఏర్పడింది. కాని కాస్తలోతుగా ఆలోచిస్తే యింకో వైపు నుంచికూడా వాదించవచ్చు. నేనేవిధంగానూ కారణం కాకపోయినా రామశరణుణ్ణి ఉద్యోగం చేయనిచ్చే వాళ్ళా ? నా దురదృష్టం కొద్దీ నేను నిమిత్త మాత్రు ణ్ణయ్యాను. నా మూలంగా కాకపోయినా యింకో మిషమీదన్నా అతన్ని తీసేసేవారు. ఈ సంగతి రామశరణుడికీ అవగాహన అయే వుంటుంది. కాని యిప్పుడు ఏం అనుకుని ఏం ప్రయోజనం ? అసలు ఆ విచారణ జరుగుతున్నన్నాళ్ళూ నేను ముద్దాయిలాగూ, అతను న్యాయాధిపతిలాగూ కనిపించే వాళ్ళమనుకుంటాను. ఏదైనా అన్యాయం జరిగితే సమ్మె కట్టించే సామర్థ్యం చేతిలో వున్నాక యీ విచారణ విషయంలో అతనికి పెద్ద భయం ఏం ఉంటుంది ? అసలు ఈ ఉద్యోగం పోయినందుకు అతను దుఃఖపడ్డానికి బదులు సంతోషపడుతున్నాడేమో కూడాను. దీని వల్ల యూనియన్‌లో తన పలుకుబడి పెరిగిందని ! అతన్ని మానిపించిన మరుక్షణంలో బస్సులన్నీ ఎందుకు ఆగిపోలేదా అని ఆఫీసులో అందరికీ ఆశ్చర్యం వేసింది. అక్కడే వుంది రామశరణుడి ప్రత్యేకత. అతని మాట నేర్పు పనివాళ్ళందరినీ శిక్షణలో వుంచింది. "సమ్మె అనేది చాలా అమోఘమైన అస్త్రం. దాన్నివృధా చేసుకోడం మనకి మంచిది కాదు. రామశరణుడి ఉద్యోగం నిల్పడానికి దీన్ని ఉప యోగించడం స్వల్ప ప్రయోజనాన్ని ఆశించడమే. మనం ముందు ముందు

యింతకంటె మహత్తర మైన కార్యాలు సాధించవలసి రావచ్చు' అని ఉపన్యాసం చెప్పాట్ట, తనను తొలగించిన నాడు జరిగిన మహా సభలో. అది అందరికీ బాగా నచ్చింది.

ఈ సంగతులన్నీ నాకు స్వయంగా చెప్పటానికి నా దగ్గరకి రావలసిన వాడే మరి ! అతను ఎక్కడుంటాడని ఏ కండక్టరుని అడిగినా, చెప్పేవాడు నాకు. యూనియన్ ఆఫీసులో అడిగితే తప్పకుండా చెప్పేవారు. కాని నాకంత ధైర్యం ఎక్కడిది ?

రామశరణుణ్ణి ఖచ్చితంగా కలుసు కోడానికి ఒక ఉపాయం స్ఫురించింది నాకు. అతి చురుగ్గా కేలండరులో కాగితాలు తిప్పి లెక్కేశాను బిల్లు ప్యాసయి మా డిపార్టుమెంటు లోంచి వెళ్ళి నాలుగు రోజులయింది. ఇక ఒకటి రెండు రోజుల్లో రామశరణుడు పైకం తీసుకోడానికి రావచ్చు - వస్తాడు.

తక్షణమే లేచి క్యాషియర్‌కి ఫోను చేశాను.

'208 కండక్టరుకి సంబంధించిన బిల్లు ప్యాసయి వచ్చిందా, మీ దగ్గరకి ?'

'నిన్ననే వచ్చిందండి.'

'పైకం తీసుకెళ్ళాడా ?'

'లేదండి !'

'అయితే చూడు! అతను రాగానే నాకు తెలియపర్చు !'

'చిత్తం'

ఫోన్ పెట్టేశాను. అమ్మయ్య అనిపించింది. కాని, నా మనశ్శాంతి ఆ ఒక్కరోజు మట్టుకే. రెండోరోజు నుంచి ఇంకో భయం పట్టుకుంది. టెలిఫోను మోగితే భయం వేసేది, అది క్యాషియర్ దగ్గరనుంచే నేమో అని.

అట్లా 15 రోజులు గడిచిపోయాయి. కాని, రామశరణుడి పైకం ఇంకా కంపెనీ ఖజానాలోనే వుండిపోయింది.

ఒక రోజున మా ఆఫీసులో ఒక గుమాస్తా నా దగ్గరకి వచ్చి రహస్యంగా అన్నాడు :

'ఇవాళ రామశరణుడు నాక్కనిపించాడు !'

నేను అతి ఆతురతతో అతనికేసి చూశాను. నేను యింకా రహస్యంగా అడిగాను :

'ఎప్పుడు ?'

'నేను ఆఫీసుకి వస్తూంటే అతను గోల్ నాకా వైపు వెళుతున్నాడు.'

'చ్ ! చ్ ! కాస్త ముందే ఎందుకు చెప్పావు కావు ?'

అతను తన కుర్చీ వైపు వెళ్తున్నాడు. పిలిచాను.

'సాదా డ్రెస్‌లోనే వున్నాడా ?'

'అవునండి'

'ఈ సారి నీక్కనిపిస్తే, నేను కబురు పెట్టానని చెప్పు ! వచ్చి నన్నొకసారి కలుసుకోమను !'

# 15

ఆరోజు ఆదివారం. 12½ గంటలయినా భోజనం చెయ్యబుద్ధి వేయలేదు. సిగరెట్లు తాగుతూ అలాగే కూచుని వుండిపోయాను. ఇన్నాళ్లకి – ఇవేళే – మనసు కాస్త నెమ్మదిగా వుంది.

ఇక భోజనానికిలేస్తే తీరిపోతుందికదా అని అనుకొంటూండగా, బయట తలుపు గొళ్ళెం చప్పుడయింది. ఇరుగు పొరుగు పిల్లలకి మా తలుపు బయట గొళ్ళెం పెట్టడం ఒక ఆట ! అంచేత, కొంచెం గట్టిగానే కేకపెట్టాను.

'ఎవరది ?'

'అయ్యగారూ, నేనండి !'

రామశరణుడా ?

చటుక్కున లేచాను కుర్చీలోంచి. కాని ఆలోగానే తలుపు తీసుకుని లోపలికి ప్రవేశించాడు. నా యెదటికి వచ్చి నుంచున్నది

రామశరణుడి గంభీరాకృతి! ఏమని పలకరించాలో నాకు తోచలేదు. ఏదో గొణుక్కుంటున్నట్టు, "నువ్వా" అన్నాను.

"అవును అయ్యగారూ!"

ఉన్నట్టుండి, వంగి నా పాదాలు స్పృశించాడు. "అరే! ఇదేం పని ?" అంటూ లేవదీశాను. తన చేతిలో వున్న పొట్లాం త్వరత్వరగా విప్పి, పూలహారం నా మెడలో వేయబోయాడు. నేను వెనక్కు తగ్గి "ఏమిటి యీ అట్టహాసం అంతా ? ఏమిటిది రామశరణ్ ?" అన్నాను.

"మీరు ఒద్దనకండి." అన్నాడు గాద్గదికంగా. నా మెడలో ఆ పూలహారం వేసేశాడు. నేను వెంటనే అదితీసి అతనికే అందించాను.

"నన్నెందుకు కించపరుస్తావు, రామశరణ్ ?"

"నిన్నటి యూనియన్ మీటింగులో నన్ను ఏకగ్రీవంగా ప్రెసిడెంటుని చేశారండి. నాకీ అదృష్టం పట్టటానికి మూలకారణం ఎవరో ఎవరికీ తెలియదు. తెలియబోదుకూడాను. తెలిస్తే అనేక అనుమానాలు పుట్టుకొస్తాయి. ఇంకెవరికీ తెలియదు కదా అని, నాకుతెలియకుండా ఎట్లా వుంటుంది ? ఈనాటి నా పదవి మీరు ప్రసాదించిందే."

ఈ ముక్కలంటూ అతను ఒక్కసారి నన్ను కౌగలించుకున్నాడు.

"నువ్వెప్పుడు వస్తావా అని యిన్నాళ్ళూ ఎదురు చూశాను."

"మీరు చాలా పనుల్లో వున్నారు. నేను యీ గడబిడలో వుండిపోయాను."

"ఆఫీసులో పైకం తీసుకోలేదా ఇంకా ?"

"లేదండి! బుద్ధిపూర్వకంగానే—తీసుకోరాదనే అలా వుంచేశానండి. లేబరు కోర్టులో దావా వెయ్యాలని నిశ్చయించాం. మీరు ఒక్క సంగతి నిజం చెప్పండి అయ్యగారూ. ఆరోజున నేను మిమ్మల్ని అవమానపరిచానా ?"

"రిపోర్టులో అట్లా రాశానా నేను ?"

"అదే మా కండక్టర్లందరూ అంటున్నారు. అయ్యగారు రిపోర్టు వ్రాసియిచ్చిన మాట నిజమే అయినా, అది కంపెనీవాళ్ళకి అనుకూలంగా మాత్రం లేదని."

"కంపెనీవాళ్ళు మాటలకి ఏవేవో అర్థాలుతీసి ఆ భావం తీసుకొచ్చారు. ఏం చెయ్యమన్నావు చెప్పు?"

"పోనీ, మిమ్మల్ని అవమానం చేశానే అనుకున్నా, నేను తక్షణమే క్షమాపణ చెప్పుకున్నానుగా! మరి దాని సంగతేమిటి?"

"అదీ రిపోర్టులో వ్రాశానుగా నేను! అది తీసెయ్యమని దొరగారు బలవంతపెట్టారు కూడాను. కాని తప్పించుకున్నాను."

"ఏం ఫరవాలేదండి, అయ్యగారూ! మీరు గనక ఆ మాత్రం సవ్యంగాను, సత్యంగాను రిపోర్టు యిచ్చారు. అంచేతనే మేమిప్పుడు కోర్టుకి వెళ్ళడానికి కాస్త ఆధారం అంటూ వుంది."

"రామశరణ్! నువ్వు చాలా ఉత్తముడివోయ్!"

"కాని, నన్నట్లా తయారు చేసింది మీరే! దానికేం గాని, నేనిప్పుడు మీ దగ్గరకి చాలా సున్నితమైన వ్యవహారంమీద వచ్చాను. నిజానికి మాకీ కోర్టులూ, కచేరీలూ అంటే ఏ మాత్రం యిష్టం లేదు. కాని ప్రస్తుతానికి తప్పదు. ఎంచేతంటే, యిప్పుడు గనక మేం ఊరుకుంటే, రేపటినుంచీ ఏదో ఒక సాకుతో తమ కిష్టంలేని కండక్టర్లనీ, డ్రైవర్లనీ తీసెయ్యటం మొదలుపెడతారు. ఆ పరిస్థితిని ఎట్లా సహించడం? కుటుంబాల్ని పోషించుకోవలసిన కూలివాళ్ళుకదా వాళ్ళు!"

"అదంతా నిజమే కాని, ఇప్పుడు నేను చెయ్యవలసింది ఏమిటి ఈ గొడవలో?"

"కేసు విచారణకి వచ్చినప్పుడు మీరు కోర్టులో హాజరుకావద్దు. అంతే."

"అదెట్లా సాధ్యపడుతుంది?"

"జబ్బుపడండీ!"

"ఒక వాయిదాకి జబ్బుపడవచ్చు. ఆఫీసువారు ఇంకో వాయిదా వేయించుకుంటే?"

"మీరు జబ్బుపడి ఇంకో ఊరు వెళ్ళిపొండి!"

అది ఉత్త వెర్రివూహ. మొత్తంమీద, రెండు వైపుల నుంచీ

ఒత్తిడి ఎక్కువై, చిక్కులు పెరిగి, నన్నోమూలకి నేట్టేస్తాయి కాబోలు, ఎటుపోవడానికీ వీల్లేకండా; ఎదురు తిరగడానికి వీల్లేకండా.

ముందూ వెనకా ఆలోచిస్తూ అలాగే నిలబడిపోయాను. అంతట్లో అతను జాలిగా మొదలు పెట్టాడు:

'అయ్యాగారూ! అయిదు వేలమంది పనివాళ్ళు మిమ్మల్ని ఆశీర్వదిస్తారు. మా పలుకుబడి అంతా యీ కేసుమీద ఒడ్డుతున్నాం. మీరు మంచిమనసు చేసుకుంటే...'

'రామశరణ్! నే నింత త్వరగా యీ విషయంలో ఒక నిర్ణయానికి రాలేను.'

'అయితే, మళ్ళీ ఎప్పుడు రమ్మంటారు?'

'నే కబురంపిస్తాలే.'

'నేనే వస్తాను. ఎప్పుడు రమ్మన్నారో చెప్పండి. ఇది మా అవసరం.'

'ఫలానా రోజని ఎలా చెప్పను చెప్పూ? జబ్బు పడ్డట్టు దొంగ సర్టిఫికెట్టు యివ్వడంవల్ల చాలా ప్రమాదం రావచ్చు. పైగా ఈ పరిస్థితుల్లో అలాటి సర్టిఫికెట్టు దొరకడం కూడా కష్టమే'

'ఆ యేర్పాటు మా కొదిలెయ్యండి. వజ్రాయుధంలాంటి తిరుగులేని సర్టిఫికెట్టు పట్టుకొస్తాను!'

'ఏదైనా నన్ను కాస్త ఆలోచించుకోనీ. మీ కేదో సహాయం చేయబోయి, నేనుకూడా దేన్లోఅయినా యిరుక్కుంటే...'

'కాని...'

'పైగా నువ్వింకో సంగతికూడా గమనించాలి. నేను నీ అంత ఉత్తముణ్ణి కాను.'

'మీ రలాంటిమాట లనకండి అయ్యగారూ!'

'అది ఉన్నమాటే! ఎలా దాగుతుంది? అదీకాక, నువ్వు చేసుకునేంత త్వరగా నేను నిర్ణయాలు చేసుకోలేను.'

# 16

రామశరణు డింకా నాతో మాట్లాడుతూండగానే నేను నా మనసులో ఒక నిశ్చయానికి వచ్చేశాను. అటువంటి నిశ్చయం ఏర్పడ్డానికి రామశరణుడి మాటలే నాకు చాలా తోడ్పడ్డాయి. అసలు అయిదువేలమంది కండక్టర్ల క్షేమం నా ఒక్కడిమీదే ఆధార పడి వుండేలాగ చేసుకునేంత వ్యవహారజ్ఞానశూన్యుణ్ణి కాను. 1258 మంది గుమాస్తాల్లో నే నొకణ్ణి. అయినా, రామశరణుడు వెళ్ళిపోయిన తర్వాత కూడా యీ విషయమై చాలాసేపు ఆలోచించాను. తిన్ననైన మార్గంలో న్యాయంగా నడిస్తే యీ సాక్ష్యం తప్పించుకోటం అంత సులభమైన పని మట్టుకు కాదని నాకూ తెలిసు. నేనెంతో జాగ్రత్తగా మెసులుకున్నందువల్ల నా మనసుకి చాలా గుంజాటన తప్పింది. నా ప్రవర్తనవల్ల కలిగే మంచి చెడులు ఒక్క రామశరణుని మీదే పడేలాగుంటే, నేను ఇంత తొందరలో ఏ నిర్ణయానికీ రాలేక పోయే వాణ్ణే.

మొత్తం మీద నన్ను మంచి యిరకాటంలోనే పెట్టాడు రామశరణుడు. రెండు రోజులయాక మళ్లీ వచ్చాడు మాయింటికి. నేను చిరునవ్వుతోనే స్వాగతం యిచ్చాను.

అతనొక కుర్చీలో చతికిల పడ్డాడు.

"అయ్యగారూ! నన్ను క్షమించమని ప్రార్థించటానికి వచ్చాను."

"క్షమించడమా!"

"అవునండి!" నేను మొన్న మీతో అబద్ధమాడేను."

"ఏమిటది?"

"నా కేసులో నేను అప్పీలు చేయడానికీ, వేలమంది కండక్టర్ల క్షేమానికీ ఏవిధమైన సంబంధమూ లేదు."

"అట్లానా?"

"పూర్తిగా స్వార్థం. అంతే!"

"మరి అబద్ధం ఏందుకు చెప్పావు?"

'మీ ఎదట నా గొప్పతనం చూపించుకోబోయాను. కాని యింటికెళ్లాక నా అల్పత్వం అర్థమైంది. ఇంకెవరైనా ఫర్వాలేదేమో కాని తమ దగ్గర నేనిట్లాంటి తప్పుపని చేసి వుండకూడదు. ఈ కేసు అప్పీలు చేయడంవల్ల కలిగే లాభనష్టాలు నా ఒక్కడికే తప్ప యింకెవరికీ ఏ విధమైన సంబంధమూ ఉండదు. అఖరికి నా వుద్యోగం పోయినా సరే,' అని మాట్లాడలేక ఒక్క గుటక వేశాడు.

అతనికి కాస్త ధైర్యం చెప్పాలని పించింది.

'పూర్తిగా చెప్పు రామశంకర్! ఏదైనా ఒక ఉపాయం వెతుకుదాం.'

'మీకు నా విషయం పూర్తిగా తెలుసు. నేనీ వుద్యోగంలో చేరినప్పునుంచీ – అంటే గడచిన 8 సంవత్సరాలనుంచీ – మా వూరు నేను వెళ్లనేలేదు. మాకసలు సొంతవూరు వెళ్లి రావాలనే వెర్రికోరిక ఎక్కువగా వుంటుంది. అయినా సరే, నేను వెళ్లలేదు.'

'చాలా రోజులు నాకూ వుండేది ఆ వెర్రి ఆశ. కాని తరవాత పనిలోపడి ఆ సంగతి మరచిపోగలిగాను.'

'అంత దూరం వెళ్ళి రావాలంటే చాలా ఖర్చు అవుతుంది. రెండుపూటలా భోజనం తప్ప, దేనికీ ఒక్క దమ్మిడీకూడా ఖర్చు పెట్టలేదు నేను. ఈరోజువరకు నా కెట్లాంటి వ్యసనమూ లేదు. అ మధ్య కొన్నాళ్ళు ఒక స్వామివారి వెంట పడ్డాను. అంతే. మీకు జ్ఞాపకం ఉండేఉంటుంది.'

'బాగా జ్ఞాపకం వుంది. ఆ రోజుల్లో నేను నీతో ఒక అబద్ధం చెప్పాను.'

'అట్లానా?'

'అవునోయ్! నువ్వొక రోజున ప్రసాదం, విభూతీ తెచ్చి యిచ్చావుకదూ నాకు? ఆ మర్నాడే నాకు పెద్దఉద్యోగం దొరికింది. మళ్ళా కనిపించారా ఆ స్వాములవారు?'

'ఆయన గొడవెందుకు లెద్దురూ! ఆయన విభూతికీ మీ పెద్ద ఉద్యోగానికీ సంబంధ మేమీ లేదు. మీ చురుకుతనం, సామర్థ్యం కంపెనీలో ప్రతివాడికీ తెలుసు. పెద్ద ఉద్యోగం మీ కివ్వక

పోతే యెవరికిస్తారు ? నా లాంటి అసమర్థుడి కోరిక లేమయినా ఫలించి వుంటే, అది స్వాములవారి మహాత్యం అని ఒప్పుకునేవాణ్ణి.'

'ఏమిటి నీ కోరిక ?'

'నాకు పైకం కావాలి. ఒక పెద్ద మొత్తం కావాలి. అది దొరక లేదు సరికదా, చేతిలోఉన్న యాభై రూపాయలూ ఖర్చైపోయాయి.'

'నువ్వు ప్రతి రోజూ పూజ కూడా చేసేవాడవు కాదే !'

'గతి లేనప్పుడు మనిషికి గాడిదబుద్ధులు పుడతాయి !'

'నీ కెంత పైకం కావలసి వచ్చిందేమిటి ?'

'చాలా ఎక్కువ. ఐదు వేల రూపాయిలు.'

'దేనికోసం ?'

'అదో పెద్ద కథలెండి. పూర్వం మేమూ చాలా సంపన్నుల మే నండి. మా కుటుంబంఅంటే ఊరందరికీ గౌరవం వుండేది. మంచి దర్పం వుండేది మాకు. కాని కాలం మారింది. దురదృష్టం చుట్టు కుంది. పెద్దలు సంపాదించిన భూమీ పుట్రా తాకట్టు పెట్టాల్సి వచ్చింది. మా తండ్రిగారి ప్రాణం ఒక పెట్టున పోలేదు. ఆయన చేతి మీదుగా యీ మహాపాపం జరిగిందని చాలా బాధపడ్డారాయన. చివరకి నేనొక ప్రమాణం చేశాను ఆయన యెదుట-ఈ తాకట్టు విడి పిస్తే గాని నేను పెళ్ళి చేసుకోనని. చెమట ఓడ్చి – కాదు రక్తం ఓడ్చి – సంపాదించి నిలవచేశాను యిన్నాళ్లూ. రెండు వేలు పోగయి నాయి. ఇంకా మూడువేలు కూడాలి.'

'మూడువేలా ?'

'మరేనండి ! ఏమైనా చిన్న మొత్తం అయితే యీ ఉద్యోగం కోసం యింత తాపత్రయ పడేవాణ్ణి కాను. నేనీ యూనియన్ గొడవ లన్నీ ఎందుకు పట్టించుకునేవాణ్ణి ? ప్రపంచంనిండా లక్ష అన్యాయాలు జరుగుతూనే వున్నాయి. నా లాంటి దిక్కుమాలినవాడు తీర్చగలడా ? అందుకని ఆవేశం తెచ్చుకుని అవన్నీ దిద్దడానికి బయలుదేరడం నాలాంటి వాడికి తగిన పనా ? నాకు ఒకవేళ పెళ్ళీ పెటాకులూ అయి వుంటే, యింత చొరవ వుండకుండా పోయేదేమో !'

'ఇప్పుడైతే మాత్రం ఏం ? పెళ్లి చేసుకోరాదూ ?'

"ఇప్పుడు రామశరణ్ జిందాబాద్ అనిపించుకోవాలనే తృష్ణ పట్టుకుందిగా!"

ఈ ముక్క అని గట్టిగా నవ్వాడు. కాస్సేపయాక, మళ్ళీ ఆ నవ్వుతున్న స్వరంతోనే :

"అయ్యగారూ! మిమ్మల్ని ఒకటి యాచిద్దామని వచ్చాను."

"ఇదుగో, రామశరణ్! ఇలాచూడు. నీ కేంకావాలో మన సిచ్చి చెప్పు ఊరికే యాచనా గీచనా అనవద్దు. మీరందరూ ఇంకా అసలు ... కాస్త ముందు ఆలోచన ఏమీ వుండదు. అసలు సంగతేమిటో చెప్పు."

"మీరు కోర్టుకివచ్చి సాక్ష్యంచెప్పినా నాకేంఅభ్యంతరం లేదండి!"

"ఆ సంగతి నే నిదివరకే నిశ్చయించుకున్నాను. అది తప్పించు కోటానికి నువ్వారోజున చెప్పిన యుక్తి సులభంగా సాగదు."

"ఇంటికెళ్ళి ఆలోచించి చూస్తే నాకే నచ్చలేదండి. మీరు తప్పకుండా సాక్ష్యం యివ్వండి. కాని ఒక్కపని చేసిపెట్టండి. ఆ సాక్ష్యం నాక్కూడా కాస్త ఉపయోగంగా ఉండేలా యివ్వండి."

"అదంతా నావల్ల కాదు."

"అయితే నేను చెప్పాల్సిందేమీ లేదు."

"ఎందుకులేదు? వకీలు చేసేపని నేనెట్లా చెయ్యగలను?"

"నేనో వకీలుని తీసుకొచ్చానండి?"

"ఓరి అసాధ్యుడా!"

బయట వరండాలో ఎవరో నుంచున్నట్లు నాకనుమానం కలిగింది ఒకటి రెండుసార్లు. ఒక్క క్షణంలో రామశరణుడు బయటకు వెళ్ళి యూనియన్ తరపు ప్లీడర్ని లోపలికి తీసుకొచ్చాడు.

ఒకరి కొకరు పరిచయాలూ, కుశల ప్రశ్నలూ అయిన తర్వాత, నాకు సాక్ష్యం యివ్వడాన్ని గురించి రిహార్సలు ప్రారంభమయింది. రెండుగంటలసేపు యీ ఫార్సు నడిచింది. ఆ వచ్చిన ప్లీడరు జడ్జీ వేయబోయే ప్రశ్నలు వేస్తూండడం, వాటికి నేను ఎలాంటి సమాధానాలు చెప్పాలో, ఏ విషయాలు చెప్పకూడదో నాకు బోధించడమూను. ఆయనకు పూర్తిగా తృప్తి కలిగాక గాని ఆనాటకం ఆగలేదు.

# 17

వాతావరణం మళ్ళీ వేడెక్కడం మొదలైంది. పని వాళ్ళందరి లోనూ మళ్ళీ గుసగుసలు ప్రారంభమయాయి. ఎక్కడ చూచినా యీ కేసును గురించిన మాటలే. ఇది రామశరణుని ఉద్యోగానికి సంబంధించిన విషయమనే అంశాన్ని అందరూ ఒదిలిపెట్టేశారు. మరిచిపోయారు కూడాను. కంపెనీకీ పని వాళ్ళకీ మధ్య ఏర్పడిన తగాదా స్వరూపం వచ్చింది విచారణకి. అసలు కోర్టులూ, కచేరీలూ అనే గొడవలో అనవసరంగా యూనియన్ పడిపోయింది. కంపెనీ వాళ్ళకి అర్థమయే భాష ఒక్కటే : సమ్మె. ఈ అభిప్రాయం అందరిలోనూ బలంగా ఏర్పడి పోయింది. అలాగే, యీ కేసు గెలిచేలా చేయడం పూర్తిగా నా మీదే వుందని ఒక అభిప్రాయం ఏర్పడి పోయింది. చాలా మంది పని వాళ్ళు నాకు దణ్ణాలు పెట్టడం మొదలెట్టారు. నాకది ఎంత మాత్రం యిష్టం లేక పోయినా, వాళ్ళని యెలా మాన్పించడం ? ఏమయితే అయిందని నేనూ నవ్వుతూ ఆ దణ్ణాలు స్వీకరించేవాణ్ణి.

నేను సాక్ష్యం చెప్పడం ఆరంభమయింది; పూర్తయింది. ఎవరి తోనూ ఒక్కమాట మాట్లాడకుండా, వంచిన తల యెత్తకుండా కంపెనీ కారులో కూలబడి ఇంటికి చేరుకున్నాను. కోర్టులో వున్న భయంకర వాతావరణం ఇంటికొచ్చిపడినా నన్ను విడిచిపెట్టలేదు. రామశరణుడు నావైపు చూచినచూపు నా కింకా కనిపిస్తూనే వుంది. నేను చెప్పిన సాక్ష్యం వినగానే రామశరణుడికీ, అతని వకీలుకీ ముఖా లెలా వాడిపోయాయో చూచేందుకు నాకు కోర్టులో ధైర్యం చాలలేదు. కాని, ఇప్పుడా ముఖాలు నా కళ్ళకు కట్టినట్లున్నాయి. కోర్టులో నుంచి బయటికి వస్తున్నప్పుడు కొంతమంది తుచ్ఛంగా "ఛీ, ఛీ" అనడం, కొంతమంది నాకేసి చూడ్డం బాణాల్లాగా గుచ్చుకున్నాయి. కళ్ళు మూసుకుని పడక కుర్చీలో వా పోయాను. ఇప్పుడు మిగిలిన స్వస్థత యింతమాత్రమే.

కాని, నేనేదో తప్పుచేశానన్న భావం మాత్రం నాకు కలగలేదు. అప్పుడూ కలగలేదు. యిప్పుడూ కలగడంలేదు. నేనేదో ఉదాత్తమైన మనిషిని ఎప్పుడూకాను. రామశరణుడు నావల్ల ఏదో జరిగితీరుతుందని ఆశ ఎందుకు పెట్టుకోవాలి అనవసరంగా? అతను ఆశ పెట్టుకున్నాడని నాకుతెలిస్తేమాత్రం అది ఎలా ఫలింపచెయ్యగలను? అసలు మొదటినుంచీ వాళ్లు నాకు ఏర్పరచిన మార్గం నచ్చనేలేదు. నాటకమాడటం నాకు సాధ్యమూకాదు. ఇలా ఎంత ఊరడించుకొన్నా, మళ్లీ మనసులో ఒక ప్రశ్న తలెత్తుతూనే వుంది.

మనసు స్వచ్ఛంగా వుంచుకోవాలనుకుంటే మాత్రం కోర్టులో యిట్లాగే ప్రవర్తించాలా? "అసలు స్వార్థానికి ఏదో మోసం కలుగుతుందేమోనన్న భీతి ఏకోశానా నీలో లేదనే అంటావా?" అని మనసు అడగడం ఆరంభించింది. ఎన్ని విధాల సముదాయించి సమర్థించుకోవాలన్నా మనసు యీ సణుగుడు మాననేలేదు.

మళ్ళీ తెల్లవారితే ఆఫీసుకి వెళ్ళాలిగదా అన్న స్ఫురణ రాగానే భయంతో ఉలిక్కిపడ్డాను, డ్రైవర్లలో మోటువాడెవడైనా పొడిచి పారేయడుగదా అని. ఈ అనుమానం వచ్చాక, ఒక్క క్షణంకూడా నెమ్మదిలేకుండా పోయింది. పోనీ, సెలవుకి దరఖాస్తు పెడితేనో! ఎన్నాళ్ళని సెలవుపెట్టడం?

ఏదో యీ అల్లరి అణిగేవరకూ సెలవు పెడితేనో! పనివాళ్లు పదిమందీ యీ వృత్తాంతం మరచిపోయేవరకూ – అంటే రెండవ సంవత్సరం అంతాఅయినా చాలుతుందని నమ్మకం ఏమిటి? అంచేత, కాగితాలమీద పిచ్చిగీతలు గీస్తూ కూచున్నాను. చాలాసేపయాక కలం, కాగితం ఓపక్క పారేసి, పడకకుర్చీలోనే పడి వుండిపోయాను.

రెండు రోజులు గడిపాను, అలాగే కూచుని కూచుని. మనసుకి కొంత నెమ్మది కుదిరింది. ఇంకో నాలుగు రోజులుంటే అప్పటి భయమంతా మరిచి పోయేవాణ్ణేమో కూడాను కాని అంతటి అదృష్టం ఎక్కడిది? అసలు యింతటి భయంకర వృత్తాంతానికి అలాంటి చప్పు పరిసమాప్తి ఎలా నప్పుతుంది?

# 18

ఎటూగాని అసుర సంధ్య సమయం ఎంచుకుని మరీ వచ్చాడు, రామశరణుడు నన్ను చూడ్డానికి. అరిగిపోయిన జోళ్లూ, ఎఱ్ఱబడిన కళ్ళూ—అవి మట్టుకే కనిపించాయి నా కళ్ళకి. కొంచెం సేపయాక గాని అతను ఒక చెయ్యి వెనక దాచుకున్నాడన్న విషయం మనసులో నాటుకోలేదు. గాడిద కొడుకు కత్తిపట్టుకు వచ్చాడా ఏమిటి ?

'వాడికి కోపం తెప్పించావంటే మంచివాడు కాడతను. అతని జోలికి పోవద్దు,' అన్న మా దొరగారి మాటలు జ్ఞాపకం వచ్చాయి.

వణుకుతూ కుర్చీలోంచి లేచాను. క్షణంలో అతని పాదాల దగ్గిర కూలిపోయాను. 'రామశరణ్ ! నన్ను చంపకోయ్ ! చంపకు!' అని కిందపడి పొర్లాడాను.

అతను చటుక్కున వెనక్కు తగ్గి, గదిలో ప్రవేశించాడు. గడప మీద కూర్చుని నేను అతనివైపే చూస్తున్నాను. అతను నా కళ్ళలోకి చూస్తున్నాడు.

కొంచెంసేపయాక కొంచెం దగ్గరగా వచ్చాడు. సునాయాసంగా నన్ను లేవదీసి కుర్చీలో కూచో పెట్టాడు.

ఒక్క నవ్వు నవ్వాడు. కాని తక్షణమే ముఖం మళ్ళీ గంభీరమై పోయింది. అంతట్లో మళ్లీ విచార గ్రస్తుడిలా నా యెదుట కూలబడ్డాడు. వాని బుర్రలోవున్న ఆలోచన ఏమిటి యింతకీ ?

చాలాసేపు గడిచినతరవాత లేచి నిలబడ్డాడు.

'ఎంతపని చేశారండీ అయ్యగారూ !'

'రామశరణ్ ! పొట్టకోసం మనిషి ఎంత నీచుడైపోతాడు !'

'కాని, మరీ ఇంతగానా ?' అన్నాడు నవ్వుతూ.

'సాక్ష్యం ఇవ్వక నాకు గత్యంతరం లేకపోయిందోయ్ !'

'నేనా సాక్ష్యం సంగతి కాదండి చెప్పేది. మీకు ఇంకా పెద్ద ఉద్యోగం ఇవ్వడానికి నిశ్చయించారట. ఆనాడే మాకు సంగతంతా

అర్థమైపోయింది. కనీసం నాతో అయినా చెప్పలేదేమండీ మీరు ? కాని, అది నా కంత కష్టంకలిగించలేదు. కాని... ఇదీ .. ఇదేమిటండీ?'

ఏ సంగతీ నాకు అర్థం కాలేదు. అలాగే సగం తెరిచిన కళ్ళతో అతనివైపే చూస్తున్నాను. అతను జేబులోంచి ఒక పోస్టు కవరు తీశాడు. నాలుగు రోజుల క్రితం నేను పోస్టులో పంపిన కవరది. అందులో నేను పంపిన మూడువేల రూపాయల చెక్కు అలాగే వుంది!

రామశరణుడు ఆ కవరులోంచి చెక్కు బయటికి తీశాడు.

'మీ చెక్కు మీరు తీసుకోండి! మీ జేబుకిది బరువుగా తోస్తోందా ? నా తగాదా కంపెనీ తోటి; మీతో కాదు.'

'నాకీ మాత్రం అయినా తృప్తి ఉండనివ్వకుండా నాశనం చేస్తావా ?'

'మీకు తృప్తికాదు; నా తండ్రిగారి ఆత్మ తృప్తికోసమయినా సరే, యిది నేను తీసుకోను! ఇది కేవలం వ్యభిచారం లాంటిది. నేను వెళ్ళొస్తా.'

'రామశరణ్! నువ్వింత శాంతంగా మాటాడినందుకు చాలా బాధగా వుంది. నాలుగు తిట్టనైనా తిట్టవోయ్!'

'దానికైనా పాత్రులండె మీరు ? క్షమించండి. నోరుజారింది. మిమ్మల్ని ఒక్కమాటయినా అనకూడదని మనస్సులో ప్రతిజ్ఞపట్టి యిక్కడికి వచ్చాను.'

'నన్ను చంపడానికి వచ్చావనుకున్నానోయ్.'

రామశరణుడు ఏమీ జవాబు చెప్పలేదు. ఒక్క నవ్వు నవ్వాడు. వెళ్ళిపోయాడు.



# పెద్దిగాడి మేక

పోతురాజు గుడివెనక మైదానాన్ని 'పెద్దిగాడి పెరడు' అంటారు. పూర్వకాలంలో దాన్ని 'దయ్యాల దిబ్బ' అనేవారు. పెద్దిగాడిపేరుతో పెనవేసుకుపోయిన యింకో స్థలంకూడా వుంది ఆ వూళ్లో. మాల గూడెం చివరని, ఎడంచేతి ప్రక్కగా విరిగిపోయిన కాడి ఒకటుంది. ఇక్కడే పెద్దిగాడియిల్లు వుండేది; ఆ యింటిచుట్టూ కంపవేసి అవరణ చేసుకున్న కాస్త స్థలాన్నీ 'పెద్దిగాడి ముంగిలి' అంటారు. ఆ కాడికి యెడంప్రక్కనున్న ఒక స్థలం చూపిస్తూ, అది 'పెద్దిగాడి వసారా' అంటారు, ఆ వూరివాళ్లు. అక్కడే "జుమ్మన్‌ని కట్టేసేవాడు" అంటారు.

ప్రస్తుతకాలంలో పెద్దిగాడిని గురించి అనేక కథలు చెబుతూంటారా వూరివాళ్లు. "అమావాస్య నాడర్ధరాత్రి పోతురాజు గుడిదగ్గర కూచో చూద్దాం" అని సవాలుచేస్తూంటారు."

"చెమటలు కారుకుంటూ, ఒగర్చుకుంటూ పెద్దిగాడొచ్చి, నా జుమ్మన్ని చ్చెయ్యండో!" అని నీ కాళ్ళు పట్టుకుంటాడో లేదో "నీ యిష్టంవచ్చిన పందెంపెట్టు" అంటూ రావూరివాళ్లు. వాళ్ళ ఆవేశం, నమ్మకం చూసినవాడెవడూ పందెం వేయలేదు. పైగా ఏమిటా వృత్తాంతం అని అడిగి, జుమ్మన్‌కథ చెప్పించుకుని, అతి శ్రద్ధగా వింటారు.

'నా జుమ్మనో !' అని ఏడుస్తూనే, పెద్దిగాడు యీ లోకం వదిలాడు. కాని, రక్తమాంసా లున్న మనుషుల్ని యెవర్నీ ప్రేమించే అదృష్టం పెద్దిగాడికి పట్టలేదు. సంతానం వుండేది. సంసారంవుండేది. ఒకరుకాక యిద్దరు పెళ్ళా లుండేవారు. వీళ్ళందరూ తిని తిరగడానికి సరిపోయేటంత సంపాయించేవాడు. కాని వాడి విధి యెలాంటిదో గాని, ఒక మూగజీవాన్ని ప్రాణంగా చూసుకునేవాడు.

నిజానికి, అసలు జుమ్మన్ వాడి జీవితంలో ప్రవేశించబట్టే వాడి జీవితానికి కొంత జీవంవచ్చింది. లేకపోతే, వా డెప్పుడు చచ్చి పోయినా, యెవరూ పట్టించుకోకపోయేవారు.

అసలు వాడిజీవితం ఒక జీవితమేకాదు, జుమ్మన్ లేకపోతే.

ఆయుర్దాయమంతా చచ్చిపోయిన పశువులకళేబరాల్ని కోయడం తోటే గడిచి పోయింది. పెళ్ళాల్ని బాదేవాడు. పోతురాజు కృపవలన సంతానం సమృద్ధిగా ఉండేది. కాని ఒక్కణ్ణయినా ఆపేక్షగా దగ్గరకి తీసుకున్న పాపాన పోలేదు. ఆపేక్ష అంటే ఏఁవిటోకూడా పెద్దిగాడికి తెలియదు.

చచ్చేలా శ్రమపడేవాడు. గొడ్డుచాకిరి చేసేవాడు. కాని ఎవరి కోసం ? ఆ సంగతెప్పుడూ అలోచించనే లేదేమో అతను. పది మంది పెట్టున పని చేసేవాడు. కాని వాణ్ణి ఎప్పుడూ ఎవరూ మెచ్చుచుకో లేదు. ఎవరు మెచ్చు కుంటారు ? ఏవరితోనైనా మాట్టాడితేనా వాడసలు ?

పగలంతా పని చేసి యింటికి వస్తూంటే, యింటిల్లి పాదీ హడలి పోయేవారు. నవ్వుతూ నాలుగు మాట్టాడ్డం ఎవ్వరూ వినలేదు. ఆ జాతకం లోనే లేదు అది. తప్పతాగి అట్లా వుండేవాడేమో అంటే, ఎక్కువగా అదీ లేదు మళ్ళీ. ఆ స్వభావమే అంత.

తిండిలోకి నంజుడు లేకపోతే, యిద్దరు పెళ్ళాలనీ యిల్లెగిరి పోయేలాగ తిట్టేవాడు. చిన్నపిల్లలకి అన్నంలోకి ఏమయినా వుందాలేదా అనేధ్యాసే వుండేది కాదు. అతను కడుపునిండా తిని లేనిస్తే, పెళ్ళాలకి సగం ఆకలి తీరేది.

ఇంట్లో ధోరణి యిట్లా వున్నప్పుడు యిక బయట మక్షుకు యింకోలా ఎందుకుంటుంది ? ఎక్కడయినా అంతే. రచ్చబండ దగ్గిర అందరూ పోగయినప్పుడు ఎక్కడో ఒక మూలగా కూర్చునేవాడు. బుర్రలో ఏమయినా తోస్తే అప్పుడు మాట్లాడేవాడు. అదయినా అతి మెల్లిగా. లేకపోయినా ఎవరు వినిపించుకునేవారు గనక. అసలు అతని ఒంటెత్తు స్వభావం అందరికీ తెలుసుగనక. అతను మాట్లాడింది తప్పయినా ఒప్పయినా, దాని మీద నలుగురూ నాలుగు రకాల పుల్లవిరుపు మాటలూ అని, అతను చెప్పిన దాన్ని తోసిపారెయ్యటం రివాజు అయిపోయింది. అసలు పెద్దిగాడేమయినా అన్నాడంటే, అదేదో లోకవిరుద్ధంగా వుండేదే అంటాడని అందరి అభిప్రాయమూను.

అసలు అతని స్వభావానికిఅతను చేసేపనే కారణమేమో: చచ్చిన గొడ్లనికొయ్యటం. వంశపరంపరగా అదేవృత్తి. ఏక్రోసులచుట్టుప్రక్కల్లో చచ్చిన గొడ్లన్నీ అతనికి రావల్సినవే. ఇంటిముందు ఒక చిన్న పెరడుండేది. దానిమీద అతని కెప్పుడూ లక్ష్యం ఉండేదికాదు. దాని బాగోగులు చూసుకోవటం భార్యల పని.

పెద్దిగాడికి యాభయ్యో పడి వచ్చేటప్పటికి యింట్లో జనం చకచక చచ్చిపోడంమొదలెట్టారు. పెద్దభార్య ఏమొచ్చిపోయిందో అతనికి తెలియదు. పొట్టలో బల్ల పెరిగిందో అని గోలపెడుతూండేది. పని చేయటం తప్పించుకోడానికి వేషం వేస్తోందనుకున్నాడు. అది బాధగా ఉందని కేకలువేసి ఏడుస్తుంటే 'నీ ఒక్కత్తెకే బల్ల పెరిగిందేం ! మా అందరికీ లేదేంమరి ?' అని గద్దించేవాడు. పక్కనుంచి లేచే శక్తి లేకపోయినా, లేచివచ్చి అరుగుమీద పడేసిన చర్మాలను బాగుచేయవలసి వచ్చేది. ఈగలు ముసురుతుండేవి. వాంతు లొచ్చేవి. డోక్కుంటుంటే "దొంగముండ డోకటం మొదలెట్టింది. కాని నేను మోసపోనేవ్ ! నే మోసపోను" అనేవాడు.

మోసపోడుటకదూ ! ఓ రోజున చచ్చి వూరుకుంది. గొడ్డు చర్మం గీకుతూ, డోక్కుని చచ్చిపోయింది. పెద్దిగాడికి యింకా అనుమానమే. "నిద్రపోయినట్టు దొంగవేషం ; అంతే" అన్నాడు. యిరుగు పొరుగువాళ్ళు వచ్చి పాడె కడుతుంటే అప్పుడు తెలుసుకున్నాడు

అయ్యా! పాతిపెట్టి యింటికొచ్చాడు. దానికొడు కూరికే ఏడుస్తు న్నాడు. అప్పుడు మాత్రం పెద్దిగాడు ఘోరుమన్నాడు. కాని ఎంత సేపులే! పిల్లాడు మాత్రం ఏడుపు చాలారోజులు మాననేలేదు. దాంతో కోపం వచ్చింది. తల్లి చచ్చిపోతేమాత్రం ఓరోజో రెండు రోజులో కంటె ఏడుపెందుకు?

ఆ తర్వాత ఓ సంవత్సరంపాటు కలరా ప్లేగూ పట్టుకున్నాయి. పెద్దిగాడు సగం చచ్చిబతికాడు. ఊరంతా రోగాలు రేగిపోయాయి. పెద్దిగాడి యింట్లో ఒక్కళ్ళనీ వదిలిపెట్టలేదు. మిగిలిన ఒక్క భార్యకు పిలుపు వచ్చింది. రెండు విరేచనాలతో ప్రాణం పోయింది. ఆ తర్వాత అంటువ్యాధులు ఆ ఊరిని వదిలేటప్పటికి పెళ్ళాంతోటీ పిల్లల తోటీ క్రిక్కిరిసి వుండే పెద్దిగాడియింట్లో, వాడొక్కడే భూతంలా తిరుగాడుతూ వుండేవాడు.

ఒక్కొక్కరోజు అర్ధరాత్రప్పుడు ఎవరో ఏడుస్తున్నట్లు అని పించేది. మేలుకునేవాడు. లేచేవాడు. యిల్లంతా వెతికివచ్చి, మళ్ళీ గొంగళిమీదపడి ఉండిపోయేవాడు. వాడి జీవితంలో అకస్మాత్తుగా పెద్ద వెల్తి వచ్చేసింది. అది పూడుద్దామని తంటాలు పడేవాడు.

కాని అంత సులభమా ఆ పని?

పొద్దున్నే లేచి అలాగే కూచుని వుండిపోయేవాడు. ఇప్పుడు తిట్టడానికి ఎవరూ వుండేవారుకారు. కేకలెయ్యడానికి ఎవరూ కని పించేవారు కారు. పిచ్చిపట్టిన వాడిలా చేతివేళ్ళు ఎడంగాపెట్టి, ఆ పంజా కళ్ళముందర పెట్టుకొనేవాడు. అందులో ప్రతి వేలూ ఒక్కొక్క క్రూరమయిన కథ చెప్పేది. ఏ వేళ్ళతో ఏ కుర్రాడి కణత మీద కొట్టాడో జ్ఞాపకం వచ్చేది. ఆ వేళ్ళు యింకా జిమ్ముమంటూనే వుండేవి. బొటనవేలూ, చూపుడు వేలూ, ఎన్ని చెవులు మెలేశాయో లెక్కలు చూసుకొనేవి కుర్ర వెధవలు కెవ్వుమనడం వినిపించేది. వెక్కిరిస్తూ, బూతులు తిడుతూ ఆ అయిదువేళ్ళూ అతని కళ్ళముందు తైతక్కలాడేవి. పొడుచుకుంటూ కళ్ళల్లోకి వచ్చేవి: "చూడు. చూశావా? మేం అయిదుగురం నీ పెళ్ళాలని బాదుతూ వుండేవాళ్ళం"

అంతట్లో ఏడుచుకుంటూ గిలగిల లాడుతున్న పెళ్ళాలిద్దరూ కనిపించే వారు.

పొయ్యి దగ్గిరకి వెళ్ళీవెళ్ళగానే అక్కడి దాకలూ, మూకుళ్లూ, గరిటలూ, పెనాలూ అన్ని మాట్లాడేవి. అతని మీదకి పరిగెత్తుకు వచ్చేవి. నిజంగానే అవి ఎక్కడి వక్కడేవుండి శబ్దం చెయ్యకుండానే సంగతులన్నీ ఏకరువు పెట్టేవి. అంతట్లో తన మీదకి దండెత్తు తున్నట్టు పెద్దిగాడికి కనిపించేది.

గొడ్లని కోసేపని మూలబడి పోయింది. మాంసం ముక్క లంటుకొని వున్న చర్మాల్ని యింటికి తీసుకొచ్చి ఏంచిటి చెయ్యడం? "వచ్చి యివి బాగు చెయ్యండి" అని కేకెయ్యడం, ఆ తర్వాత తెగ తిట్టడం ఎవర్ని? ఇంతకీ ఆ తోళ్ళు అమ్మి పైకం సంపాయించటం ఎవరి కడుపు నింపడానికి?

అన్నివిధాలా ఖాళీ అయిపోయిన ఆ యిల్లు జ్ఞాపకాలతో కిటకిటలాడుతూవుండేవి. అసలు ఈ బ్రతకడం ఎందుకు—అనే ఆలోచన ఇంతవరకూ ఎప్పుడూ కలగలేదు పెద్దిగాడికి. కాని ఇప్పుడీ బ్రతుకులో అర్థం లేదనిపించటం మొదలెట్టింది ... రెండేసిరోజులు తిండితినేవాడు కాదు. పేగులు ముడిపెట్టుకుంటూన్నప్పుడు లేచి, బూడిదతీసి పొయ్యి ముట్టించేవాడు. రొట్టెలకు పిండికలుపుతూ కలుపుతూ ఎంతో సేపు ఆగి పోయేవాడు. మళ్ళీ కొంతసేపటికిగాని ధ్యాసవచ్చేది కాదు. రొట్టెలు తింటూంటే "ఏమిటిదంతా? ఈ తిండితిప్పలు ఎందుకసలు? ఈ తిరగటం మాట్లాట్టం ఎందుకు?" అని ఏ పనులు చేస్తూండేవాడో ఆ పనులన్నీ నిరర్థకం అనిపించేవి. ఎక్కడికయినా వెళుతుంటే తనలో తనే గొణుక్కునేవాడు. "ఏం చేస్తున్నాను? నడుస్తున్నాను. అంటే ఏమిటి? ఒక్క అడుగు వేస్తున్నాను. సరే వేస్తున్నాను. ఆ తర్వాత? ఆ తర్వాత పాదం ముందుకు వేస్తున్నాను. గమ్మత్తుగానే వుంది. ఆఁ! అవును ఏం గమ్మత్తుగా వుంది! అసలు అక్కడే నుంచుండిపోతే ఏం?" — ఆవలించినప్పుడు "ఆఁ" అని నోరు తెరిచినవాడు "ఇదేమిటి యిలా నోరు తెరిచా నెందుకు?" అనుకునేవాడు.

పిచ్చి పట్టటానికి ఉండే సరిహద్దుల్లో చాలా రోజులు తచ్చాడాడు.

మనసు పిచ్చిపట్టేటట్టున్నా, అతనికి ఒక విషయం మాత్రం తట్టినప్పుడల్లా ఆశ్చర్యంగానే వుండేది. తన ఇల్లు ఇట్లా స్మశానమయి పోయినా తనని పలకరించడానికి ఒక్కడూ రాలేదేమిటి? ప్రతి చావుకీ వాళ్లకి కల్లుపోయించాడు మళ్ళీ చెయ్యవలసినవన్నీ చేశాడు.

ఈ ఆలోచన అతన్ని మరీకుంగదీసింది. నిజానికి అసలు అందరూ అతనితో ఎప్పటిలాగే వుండేవారు. మార్పు వచ్చిందంతా పెద్దిగాడిలోనే. ఇదివరలో లెక్కచెయ్యని విషయాలని గురించి యిప్పుడు ఆలోచించటం మొదలుపెట్టాడు. పూర్వం ఇవి ఆలోచించటానికి అతనికి తీరుబడి ఎక్కడిది? చావకొట్టటం, తెగ తిట్టటం, పని చేసుకోవటమూను. వీటితో చీకటి పడిపోయేది. ఇప్పుడు రోజంతా ఖాళీయే. అంచేత అంతదూరంలో ఎవరయినా నడిచినా అలికిడి వినవస్తూండేది. అందుకనే తనదగ్గరకి ఎవరూ రావటంలేదు ఏమిటూ అనిపించేది.

ఆఖరికి ప్రాణం విసిగి అతనే వాళ్ళ దగ్గరికి వెళ్ళడం సాగించాడు. వాళ్ళు తనతో మాట్లాడానికిరాకపోతే తనే వాళ్ళతో మాట్లాడ్డానికి వెళదామనుకున్నాడు. వాళ్ళే తనతో మాట్లాడేవారు. తన పెళ్ళాలూ, పిల్లలూ పోయినందుకు వాళ్ళెంతో విచారించారని తనకి తర్వాత తర్వాత తెలిసింది. అతను వాళ్లతో బాగా పరిచయం పెంచుకొని అనేకమార్లు మాట్లాడిన తర్వాత, "ఛ! యింత మంచివాళ్ళను గురించి నేనేమిటో చెడ్డగా అనుకున్నాను" అనిపించింది.

ఇహ యిప్పుడు అసలు చాలా సేపు యింటి బయటే వుండేవాడు. ఉన్నపని అయిపోగానే ఎవరిదగ్గరో కూచుని తమలపాకూ, పొగాకూ నమలుతూ ఊసులాడుతూ వుండేవాడు. "పెద్దిగాడు మారి పోయాడు" అన్నారు అందరూ. "కాని చాలా ఆలస్యంగా మారాడు. పెళ్ళాం పిల్లలకి సుఖపడే అదృష్టం లేకపోయింది" అన్నారు కొందరు.

అతను మారిన సంగతి మట్టుకు నిజమే. పాకుతూ, దేకుతూ వున్న పసిపిల్లలు అతని కాళ్ళకి చుట్టేసుకునేవారు. అతని బుజం ఆధారం చేసుకుని నుంచోడానికి ప్రయత్నిస్తుంటే అతనికి ఒళ్ళంతా

పులకరించేది. 'నా పిల్లల యిటువంటి కోరికలే వుండేవా? అవితీర్చ లేదు కనకనే పోతురాజు వాళ్ళని నా దగ్గరనుంచి ఎత్తుకెళ్ళిపోయాడా' అని స్ఫురించగానే అకలా వికలమయిపోయేవాడు. ఇప్పుడు యీపిల్లలని కూడా తను అలక్ష్యం చేస్తే వాళ్ళనీ ఎత్తుకుపోతాడేమో? తక్షణం వాళ్ళని ఎత్తుకునేవాడు. ముద్దు పెట్టుకునేవాడు. అందులో ఎవ రయినా ఒకడు నవ్వితే తనకు బ్రహ్మానందమయేది. ప్రపంచంలో ఒక్క క్షణం అయినా సుఖంగా వుండమని భగవంతుడు ఈ చిన్న పిల్లలని సృష్టించాడా అని ఊహ కలిగేది. పసిపిల్లలు ఈ ముసలి పెద్దిగాడి చుట్టూ మూగి ఆడుకుంటూండేవారు. మొత్తానికి పెద్దిగాడు మున పటివాడు కాడు.

## 2

ఈ రోజుల్లోనే జుమ్మన్ పెద్దిగాడి జీవితంలో ప్రవేశించింది. మిగతా ఘట్టాలనిగురించి తెలుసుకొనే సందర్భంలో, పెద్దిగాడికి జుమ్మన్ పరిచయం ఎలా కలిగిందనేది చాలా అల్పవిషయం. పరి చయం అవడమే ముఖ్యం.

పెద్దిగాడిలో వస్తూ వస్తున్న మార్పుని జుమ్మన్ వచ్చి పూర్తి చేసింది. అతను వెన్నముద్దయిపోయాడు. సెగతగిలితే కరిగిపోయే వాడు.

పెద్దిగాడు యిదివరకు మల్లేనే పని చేసుకోడానికి ఊరి బయటి కెళుతూండేవాడు. కాని యిప్పుడు ఒంటరిగా కాదు. అతని వెనకాలే జుమ్మనూ బయలుదేరేది. పెద్దిగాడు తనకి తోచిన రీతిని ఎంతో బతిమాలేవాడు: 'నా చిన్న తండ్రీ! ఎందుకురా నువు కూడా? ఎందుకొత్తున్నావ్? పొద్దు నడినెత్తి కొచ్చేవరకూ నేనాడవుండాలి. నువు పసోడివి. అంత ఎండ బరిత్తావా? నీకు ఆకలీ, దాహం లేవేంటి?' కాని జుమ్మన్ ఆ మాటలెపుడూ లెక్కపెట్టలేదు. అతను

గడపదాటాడంటే అతనివెంటే వుండేది. అపుడపుడు గారాబం చేసే వాడు. జుమ్మనుని మళ్లీ వసారాలోకి తోసేసి కోప్పడేవాడు: "ఇదుగో, నువ్వు మరీ అల్లరి చేస్తున్నావు సుమా" కాని జుమ్మన్ తన వెనకే నాలుగడుగులు వచ్చేసరికి – 'నా మాట వినవూ ? పదయితే,' అని బుజాలమీద వేసుకుని బయలుదేరేవాడు. ఊళ్లోవాళ్ళందరూ ఆ చోద్యం చూస్తూండేవారు. "పెద్దిగా ! పిల్లలున్నపుడు అళ్లని విదిలించుకునేవాడివి. ఇంకిప్పుడీ జుమ్మన్ని గారాబు చేత్తున్నా ?" అనేవారు కొంతమంది. ఒక్కొక్కపుడు ఈ మాటలు చెవుల్లో దూరి పోతూండేవి. ఒక్కొక్కప్పుడు గుండెల్లో దూరి చుర్రుమనేవి.

"అయ్యా ! అయ్యా ! జుమ్మన్నెత్తుకెళ్తుండావే మమ్మల్ని ఎందుకు తీసికెళ్లవూ ?" అని ఎప్పుడో చచ్చిపోయిన కొడుకులు ఎదురుగా పరిగెత్తుకొస్తున్నట్టు భ్రాంతి కలిగేది. ఇటువంటి వాటి వల్ల యింతవరకు తనకు మతిపోతూన్నట్టనిపించేది. ఇప్పుడు ధైర్యం కలిగించటానికి అతనికి జుమ్మను వుంది.

ఇటువంటి తలపులు వచ్చినపుడు వసారాలోవున్న జుమ్మనుని దగ్గిరకి లాక్కుని, తన బీటలువేసిన ముఖాన్ని దాని నునుపైనముక్కుకి రాస్తూండేవాడు. తక్షణం ఆ పీడ అలోచనలన్నీ మాయమయిపోయి, పెద్దిగాడు మామూలు మనిషి అయిపోయేవాడు. మొక్కజొన్న పొత్తులు ఏదిగినపుడు జుమ్మన్ని వదిలేసేవాడు. చెంగుచెంగున గెంతుతూ ఎంతోదూరం పరిగెత్తేది. పెద్దిగాడు తనపనిలో మునిగి పోయేవాడు. ఇంటికి వెళ్ళే వేళయినప్పుడు జుమ్మన్ని పిల్చేవాడు. అంత దూరంనుంచి జుమ్మన్ యెగురుకుంటూ వచ్చేది. అతని కాళ్ళకి రాసు కుంటూ నిలబడేది. దాన్ని మళ్ళీ బుజాలమీద ఎక్కించుకుని వచ్చే వాడు. తండ్రి – కొడుకులు !

జుమ్మన్ పరధ్యానంగా వున్నరోజున పెద్దిగాడు దాన్ని యింటి దగ్గిర ఒదిగబెట్టి పనిలోకి వెళ్ళిపోయేవాడు. దోవలో యెవరయినా "పెద్దిగా, అబ్బాయి ఏడిరా యియ్యాల ?" అంటే, 'మా చెడ్డఅల్లరి చేస్తున్నాడు. అంచేత యియ్యాకి యింటికాడే వుండమన్నా' అనే వాడు. 4, 5 గంటలు యెడబాటు అయిన తరవాత మళ్ళా కలుసు

కున్నప్పుడు ఒకరినొకరు గారాబం చేసుకునేవారు. జుమ్మాన్ తన ఒళ్ళంతా అతని వంటికి ఆనించేది. రాసుకునేది. జుమ్మాన్ని ఒళ్లో పెట్టుకుని రెండుదెబ్బలు వేసేవాడు ముద్దుగా. జుమ్మాన్ ఆ యింటి కొచ్చిన రోజునుంచీ పెద్దిగాడు యెప్పుడూ ఒంటరిగా అన్నం తినలేదు. రొట్టెముక్కలు విరిచి దానికి తిన్నన్ని వేసేవాడు. తర్వాత తను తినేవాడు.

జుమ్మాన్ పెద్దదయింది. గ్రహించేశక్తి వచ్చింది. కొమ్ములు మొలిచాయి. తను ఒంటరిగా తిరగటం మొదలెట్టింది. ప్రతి యింటికీ వెళ్ళేది. ఊళ్ళోపిల్లలందరికీ కాలక్షేపం. వాళ్ళకి నేస్తం అయింది. కని పించీ కనిపించగానే, "జుమ్మా నొచ్చిందిరోయ్, జుమ్మా నొచ్చింది!" అని పిల్లలంతా దానివెంట పరిగెత్తేవారు. వాళ్ళందరి మధ్యా "నన్ను ముట్టు కోకు" ఆట ఆరంభమయ్యేది. ఆక్షణంలో అది అందర్నీ చిన్నగా పొడిచేది. ఊరంతా గగ్గోలు పడిపోయేది. ఓ పక్కని పిల్లలు అరుస్తూ వుండేవారు :

"పోలీసులు తరిమితే, దొంగ పరుగులెట్టాడోయ్!
రండర్రా రండర్రా – అటూ యిటూ కమ్మండి!
ఎక్కడికెళ్తావ్ జుమ్మాన్! నువ్వా
ఎన్ని పరుగులు తీస్తేమాత్రం
వదుల్తా మనుకు వెట్టిదానా!
మా అందరికీ కావాలి నువ్వు!"

జుమ్మాన్ పరుగులు వేసేది. అటూయిటూ వంకర టింకరగా పరిగెత్తేది. అతి కష్టంమీద పిల్లలు దాన్ని కమ్ముకునేవారు. దాని మూతి కట్టేసి ఊరేగించేవారు. అల్లరి చేయకుండా ఎటు తీసికెళితే అటు వచ్చేది. వాళ్ళేంచేసినా సహించేది. పిల్లలతో కలిసి అల్లరి చేయడమంటే మహాయిష్టం దానికి.

అటువంటి సమయాల్లో కంగారు పడుతూ జుమ్మానుని వెతు క్కుంటూ వచ్చేవాడు పెద్దిగాడు. పిల్లల్ని గదమాయించేవాడు. జుమ్మానుని స్వాధీనం చేసుకునేవాడు. చెవి పట్టుకుని యింటికి తీసు

కెళ్ళేవాడు. దోవ పొడుగునా చివాట్లు తినవలసి వచ్చేది జుమ్మన్:
"నువ్వు వూరికే నాకేసి చూడకు, నువ్వసలు అట్లాటిదానివే."

జుమ్మన్ అదృష్టమే అట్లాటిది. ఎక్కడి కెళితే అక్కడ సొంత ప్రాణి అయిపోయేది. చిన్న పిల్లలు గారాబం చేసేవారు సరే. మరి పెద్దవాళ్ళూ? జుమ్మనను కనుపించగానే వాళ్లూ చిన్న పిల్లల్లా అయి పోయేవారు. పిల్లలందరూ జుమ్మన్‌ని హింస పెడుతూంటే వాళ్ళని కొప్పడుతూండేది పెద్దిగాడు ఒక్కడే కాదు. ఎవరు దగ్గరలోవుంటే వాళ్ళు దాన్ని రక్షించటానికి పరిగెత్తేవారు. ఆడవాళ్లు అడుగూ మడుగూ మిగిలిన అన్నం తెచ్చి జుమ్మన్ని పిల్చి తినిపించేవాళ్లు. ఎవళ్ళయినా వస్తువులు ఎండబెట్టుకుంటే జుమ్మన్ ధైర్యంగా వెళ్ళి మూతి పెట్టేది. ఎవరూ అదిలించేవారు కారు. నెమ్మదిగా చెవి పట్టు కొని, మెడ కౌగిలించుకొని, "రాజా, మా కూ్కడా నాలుగు గింజలు వదిలి పెట్టవూ?" అనేవారు.

చిన్న వయసులో అందరూ యిల్లా గారబం చేస్తుంటే, జుమ్మన్ బలిసింది. కళ్ళకి నిండుగా కనిపిస్తుండేది. కొమ్ములు మాంచి రంజుగా ఎదిగాయి.

హఠాత్తుగా ఓ రోజున పిచ్చిదానిలాగా అయిపోయింది. పెద్ది గాడి మాట వినబడగానే ఎక్కడి దక్కడ నిలబడిపోయే జుమ్మన్, పెద్దిగాడంటే ఎవరో తెలియని దానిలాగా అయిపోయింది. పెద్దిగాడు దాన్ని నిమిరి, దువ్వి, మామూలు ప్రకారం మూతి వాసన చూస్తు న్నాడు. బలంగా ఒక్క కుమ్ము కుమ్మింది.

రయ్యిమని ఊరిమీదికి ఉరికింది. పిల్లలు అరుచుకుంటూ వెంట బడ్డారు.

"పోలీసులు తరిమితే, దొంగ పరుగుపెట్టాడోయ్"—

ఇదేమిటి? యివ్వాళ జుమ్మన్ అవతారమే మారిపోయింది! దగ్గరకొచ్చిన పిల్లల్ని ఒక్క కుమ్ము కుమ్మి పరిగెడుతూంది. అది ఆటగా పొడవటం కాదని పిల్లలకి తక్షణమే తెలిసిపోయింది. అంతట్లో జుమ్మన్ మాలగూడెంలో దూరింది. ఆ సంగతి వినగానే అందరూ కంగారుపడ్డారు.

ఆ తరవాత ఊళ్ళోవాళ్ళూ, పెద్దిగాడూ దాని వెంటబడ్డారు. అల్లంత దూరంలో కనిపించింది జుమ్మన్. అరిచి అరిచి అలిసి పోయింది. పెద్దిగాడు జుమ్మనున్న వేపుకి వేగంగా పరిగెత్తాడు. అతని వెనకనే ఊళ్లోవాళ్లూ పరుగెత్తారు. జుమ్మన్ ముందూ, ఆ వెనక మనుషులూ చాలాసేపు పరుగుపెట్టారు. జుమ్మన్ అందరినీ బెదిరించేది. ఎవరయినా అందుబాటులోకివస్తే అమాంతం వెనకకాళ్ళమీద నుంచునేది నిలువెత్తున. తల ఓ ప్రక్కకి వంచి, కోపంగా చూస్తూ, పొడవటానికి సిద్ధంగా వుండేది. ఆ వాలకం చూసి ఒక్కళ్ళు కూడా దీన్ని చెవి పట్టుకునే ధైర్యం లేకపోయింది.

చచ్చిచెడి ఎట్లాగో జనం చుట్టుముట్టారు. ఇంతసేపూ పరిగెత్తినమీదట అలిసి ఒగరుస్తోంది జుమ్మన్. ఇంతసేపటినుంచీ ఎపుడు పడితే అపుడు రెండుకాళ్ళమీద నుంచుని పొడవడానికి ఉంకించే జుమ్మన్, మళ్ళా ఆ ప్రయత్నమే చేసింది. కాని పట్టుతప్పి, ఢభీమని కిందపడిపోయింది. ఆ మరుక్షణంలో ఉబ్బసం వాడిలాగ వగరుస్తున్న పెద్దిగాడు ఒక్క గంతులోవచ్చి దానిమీద అడ్డంగా పడుకొని, దీన స్వరంతో "జుమ్మన్! ఏమయిందిరా నీకివాళ? ఎంత కష్టపడ్డావో చూడు! యింకెప్పుడూ నిన్నెక్కడికీ వెళ్ళనివ్వనంతే!" అని మందలించాడు.

పెద్దిగాడు మళ్ళీ దాన్ని బుజంమీద వేసుకొంటూండడంచూసి, "పెద్దిగా! యిప్పుడదేమయినా, చిన్నదా, చితకదా? పిల్లిమీద రెండు తగిలించి నడపమను. ఎంత హైరాన పెట్టింది అందర్నీ!" అని ఎవరో చిరాకు పడ్డాడు.

"అట్టా అనకండిరా! పాపం అది ఎలా అయిపోయిందో చూడండి! ఇవాళ హైరానపెట్టిన మాట నిజమే. కాని యీ రోజు వరకూ ఎపుడయినా పెట్టిందిగనకనా!" అంటూ పెద్దిగాడు దాన్ని బుజంమీదికి ఎత్తుకున్నాడు. ఆ బరువు మెడలమీద పడగానే కుంగిపోయాడు. అడుగుతీసి అడుగు వెయ్యగలడా అనిపించింది. చూస్తూన్న వాళ్ళందరికీ దాన్ని మొయ్యలేక కిందపడిపోతాడు కాబోలు ననిపించింది. కాని అట్లాగే ఇంటికి చేరుకున్నాడు.

జనంకూడా పెద్దిగాడి ఇంటివరకూవచ్చారు. అసలు ఉన్నట్టుండి జుమ్మన్‌కి ఏం జబ్బు చేసిందా అనుకున్నారు. ఒళ్ళంతా పరీక్ష చేశారు. ఎక్కడా ఒక్క దెబ్బలేదు. కళ్ళుమాత్రం ఎర్రగా వున్నాయి. ఎవరోవెళ్ళి ఉల్లిపాయ తెచ్చారు. పెద్దిగాడు దాన్ని మధ్యకికోసి దాని కళ్ళమీద పెట్టి కట్టాడు. జుమ్మన్ కళ్ళల్లో నలకా పడలేదు, ఏంలేదు. కాని ఎవడికో ఉల్లిపాయ కడితేనో అనే ఆలోచన కలిగింది. ఇంకోడు పరుగెత్తికెళ్ళి తీసుకొచ్చాడు. అంతే. ఇంకోడెవరో జుమ్మన్‌కి దిష్టి తగిలిందన్నాడు. జుమ్మన్‌కి దిష్టితగిలిందన్న భావమే అందరికీ పసందుగా కనిపించింది. అంచేత ఇది దిష్టితగలడమే అన్నారు. దిష్టి కాకపోతే మరేమిటి? అదే. అసలు జుమ్మనికివున్న పుష్టీ, దాని దర్జా ఎక్కడైనా చూశామా? ఇంతట్లో ఇంకొకరి కెవరికో ఒక సంగతి స్ఫురించింది, ఆ మారిగాడి ఇంటిదగ్గరకి రెండురోజుల క్రితం జుమ్మన్ వెళ్ళిందని. అయితే వాడి దృష్టే తగిలింది. అసలు జుమ్మన్‌కి దిష్టి తగిలిందన్న విషయంలో మట్టుకు అందరికీ నిజమే ననిపించింది. పెరుగూఅన్నం వచ్చింది. పెద్దిగాడు దిష్టి తీశాడు. జుమ్మన్ మట్టుకు పెద్దిగాడికేసి వెర్రిచూపు చూస్తూ ఊరుకుంది.

ఆతరవాత కదలకుండా పడుకునివుంది. పొట్ట లోతుకిపోయింది. పెద్దిగాడు మేత వేశాడు. నీళ్ళు పట్టాడు. కొంచెంసేపటికి నిద్ర పోయింది నెమ్మదిగా.

పెద్దిగాడికిమాత్రం ఆ రాత్రి నిదరపట్టలేదు. తన పిల్లలందరూ తనని ఏకాకిని చేసేసి ఒక్కసారిగా వెళ్ళిపోయారు. పెద్దిగాడికి హఠాత్తుగా మెళుకువ వచ్చింది. లేచాడు. జుమ్మన్ దగ్గరకి వచ్చాడు. ఓసారి చేతితో దాన్ని దువ్వి మళ్ళా గొంగళిమీదికి చేరుకున్నాడు. జుమ్మన్ ప్రశాంతంగా నిద్దరపోతోంది.

తెల్లారేవరకూ అలా శాంతంగానే వుంది. తొలికోడి కూయగానే జుమ్మన్ అరవడంమొదలెట్టింది. మొన్నటిలాగే వణుకుతూన్న స్వరంతో అరుస్తోంది. ఆ స్వరం విని పెద్దిగాడు గాభరా పడిపోయాడు. పడుకొన్నవాడు ఉన్నచోటినుంచే జుమ్మనుతో మాట్లాడాడు. "జుమ్మన్! రాజా! ఎట్టావుంది నాయనా నీకు? ఎందుకురా అట్లా అరుస్తావు?

యిన్నాళ్ళు తోడుగా వున్నావు, యిప్పుడు నువుకూడా ఏగాచేస్తావా నన్ను?" కళ్ళు నిండిపోయాయి.

పెద్దిగాడు లేచి జుమ్మన్ దగ్గరకెళ్లాడు. కట్టిన తాటిని బలంగా లాగుతోంది జుమ్మన్. అరుస్తూనే వుంది. ఇరుగుపొరుగువాళ్ళు నిద్ర లేచారు. ఒకడు "పెద్దిగా! మేలుకొనే ఉన్నావా? జుమ్మాన్ అరుస్తోందిరా" అని కేకవేశాడు. పెద్దిగాడు యింట్లోంచే జవాబు చెప్పాడు: "ఎవరన్నా రండిరా ఇక్కడికి! అక్కడనుంచే అరుస్తారేం? జుమ్మన్ ఏమిటో పిచ్చి పట్టినట్లు చేస్తావుంది." వాళ్ళు వచ్చేలోపల పోనీ మూతి పట్టుకుందామని జుమ్మన్ దగ్గరకి వెళ్ళాడు. అది అమాంతం కుమ్మే పోజులో లేచినుంచుంది. ధైర్యం చేసుకుని ముందుకెళ్లాడు. ఒక్క ఉదుటున ఆ ఎదిగిన కొమ్ములు గట్టిగా పట్టుకున్నాడు. పెద్దిగాడు ఎంతో హుషారుగా కొమ్ములు పట్టుకున్నాడు గనక సరిపోయింది. ఎంచేతంటే జుమ్మనూ ఒక్కసారి తల విదిలించుకుంది బలంగా. కాని పెద్దిగాడు ఇంకా బలంగా పట్టుకుని వున్నాడు. అంచేత తన విసురుకి తనే కిందపడిపోయింది జుమ్మన్. పెద్దిగాడు దాన్ని పడిపోకుండా పట్టుకోడానికికూడా వ్యవధిలేకుండా కిందపడిపోయింది. పెద్దిగాడు ఏడుపుగొంతుకతో "చూశావా! చెపుతూంటే విన్నావా మరి? చూడు ఎలాపడ్డావో! దెబ్బ తగిలిందా?" అంటూ జుమ్మన్ని నిమురబోయాడు. కాని అంతట్లో అది లేచి మళ్ళీ కుమ్మే ప్రయత్నంలో వుంది.

ఆ తర్వాత ఇహ గారాబం చెయ్యలేదు పెద్దిగాడు. "నీ ఇష్టం వచ్చినట్టు చావు" అని తనలో గొణుక్కుంటూ గొంగళిమీద కొచ్చి పడుకున్నాడు. కాని నెమ్మది ఎక్కడుంది? జుమ్మన్ అరుస్తూనేవుంది. కొంచెంసేపయాక పెద్దిగాడికి ఒక ఆలోచన వచ్చింది. "ఒకవేళ ఆకలేసి అరుస్తోందేమో పిచ్చిముండ." చటుక్కున లేచాడు. బయటకు వెళ్ళి ఒక బుట్టనిండా పచ్చటి ఆకులు తెచ్చి ముందు పెట్టాడు. అసలు జుమ్మన్ దేన్ని కుమ్మదామా అనే ఆలోచనలో వుంది. అంచేత బుట్ట ముందుకి రాగానే ఒక్క విసురు విసిరింది. బుట్ట గాలిపటంలాగా ఎగిరిపోయింది. పెద్దిగాడు నుదుటిని చేయిపెట్టుకున్నాడు. కొంచెం

సేపాగి మళ్లాలేచాడు. బావిలోంచి శుభ్రమయిన నీళ్ళు తెచ్చి జుమ్మన్ ముందుపట్టుకున్నాడు. జుమ్మన్ అదికూడా ఒక్క దెబ్బకి ఎగరగొట్టేసేదే గాని, పెద్దిగాడు జాగ్రత్తగానే వున్నాడు. అది తల వంచీవంచగానే పెద్దిగాడు బాల్చీ యివతలకి లాగేశాడు.

ఇప్పుడు మాత్రం పెద్దిగాడికి నిరాశపట్టుకుంది. మొన్న సాయంకాలం నుంచి అన్నమే తిన లేదు తను. ఈ జుమ్మన్ తన అకలీ డప్పీ అన్నీ ఎగరగొట్టేసింది.

ఇప్పటికి తెల్లవారి పోయింది. పెద్దిగాడుబయటకి బయల్దేరాడు. కనిపించిన వాళ్ళందరూ జుమ్మన్ కులాసాగా వుందా అని అడిగేవారు. ఏడుపు ముఖం పెట్టుకుని "ఉఁహూ" అన్నట్టు తలపూపేవాడు. దానికి చేసిన నుస్తీకి ప్రతి వాడూ తలో పేరు పెట్టేవాడు. ఎవడో ఒక బుద్ధిమంతుడు "జుమ్మన్‌కి పిచ్చి పట్టిందేమో" అన్నాడు.

"ఏమిటది ? పిచ్చా ? అంటే ?"

"అంటే ఏమిటి ? పిచ్చి అంటే పిచ్చే. కుక్కకి పిచ్చిపట్టదూ ? అలాగ అట్టా అనేటప్పటికి పెద్దిగాడికి కోపం వచ్చింది. అసలు జుమ్మనికి పిచ్చి పట్టిందని వూరంతా తెలిస్తే, జనం అంతా వచ్చి దాన్ని తప్పకుండా చంపేస్తారని భయం పట్టుకుంది. "కుక్కయితే పిచ్చెత్తుతుంది కాని, మేకపోతుకి పిచ్చెక్కడం ఎక్కడయినా విన్నావా ఏఁటిటి ? ఉత్త వెఱ్ఱివాడిలా నోటికొచ్చినట్టు మాట్లాడకు"

జుమ్మన్‌కి పిచ్చెత్తలేదు. కాని పెద్దిగాడికి పిచ్చిపట్టే గడియ వచ్చిందా అని పించింది.

నలుగురయిదుగురు తెలివయిన వాళ్ళని కనుక్కున్నాడు. కాని ఎవరికీ జుమ్మన్‌కి చేసిన జబ్బుఏమిటో అర్థంకాలేదు. అప్పుడు మాత్రం పెద్దిగాడికి ఆశ నశించింది. "పోనీ, యిప్పుడు జుమ్మన్ని ఏం చెయ్యాలో చెప్పండర్రా" అని అడిగాడు. "పెద్దిగా! అసలు నువ్వు దాన్ని ఒంటరిగా వదిలేసి ఎందుకు వచ్చావు ? అదేదో అఘాయిత్యం చేసి తాడు తెంపుకోడానికి ప్రయత్నించి మెడాగిడా విరుచుకుంటుందేమో. అప్పుడు అనవసరంగా ఆపద నెత్తిమీదికి తెచ్చుకున్న వాళ్ళ మవుతాం. నువ్వు ముందు యింటికిపో."

"నా ఒక్కడికీయింటికెళ్ళడానికి భయంగావుంది. మీరెవరయినా రండి నాతో."

ఆఖరికి అయిదారుగురిని వెంటబెట్టుకుని పెద్దిగాడింటికి వచ్చాడు. జుమ్మను గింజుకోవటం, అరుపులూ అల్లాగే వున్నాయి.

"చూడండి. పొద్దున్ననుంచీ యిట్టాగే చేస్తోంది. అలా చూస్తారేం? ఏం చెయ్యాలో చెప్పండి.

"పెద్దిగా, దాన్ని విప్పి వేయరా" అన్నాడు ఓ ముసిలాడు ముందుకొచ్చి.

"విప్పేస్తే పరిగెట్టి పోతుంది. అప్పుడు?"

"పరిగెత్తనీ!"

"పరిగెత్తనీ?"

"అవునోయ్. పరిగెత్తి ఎక్కడికెళుతుందో వెళ్లనీ! అసలు దాని మనసులో ఏముందో అదయినా తెలుస్తుంది."

"అదెక్కడైనా పడి ఎముకలు విరగ్గొట్టుకుంటే?" "ఒరేయ్, మనం దాని వెనకేవుందాంరా. దాన్ని అడ్డుపెట్టొద్దంతే!"

జుమ్మన్ ఒక్కపరుగున బయలుదేరింది. యిపుడు దాన్ని అడ్డుపెట్టేవారెవరూలేరు. వెనక కొంతదూరంలో పెద్దిగాడూ మిగిలిన వాళ్లూ వెళుతున్నారు. అటూ యిటూ మళ్లుతూ జుమ్మన్ వెళ్తోంది. కొంచెం సేపయేటప్పటికి అది ఎక్కడికి వెళుతోందో అందరికీ తెలిసిపోయింది. మారిగాడి యింటికి వెళ్తోందది.

ఆ యింటికి వచ్చాక, తలకాయ ఠీవిగా ఎత్తుకుని వాకిమందలో ప్రవేశించింది. ఇపుడు జుమ్మన్ శాంతంగా వుంది. దాని పిచ్చిఅంతా పోయింది.

"ఒరేయ్ పెద్దిగా! నీ జుమ్మన్‌కి వయసొచ్చిందిరా! దానికి పెళ్లాం కావాలట! అదేరా దాని అవస్థ అంతాను. యింకేం లేదు. అర్ధమయిందా దానికి పట్టుకున్నరోగం ఏమిటో?"

# 3

జుమ్మన్ మారెన్నగాడి యింట్లోనే వుండిపోయింది. పెద్దిగాడు ప్రతిరోజూ మారెన్న యింటికి వెళ్ళి, జుమ్మన్ని కళ్ళారా తృప్తిగా చాలా సేపు చూసి, దిగాలుమంటూ ముఖం వేలవేసుకుని ఇంటికి తిరిగి వస్తుండేవాడు జుమ్మన్ని ఇంటికి తీసుకు రావడానికి చేసిన ప్రయత్నాల్లో ఏ ఒక్కటీ ఫలించలేదు.

ఒకసారి బలం వుపయోగించి జుమ్మనుని యింటికి తెచ్చాడు. పిల్లలందరూ 'జుమ్మ నొచ్చింది, జుమ్మ నొచ్చింది' అని తందనాలాడారు. జుమ్మన్ వచ్చేటప్పుడు నెమ్మదిగానే వుంది. జనం అంతా యిప్పుడు ప్రశాంతంగావున్న జుమ్మనుని చూడ్డాని కొచ్చారు. పెద్దిగాడికి, ఒక గండంతప్పి బయటపడ్డాం అనిపించింది. నాలుగు రోజులైనా జుమ్మన్ నెమ్మదిగానే వుంది. అంచేత జుమ్మన్‌కి పట్టుకొన్న రోగం వదిలిపోయిందన్న ధైర్యం వచ్చింది. పెద్దిగాడు నిర్విచారంగా జుమ్మన్‌ని తాడువిప్పివిడిచిపెట్టాడు. అదితిన్నగా కొత్తయింటికి వెళ్ళింది. పెద్దిగాడు నెత్తి బాదుకున్నాడు. తనలో తనే గొణుక్కున్నాడు. 'జుమ్మన్, యింత కృతఘ్నత న్యాయమా నీకు? రెణ్ణెల్ల పిల్లవై ఉండగా కత్తికుందినుంచి తప్పించాను నిన్ను. అప్పుడు నిన్నుచూస్తే జాలివేసింది. లేకపోయినా ఇంకా రెండేళ్ళు నిన్ను పెంచి, ఎప్పుడు తెగేద్దామనే చూస్తుండేవాడు. అప్పుడు జాలి పుట్టించావు. కాని యిప్పుడు కొమ్ములు మొలిచాయేం నీకు? పెళ్ళాంమీద మకీ యింత పిచ్చి వ్యామోహమా? నిన్ను బతికించి, పెంచి, కన్నకొడుకులా పెంచి, నోటి దగ్గరది నీకు పెట్టి పెంచినవాణ్ణి విడిచిపెట్టి వెళ్ళిపోతావూ, కేవలం ఒక పెళ్లాం కావాలని? ఇప్పుడు నాకి వయసు వచ్చాక ఎవర్ని చూసుకు బతకమన్నావు? నా పిల్లలందరూ చచ్చిపోయారా! నే చేసుకున్న కర్మంకొద్దీ పోయారని ఒప్పుకుంటాను! కాని నువ్వు పారిపోవడానికి ఏం పాపకర్మం చేశాను? నిన్ను ఎపుడయినా నిర్లక్ష్యం చేశానా? చెప్పు.'

పెద్దిగాడికి అన్నం సయించలేదు. నిద్ర పట్టలేదు. ఎదురుగా జుమ్మన్ స్వరూపం కనిపిస్తూండేది. "ఈ అల్లరిముండ ఆ మారెన్న దోడ్లో చేరింది. ఇంక ఇది బతికి బయటికెలా వస్తుంది?" అనే భీతి పట్టుకుంది. అసలు ఆ మారెన్నవి తను ఎప్పట్నుంచో ఎరుగును. పచ్చి కసాయివాడు. నిత్యం అదే వృత్తి. కత్తి పుచ్చుకుని నరికితేనే కసాయి వాడవాలా? పెద్దిగాడికి అసలు ఆ మారన్న వృత్తే వింతగా కనిపించేది! మేకలని పెంచటం, జాగ్రత్తగా పుష్టిగా పెంచటం, ఆ తరవాత కసాయివాడికి అమ్మెయ్యటం. ఏమిటీ అడవిమనిషి తత్వం? మారెన్న మళ్ళీ మోతుబరిమనిషే. కాని వాడి పొలాలు, బంగాళాఅంత యిల్లూ ఆ ఆస్తి అంతా మేకరక్తంతో సంపాయించి నవే. మిగిలినవాళ్ళకి మాత్రం డబ్బు సంపాయించుకోవడం తెలి యమూ? నాలుగు మేకల్ని పెంచడం ఆరంభిస్తే యిట్టే మందయి పోతుంది ఒక ఏడాదిలో. కాని అట్టాంటి రాక్షససంపాదన ఎవడి క్కావాలి? మారెన్న పేరెత్తితే యిలాంటి ఆలోచనలే వచ్చేవి పెద్దిగాడికి. అంచేత, ఎప్పుడయినా దోవలో మారెన్న యెదురు పడితే, అతని ముఖంవేపు చూడకండా తప్పించుకుంటూండేవాడు పెద్దిగాడు.

ఇప్పు డసలు మతిపోయేలాగ అయిపోయింది. ఇన్నాళ్ళూ ఊళ్ళోవాళ్ళ మాటసహాయమయినా వుండేది. ఇప్పుడు వాళ్ళ ఆధారం కూడా ఏమీ వుండేటట్లు కనిపించలేదు. అయినా పరాయివాళ్ళు ఎన్నాళ్ళని గారాబంచేస్తారు? వాళ్ళు జుమ్మన్‌సంగతి క్రమంగా మరిచే పోతున్నారు. "ఎందుకూ, ఇంతా దాన్నిగురించే బెంగపెట్టుకుంటావు? దాని పని శుభ్రంగా నిత్యకల్యాణం పచ్చతోరణంగా వుంది. దాని రోగ మేమిటో తెలిసిపోయింది. ఔషధం అదే కనిపెట్టింది. ఇప్పుడు కులాసాగా వుంది." జనానికి దానిమీద మోజు పోయింది. అంచేత పెద్దిగాడు అంత వెట్టి ఆపేక్ష పెట్టుకోవడం వాళ్ళకి విచిత్రంగా కనిపించింది. అంచేత, అతను యెదటబడితేనే వాళ్ళకి గుండె గుభేలు మనేది. అతను దీనంగా, "జుమ్మను యింకా యెన్నాళ్లు యిలాగే వుంటుందంటారు?" అని అడిగితే, ఎవడో ఒక దురుసుమనిషి "అది

చచ్చేవరకూ యింకంతే !' అనేవాడు. పెద్దిగాడు నోరు తెరుచుకొని, నిర్ఘాంతపోయి, తెప్పరిల్లి 'అదేఁవిటి అట్టా అంటావు? చావులు చాలా చూశాను. చాలొచ్చింది వాటితో నాకు. కావలిస్తే నన్ను చంపెయ్యి' అని బతిమాలేవాడు.

పెద్దిగాడు ఇలా అంటూంటే ఆదురుసుమనిషికి మనసు చివుక్కుమనేది. వాడి సంసారం ఎలా చితికి పోయిందో జ్ఞాపకం వచ్చేది. ఎంతో సముదాయింపుగా 'పెద్దిగా! జుమ్మన్ మళ్ళీ వచ్చేస్తుందిలే. యింతకీ ఏం పెద్ద ఏళ్ళా పూళ్ళా అయింది గనక. నీకన్నిటికీ తొందరే అసలు!' అని ఊరడించేవారు.

'కాని రావటం లేదోయ్ అది. అక్కడి కెళితే మనవేపయినా చూడ్డంలేదు. బొత్తిగా పిచ్చెత్తిపోయింది. ఆడదయినా, సారాఅయినా రెండూ ఇట్టాంటివే. రుచిమరిగిఁది ఇంకెందుకు వస్తుంది?'

ఇహమీాట ఎలా నచ్చచెప్పటం? ఆ చేనులో గొడ్లుపడ్డట్టున్నాయి అని వంకపెట్టుకుని వెళ్ళిపోయేవాడు.

పెద్దిగాడు ఇంటికొచ్చేవాడు. శూన్యంగా వున్న ఇంట్లో మళ్ళీ ఒక్కడూ సంచరిస్తూండేవాడు. పనిపాటల మీాదిక మనసు పోయేదే కాదు. దానికితోడు ఓసారి ఆ మూరెన్నతో పోట్లాటకూడా వచ్చింది. పెద్దిగాడు అప్పులాడిలాగా వేళాపాళా లేకుండా మూరెన్న యింటికి వెళ్తూండేవాడు. కొన్ని జీవాలను కసాయివాడికి తోలితే, వాటి వెనక పరిగెత్తేవాడు. జుమ్మన్ దగ్గిరకెళ్ళి దాన్ని దువ్వుతూ కూచునేవాడు. జుమ్మన్ మందలోపలి కెడితే మందంతా అలిసిపోయేది. చిద్రవంద్ర అయిపోయేది. అంచేత కాపలావాడికి కోపం వచ్చేది. పెద్దిగాడ్ని నాలుగు తిట్టేవాడు. పెద్దిగాడు వాణ్ణి బతిమాలేవాడు. గడ్డం పట్టుకొనేవాడు. అట్లాగే జరిగిపోతూండేది. ఓ రోజున పెద్దిగాడికీ, కాపలావాడికీ పెద్ద తగాదా అయింది. జుమ్మను గారాబం అంతా పెద్దిగాడి ఇంట్లో. కాపలావాడికేం లెక్క! చివరకి మూరెన్న వరకు వెళ్ళింది ఈ తగాదా. 'నువ్వు మళ్ళీ మా యింటి ఛాయలకి రావద్దు' అని గదమాయించాడు.

'నా జుమ్మను నా కిచ్చెయ్. ఇంక మళ్లా రాను.'

"ఇచ్చెయ్యడానికి ఎవరు తీసుకున్నారోయ్? ఇట్టాటి పాతిక జుమ్మనులు పడేదుస్తున్నాయి నా దగ్గర."

"నువ్వే తీసుకున్నావు నా జుమ్మన్ని."

"నేను తీసుకున్నానా? నువు నోటితోటే మాట్టాడుతున్నావా? నాకేం కర్మం వచ్చింది నీముష్టి జుమ్మన్ని తీసుకోడానికి?"

పెద్దిగాడు దీనంగా నుంచునిపోయాడు. తన నోట ఏదోమాట జారిందని తోచిం దతనికి. కొంచెం సేపయాక, "రెండు రోజుల్లోపల నా జుమ్మన్ని నువ్వు తీసికెళితే సరేసరి. లేకపోతే, పోషించిన వాడి కుండే హక్కు ప్రకారం అది నాకు సొంతమైపోతుంది. ఆ తర్వాత కనక నువ్విలా వచ్చావంటే కాళ్లు విరగ్గొడతాను! జ్ఞాపకంఉంచుకో! అదుగోవచ్చింది. తీసుకెళ్ళు. నెత్తినెక్కించుకో!" అన్నాడు మారెన్న.

పెద్దిగాడు దాంతో చాలా సేపు కుస్తీ పట్టాడు. కాని, అది వస్తేగా? చివరకి దాన్ని ఎత్తుకోవాలని ప్రయత్నించాడు. కాని దాన్ని ఎత్తడంఎట్లా? తనేమో చిక్కిపోయాడు. అదేమో బలిసివుంది. కాని ఉన్న శక్తంతా వుపయోగించి ఎట్లాగయితేనేం ఎత్తాడు. దాని పొట్ట మెడలమీద వేసుకుని, కాళ్లు గట్టిగా పట్టుకొని నడవాలని ప్రయత్నం చేశాడు. కాని అదంత సులభమా? అతని కాళ్లు వణుకుతున్నాయి భయంతో. యివ్వాళ గనక జమ్మనునితీసుకెళ్ళ లేకపోతే, యిహ అది తనకి దక్కనే దక్కదు. ఈ ఆలోచనతో అతనికి ఒళ్ళు, మనసు కూడా నీరసించిపోయాయి. జుమ్మన్ అరుస్తూంది. పెద్దిగాడు తను ఏడుస్తూ దాన్ని సముదాయిస్తున్నాడు. "జుమ్మన్! అరవకురా! నాకాళ్ళు దడగా వున్నాయి."

పది అడుగులు వేసేటప్పటికి జుమ్మను భారం మొయ్యలేకపోయాడు. అంచేత దాన్తోసహా క్రిందపడిపోయాడు. క్షణంలో ఒక్క గంతువేసి జుమ్మన్ పరుగు లంకించుకుంది. "జుమ్మన్! జుమ్మన్! జుమ్మన్!" అంటూ కేకలుపెట్టాడు. కాని వినిపించుకోటానికి పెళ్ళాం పిచ్చి పట్టుకున్న జుమ్మన్ ఆ చుట్టుపక్కల వుంటేగా?

పెద్దిగాడు లేచి కూచున్నాడు. మోకాలు కొట్టుకుపోయి

రక్తం కారుతోంది. దానికింత దుమ్ముకుక్కి, మారెన్న యింటివేపు వెళ్ళాడు.

ముంగిట్లో బోలెడన్ని మేకలు కట్టేసి వున్నాయి. ఓ చివర నుంచుని వుంది జుమ్మన్. పెద్దిగాడు దగ్గరకెళ్ళాడు. జుమ్మనుకి ఎక్కడయినా దెబ్బ తగిలిందేమోనని చూస్తూ వెన్నుమీద చేయివేసి నిమిరాడు. మారెన్న యింట్లోంచి రావడంకోసం ఎదురుచూస్తున్నాడు.

కొంతసేపటికి మారెన్న అటు వచ్చాడు. పెద్దిగాడి వాలకం చూసి నవ్వాపుకోలేకపోయాడు. "పెద్దిగా! నీకేమయినా పిచ్చి పట్టిందా ఏంఠి?" 'ఇంకా పట్టలే. కాని, ఎన్నో నాళ్ళు అక్కర్లేదింక. నువ్విందాక అన్నమాట ఏమిటి? నీకు ఎల్లుండి వరకూ వుందిగా వాయిదా?"

"ఓ! ఎల్లుండే తీసుకెళ్ళు. కావలిస్తే యింకో రెండ్రోజులాగి తీసుకెళ్లు. నాకు నీ ప్రాణి అవసరంలేదు. కాని ప్రతిరోజూ నీతో బాధ సహించలేకుండా వున్నాను. అంచేత తీసుకెళ్ళమన్నానుగాని, లేకపోతే నాకేం? 40 రూపాయలతోపాటే అదీని. నీది నువ్వు మహరాజులాగ తీసుకెళ్ళు. 4 రోజులు గడువిస్తాను. కావలిస్తే ఎనిమిది రోజులిస్తాను. సరేనా? యిహ ఆ తర్వాత మాత్రం నువ్వేం చెప్పినా వినను."

పెద్దిగాడికి కృతజ్ఞతతో గుండె నిండి పోయింది. ఈ మారెన్న యింత మెత్తటి వాడని తనెప్పుడూ అనుకోలేదు. ఎనిమిది రోజుల గడువే! ఫరవాలేదు. అవసరమయితే దాన్ని నోరు బిగించి తీసుకుపోవచ్చు– అని ఆలోచించుకుంటూ అక్కడి నుంచి బయలు దేరాడు.

కాని —

# 4

తొమ్మిదో రోజున జుమ్మన్ మారెన్నకు సొంతమయిపోయింది.

ఈ విషాదవార్త, అడివికి నిప్పంటుకున్నట్లు, అరక్షణంలో ఊరంతా పాకిపోయింది.

అసలు జుమ్మన్ మొట్టమొదట మారెన్న మందలో దూరి నప్పుడే, చివరకి యింతే జరుగుతుందని అందరూ అనుకున్నారు. ఎప్పుడో యిలా పరిణమిస్తుందని అనుకున్న ఘటన సంభవించిందని కర్ణాకర్ణిగా వినగానే మాత్రం అందరికీ కంగారు పుట్టింది. చాటు మాటున గుసగుసలు ప్రారంభ మయాయి. ఒకడికి సందేహం కలిగింది. "అసలు ఈ వార్త నిజమేనా? ఉత్తిత్తినే కాకికూతమి చావుకి నెత్తీ నోరు బాదుకోవటం నాకు గిట్టదు" అన్నాడు. కాని ఈ విషయం హాస్యంగా మాట్లాడ్డానికి ప్రయత్నించడం ఎవరికీ నచ్చలేదు. కాని యింతకీ ఆ సందేహ నివృత్తి చేసుకునేందుకు పెద్దల దగ్గరకి వెళ్ళారు. అది నిజమయిన వార్తే!

అయితే యిప్పుడీ సంగతి పెద్దిగాడికి చెప్పడం ఎలాగ? అందరూ ఆలోచిస్తూ కూచున్నారు. ఇది వినీ వినగానే వాడు గొల్లుమంటాడే! కాస్త త్వరత్వరగా ఏదయినా ప్రయత్నంచేస్తే ఒకవేళ జుమ్మన్ని ఆపదనుంచి కాపాడ్డం సాధ్యపడ వచ్చునేమో?

నలుగురు పెద్దలూ ఒకచోట కలుసుకుని, పెద్దిగాడి యింటికి బయలుదేరారు.

పెద్దిగాడు గోనెగళిమీద పడుకుని వున్నాడు. జుమ్మన్ మారెన్న దగ్గర కెళ్ళిన రోజునుంచీ పెద్దిగాడు చిక్కిపోతూనే వచ్చాడు. రోజు రోజంతా అలా పడుకుని పొర్లుతూ వుండేవాడు. ఎప్పుడయినా లేచే వాడు. ఎప్పుడయినా కాస్త తినేవాడు. పట్టినప్పుడు నిద్రపోయేవాడు. అట్లాగే రోజులు గడిచి పోతున్నాయి. ఇంట్లో ఓ దోసెడు జొన్న పిండి వుంటుందేమో మహావుంటే.

ఊరి పెద్దల్ని అంతదూరంలో రావడంగా చూశాడు పెద్దిగాడు. వాళ్ళంతా తన యింటివేపే మళ్ళినపుడు ఆశ్చర్యం వేసింది. జుమ్మన్ వెళ్ళినప్పటినుంచీ తన యింటివేపుకి ఒకళ్ళా మళ్ళలేదు—జుమ్మన్ వున్న రోజుల్లో!

అసలు ఆ రోజులు జ్ఞాపకం వస్తే అమితమయిన దుఃఖం వచ్చేది. ఈ క్షణంలోకూడా ఆ ఆలోచనలతోనే వున్నాడు. జుమ్మన్ వున్నప్పుడు యిల్లంతా కళకళ లాడుతూ వుండేది. పొద్దున్న, సాయంత్రమూ పిల్ల

లంతా వచ్చేవారు. జుమ్మనుని నానాహింసలు పెట్టేవారు. అదీ వాళ్ళని హింసపెట్టేది. అపుడు జుమ్మన్ని కోప్పడేవాడు తను. పిల్లల్ని సముదాయించేవాడు. "అది యింకా చిన్నది గదరా మరి. అందుకని అల్లరిచేస్తోంది యిలా. నేను దాన్ని కోప్పడతాలెండి. తీసికెళ్ళి ఎండలో కట్టేస్తాను. అల్లరిముండ!"

పిల్లలు అడ్డువచ్చేవారు. "వద్దులే వద్దు! మమ్మల్నది హింస పెట్టినా మాకష్టం లేదు. మేం దాన్ని హింసపెడతాం కావలిస్తే! అంతేగాని, మా మధ్య నువ్వు యేం కలగచేసుకోకు."

ఎవరయినా పెద్దమనుషులు తన యింటిముందునుంచి వెళ్ళినప్పుడల్లా తనని పలకరించేవారు "ఏం పెద్దిగా! జుమ్మ నేమంటోంది? కోపంతో వుందా? లేక కొంపతియ్యటానికి ఊరిమీాద బయల్దేరిందా?"

పెద్దిగాడు "దానిసంగతి ఏమీా అడక్కండి బాబూ! మహ ఏడిపించేస్తోంది నన్ను" అనేవాడు గారాబంగా.

"మరీ గారాబుచేస్తున్నావులే! రెండుఉతుకు."

పొద్దున్నించి సాయంకాలంవరకూ యిలా సందడిగానే వుండేది. ఇప్పుడు ఒక్కడూ రావటంలేదు. ఆ జుమ్మను రామాయణం మొదలెడతాడేమోనని అందరూ ముఖం తప్పిస్తున్నారు పెద్దిగాణ్ణిచూస్తే. తను దాన్ని యెలా పెంచాడో! అది ఏమేమి అల్లర్లు చేసేదో! కాని ఇప్పుడు! అని కన్నీళ్ళు పెట్టుకోవడం చూస్తూంటే, ఊరివాళ్ళకి బాధగావుండేది. చిన్నపిల్లల దగ్గిరకూడా యీా వూసులే చెబుతుండేవాడు. ప్రతిరోజూ యెలా ఊరడించడం పెద్దిగాణ్ణి? అయినా ఊరడించడానికి ఉపయోగపడే మాటలు మాత్రం ఎన్నివున్నాయి మహా! ఒకటి రెండుసార్లు ఊరడించాక అటుప్రక్కకే వచ్చేవారుకాదు జనం.

ఇప్పుడింటికి పాడెట్టిన కళ ఏర్పడింది. పెద్దిగాడి జీవితంలో ఇంటికి యీా కళ రావడం యిది రెండోసారి. మొదటిసారి వాడి కంత అనుభవంలేదు. ఆ రోజుల్లో అసలు ఏంజరిగిందో అర్థం చేసుకోటానికే చాలా రోజులు పట్టిందతనికి. పైగా అప్పుడు దార్ఢ్యం కూడ బాగుండేది. ఇప్పటి ఆపత్తు వస్తుందేమో అని చాలా రోజులనుంచి భయం

భయంగా వుంటుండేది. ఇహ యిప్పుడు నిజంగానే అముప్పు నెత్తిన పడేటప్పటికి, తను సహం చచ్చి వున్నాడు.

అటువంటి పరిస్థితుల్లో నలుగురు పెద్దలు తనయింటికి వస్తున్నా రంటే, కొంత సంతోషమే కలిగింది. ఒక్క క్షణం ఏవేవో మంచి మంచి ఆలోచనలు బుర్రలో పరుగెత్తాయి, వాళ్లు జుమ్మన్ విషయంలో ఏదో మంచి వర్తమానం తెస్తున్నారని. ఎంచేతంటే యింతవరకు అన్నీ అప నవ్యమయిన వార్తలేవచ్చాయి ఇకనైనా ? ఏమో ఎవరికి తెలుసు ?

కాని ఆ పెద్దల ముఖాలు కనపడే వరకే పెద్దిగాడి ఆలోచనలు ఈ ధోరణిలో నడిచాయి. వాళ్ళ ముఖాలు వెళ్ళాడేసుకు రావడం చూశాక పెద్దిగాడికి గుండె గతుక్కుమంది.

పెద్దలువచ్చి వాడికి దగ్గరగా కూచుని కుశలప్రశ్నలు ఆరంభిం చారు : 'పెద్దిగా ! నీకు ఒంట్లో ఎట్లా వుంటూదేం ?' పెద్దిగాడు ఏమీ జవాబు చెప్పలేదు. 'మాట్లాడవేం ? ఉఁ' అన్నారు.

వాళ్ళ వాలకాలనిబట్టీ, వాళ్ళ మాటల స్వరాల్నిబట్టీ పెద్దిగాడికి కాస్సేపటినుంచీ అనుమానంగానే వుంది. 'ఇదుగో బాబులూ ! ఏదో చెడ్డవార్త చెప్పాలిసి వుంటే అది ఏఁవిటో తొందరగా చెప్పే యండి ! అసలు మీ ముఖాల్లో లక్షణాలు నాకే బాగున్నట్లు కనిపించటుంలేదు' అన్నాడు విసుగ్గా.

'జుమ్మన్ ఎక్కడుందీ ?'

'జుమ్మనా ? చచ్చిపోయింది. మీకింకా తెలియదూ ? అంటే మా రెన్నదగ్గరుంది అంటే నా వరకూ అది చచ్చిపోయినట్టే. రెండ్రోజు లయిందప్పుడే.'

'అది యిప్పుడింక నిజంగానే చచ్చిపోతుంది. తొందర్లో ఏమ యినా ప్రయత్నిస్తే బతుకుతుంది.'

'మ... మ...మ... మరి... ప్రప్రప్ర...' పెద్దిగాడెంత ప్రయ త్నించినా నోట్లోంచి మాట ఊడిపడలేదు.

'పెద్దిగా! ఎందుకు అంత కంగారుపడతావు ? జుమ్మన్ బతికే వుంది. చచ్చిపోలేదు.'

పెద్దిగాడు పిచ్చివాడిలాగ వాళ్ళకేసి అలాగే చూస్తూ వుండి పోయాడు. కుడిచేతి పంజావిప్పి నుదుటికేసి కొట్టుకున్నాడు. "జుమ్మన్, దాని ఖర్మ అది అనుభవిస్తోంది. అసలు మనల్నిదుఃఖపెట్టడానికే" అని ఏదో అనాలనుకున్నాడు. కాని పైకిమాత్రం ఏం పలకలేదు. అసలు మాటే రాలేదు. వచ్చినవాళ్ళు వాణ్ణి ఊరడించటం ప్రారంభించారు. మొదట్లో ఏదయినా మామూలు విషయాలు మాట్లాడ్డం మొదలుపెట్టి, ఆపైన జుమ్మన్ ప్రసంగం తెస్తే, పెద్దిగాడికి ఎక్కువ భయం పుట్టదు అనుకొని వచ్చారు. అంచేత ఒట్లో ఎలా వుంవన్నారు. కాని ఏం లాభం? యిప్పుడు ఏం మాట్లాడాలో వాళ్ళకు అర్థంకాలేదు. ఇంతకీ యిపుడు జుమ్మన్‌కి వచ్చిన ఆపద అంత తప్పించటానికి శక్యం కానిది ఏంకాదు. దానికి చావు దగ్గరపడుతోందన్నమాట నిజమే. కాని అది ఎప్పటికయినా తప్పేదికాదుగా! కాని యిప్పుడు ఆ సంగతే అలా అంటే, ఈ పెద్దిగాడు స్మారకం తప్పి పడిపోతేనో! అసలు యిప్పటి పరిస్థితులు చూస్తుంటే ఒక్క సంగతిమాత్రం ఖాయం అనిపించింది వాళ్ళకు. అది రేపే సంభవించినా, నాలుగేళ్ళయిన తర్వాతే అయినా, జుమ్మనూ పెద్దిగాడూ యిద్దరూ ఒకసారే స్మశానానికి వెళతారు.

"పెద్దిగా! జుమ్మన్ చచ్చిపోలేదోయ్! కాని నువ్వూరికే ఇలా దానిపేరుమీద శోకన్నాలు పెడుతూ కూచుంటే మాత్రం అది తప్పకుండా చచ్చిపోతుంది. అంచేత ఈ గడువు వుపయోగించుకో. చొక్కా వేసుకొని బయల్దేరు.

"మారెన్న దగ్గరకేనా ?"

"ఎక్కడికయితే నీ కెందుకు? ముందు బయల్దేరు."

"కాని నేనొకణ్ణి వెళ్ళే మాత్రం –"

"ఒక్కడివీ కాదు. మేమూ వస్తాం నీతో."

"కాని జుమ్మన్ నాతో వస్తుందా ?"

"దాని బాబులా వస్తుంది! పదమంటుంటే."

"ఎందుకట్టా కోప్పడతారు? దానికి పెళ్ళాం పిచ్చి పట్టుకుంది. అంచేత వస్తుందా అన్నాను."

"ఈ పెళ్ళాం పిచ్చి ఇక్కడున్నకాస్సేపూను. కసాయివాడి దగ్గర ఈ వేషాలు ఏం సాగుతాయి?"

"అయితే?"

"ఊరికే వాదిస్తూకూచుంటే ఏం లాభం? నువ్వు బయల్దేరు. అంతే! లేకపోతే నువ్వూ, నీ జుమ్మనూ ఇష్టంవచ్చినట్లు ఏడవండి. దాన్తోపాటే నువ్వూ చావు!"

"అయ్యయ్యో! ఆ మాట అనకండి."

"లేకపోతే ఏమిటిమరి? లేనిపోని పీడపట్టుకుందేమిటి మనల్ని? ఈ జుమ్మన్ రాకముందే హాయిగా వుండేది."

"అయినా ఇప్పుడు మీకూ దాన్ని విడిచిపెట్ట బుద్ధెయ్యటం లేదుగా," అన్నాడు చొక్కా తొడుక్కుంటూ.

"అదే వచ్చిన చిక్కు. తయారయావా? డబ్బు తీసుకున్నావా చేతిలో?"

"డబ్బు కావాలా?"

"మరి? నీ ఏడుపు విని కరిగిపోయేవాళ్ళు ఈ ఊళ్ళోవాళ్ళు మట్టుకే అక్కడ నువ్వు ఎంత ఏడ్చినా ఎవరూ పట్టించుకోరు. అంచేత పైకం చేతపట్టుకుని బయల్దేరు."

"ఎంత?"

"పది రూపాయలన్నా కావాలి."

"పదా...?" అంటూ పెద్దిగాడు చతికిలపడిపోయాడు.

"ఎంత ఉందేం?"

"రెండు రెండున్నరుంటుందేమో మహావుంటే."

"ఏంటీ? రెండున్నలుంటాయా? ఏలుత్తూకూచో అయితే. ఎక్కడో దరిద్రనామసంవత్సరంలో పుట్టాడు కాబోలు."

నెత్తిన చేతులుపెట్టుకుని పెద్దిగాడు కూచునే ఉండిపోయాడు.

"వస్తున్నావా?"

"కాని, పైకం కావాలిగా. ఎక్కడనుంచితెచ్చేది అంతమొత్తం? మీ రెళ్ళండి..."

"ఏమిటి మీ రెళ్ళండి? చచ్చిపోతుం దది."

'చావనీ!...'

'చావనీ? ఏంవిటీ? జుమ్మన్ని చావనీయా?'

'చావనీ అనకపోతే, ఏమన మన్నారు? ఈ దరిద్రుడిదగ్గర చేరటం ఎందుకూ అది? దాన్ని అక్కడే చావనీ. నే నిక్కడ చస్తాను. నా చర్మం ఏమీ పనికిరాదుగా?'

'బాగుంది! మనిషితోలు ఎవడిక్కావాలోయి? ఏం బలంవుంది దాంట్లో? పైగా గోకుడు మచ్చల డాగులూ అదీను!'

ఆ తరవాత పెద్దిగా డింకేమీ మాట్లాడలేదు. వచ్చిన పెద్దలు లేచి వెళ్ళిపోయారు. పెద్దిగాడు ఆలోచిస్తూ అలాగే వుండిపోయాడు.

జుమ్మనుని ఓ నలుగురు పట్టుకొని బరబరా లాక్కెళు తున్నారు. దానికి గట్టిగా ఒక డెక్క భూమిమీద ఆనించటానికికూడా వీలులేకుండా లాక్కెళుతున్నారు. మధ్యమధ్య అది అతి దీనమయిన కళ్ళతో పెద్దిగాడివేపు చూస్తోంది. అతనికి గుండెనీరయిపోతోంది. 'నే నింకెప్పుడూ అలా చెయ్యను. తప్పే చేశాను. నన్ను మళ్ళీ తీసి కెళ్ళు. నన్ను నువ్వు తీసుకెళ్ళు. వాళ్ళు నన్ను నరికేస్తారు. నన్ను తీసికెళ్ళు-' అంటోంది తనతో.

పెద్దిగాడు గబగబా జేబులన్నీ వెతుక్కున్నాడు. డబ్బులేదు. 'నన్ను తీసికెళ్ళు' అన్న వాక్యం అట్టా హీనమయి చీకట్లో కలిసి పోయింది. అంతట్లో 'బాం...'

జుమ్మను జీవితానికి అదే ఆఖరు 'బాం... ...' ఇహ ఆ తర్వాత ఎవళ్ళెవళ్ళవో గొంతుకలూ, తూకపు రాళ్ళ చప్పుడూను.

తన మనస్సుకి ఈ దృశ్యాలు కనిపించే టప్పటికి పెద్దిగాడు ఉన్నవాడున్నట్టు గొంగళీమీద పడిపోయాడు.

అట్లా చాలాసేపు పడి వుండిపోయాడు. జుమ్మను గొంతుక అతి దీనంగా అతనికింకా వినిపిస్తూనే వుంది.

ఓ గంట సేపయాక యిందాకటి పెద్దలందరూ మళ్ళీ వచ్చారు. వాళ్ళల్లో ఒకడు కసురుతూన్న స్వరంతో 'లే పెద్దిగా! నడు పోదాం!' అన్నాడు.

'ఎక్కడికి?' అంటూ అదుర్దాగా అడిగాడు పెద్దిగాడు.

"ఏమిటి నీ వెఱ్ఱి ప్రశ్నలు? లే పద"

"పైకమో?"

"ఏర్పాటు చేశాం."

"ఏ ధర్మాత్ము డిచ్చాడు?"

"ఊరంతాను. ఇంటింటికీ వెళ్లి ముష్టెత్తి పావలాలూ, అర్థలూ పోగుచేశాం. నీ జమ్మన్ ఒక పీడయిపోయింది!"

"అయినా అది కావాలి మీకు!"

"అందుకే పీడ అంటున్నాం. అది వదలదు. మాక్కూడా ఈ వెఱ్ఱి వ్యామోహం పుట్టించింది."

పెద్దిగాడు యింకా లేవలేదు. అసలు ఆ ప్రయత్నంలోనే లేడు. కదలకుండా అలాగే కూచున్నాడు. ఆఖరికి ఒకతను "ఇంకా ఏమిటి ఆలోచిస్తున్నావు?"

"అవును. ఈ అప్పు ఎల్లా తీర్చుకోగలను నేను? తిండికే చాలీ చాలకుండా వుంటోంది. వంట్లో దారుఢ్యం వుండటంలేదు. పని చేయ లేకుండా వున్నాను."

"ఈ పైకం తిరిగి యివ్వక్కర్లేదు."

"మరి అయితే—" ఇంక ఆ పైన ఏమయినా అంటే ఆ వచ్చిన పెద్దలు ఏమనుకుంటారో అని భయంపట్టుకుంది పెద్దిగాడికి.

"ఇంకా, 'మరి అయితే' అంటావేమిటి? నీకోసం మేం చచ్చేట్లు తిరిగి వసూళ్ళు చేస్తే, నువ్వింకా ఏమిటో అల్లుడులాగా 'అయితే, మరి' అంటూ కూచున్నావేమిటి?"

"అది కాదు. మీరు కోపం తెచ్చుకోకుంటే, ఒక్క సంగతడుగుతాను."

"ఏమడగక్కర్లేదు. మేం వెళ్ళిపోతున్నాం లే," అని లేచి నిలుచున్నారందరూ.

అతిగాభరాగా లేచిమంచుని, "బాబూ బాబూ! నే వస్తున్నా వెళ్ళిపోకండి నే వస్తా." తక్షణం అందరూ కలిసి బయల్దేరారు.

# 5

పెద్దిగాడు కూడా భరించలేనంతటి దుర్వాసన వేస్తోంది ఆ బోటులో. ఒక ప్రక్కని బాగా బలిసిన పోతులు ఓ పది పన్నెండు న్నాయి. వాటి మధ్యన దాక్కుంటూ ఓ మూలగా వుంది జుమ్మన్. ఇదివరలో మెడ నిక్కించి, తలఎత్తి నుంచునే గాంభీర్యం అంతా ఎగిరిపోయింది. ప్రతిరోజూ చుట్టాలు స్నేహితులు అరిచే అరుపులు దాని చెవులో దూరి అక్కడేవుండిపోయాయి. అప్పటికి తను ఎక్కడ చేరుకున్నాడో పూర్తిగా అర్థమయిపోయింది. శుభ్రంగా వుండే వొంటి మీద ఎర్ర రంగుతో ఏదో గుర్తుపెట్టారు. జుమ్మన్ కళ్లు భయం కారుస్తున్నాయి. ఎక్కడ ఏ చప్పుడైనా, ఎక్కడ మనుష్యులు మాట్లాడు కుంటున్నట్లు వినిపించినా అతి కంగారుగా, భయంగా చూసేది. పెద్దిగాడూ, అదీ ఒకర్నొకరు చూసుకున్నారు. గుండెలు కరిగిపోయే గొంతుకతో అతణ్ని పిలిచింది. అది వినగానే పెద్దిగాడు ద్రవించి పోయాడు.

'జుమ్మన్! చివరికి యిక్కడికి చేరావా? ఏం దురదృష్టంరా నీది?'

పెద్దిగాడి కళ్లు ఏడుస్తున్నాయి. ఆపేక్షగా అతను జుమ్మన్‌దగ్గిర కెళ్లాడు. దాని వీపుమీద చేయివేసి నిమురుతున్నాడు. చిన్నప్పటి నుంచీ తన కలవాటయిన ఆ ఆపేక్షతోవుండే స్పర్శ యిప్పుడు మళ్లా గుర్తుపట్టింది జుమ్మన్. పెద్దిగాడి చేతిమీద ఆనుకునేట్టు తన తల కాయ వాల్చింది.

ఊరివారి సహాయంతో జుమ్మనుని విడిపించుకొని పెద్దిగాడు తిరిగి వస్తున్నప్పుడు ఊళ్లోవున్న జనంఅంతా ఆ అపురూపపు తండ్రీ - కొడుకులను చూడడానికి వీధుల్లోకి వచ్చారు. అల్లరచిల్లరిగా తిరిగిన పెద్దిగాడి పిల్లడు బుద్ధితెచ్చుకుని మళ్లీ యింటికొస్తున్నాడు! చిన్న పిల్లలు దాని మెళ్లో దండలువేశారు. దాని దర్జాఅయిన కొమ్ములకు

కుమ్ములు కట్టారు. దానిమీదవేసిన యమలోకపు గుర్తు కడిగేశారు. అందరూ "జుమ్మనొచ్చింది – జుమ్మనొచ్చింది," అని ఊరంతా తిప్పారు.

ఊరివాళ్ళు మళ్ళీ తలోకాస్త వేసుకుని పైకం పోగుచేశారు. అది పెద్దిగాడిచేతి కిచ్చారు. "పెద్దిగా! దీంతో సత్యనారాయణ వ్రతం చెయ్యాలి. భజనలు చేయించాలి," అన్నారు.

చుట్టుప్రక్కల అయిదు కోసులవరకూ ఆ పూజనుగురించి పేరు మోగిపోయింది.

మళ్ళీ పెద్దిగాడింటికి వైభవం వచ్చింది. వాడిల్లు మళ్ళీ చిన్న పిల్లల అల్లరితో నిండిపోయింది. రోజూ మళ్లా జుమ్మన్, వాళ్ళూ ఆటలాడుకోవడం, పోట్లాడుకోవడం, మళ్ళీ మునపటిలాగా తగాదాలు కోపం తెమ్చుకోడాలూ, చీవాట్లు తినడమూ – అన్నీ ఆరంభమయాయి. పెద్దిగాడికి మళ్లా ప్రాణం వచ్చింది; ఉత్సాహం వచ్చింది. వాడు మళ్ళీ పనిచెయ్యడం ఆరంభించాడు. సంపాయించడం సాగించాడు. పదిరూపాయలు పోగవగానేఅవి పట్టుకు యింటింటికి వెళ్ళి...

కాని, వాడు యివ్వబోయిన పైకం ఎవళ్లూ తీసుకోలేదు. జనం అంతా వాణ్ణి వెర్రివాడిక్రింద లెక్కేశారు.

"పెద్దిగా! అసలు ఏంటి నీ అభిప్రాయం? నీ కొక్కడికే జుమ్మనంటే ప్రేమవుందనా? మా కందరికీ వుంది. మాకూ అది యెంతో ఆనందం యిచ్చింది. నీ దగ్గిర డబ్బు తీసుకుంటే మా పిల్లలు మా మొగాలమీద ఉమ్మేస్తారు."

# 6

ఇన్నాళ్ళూ జుమ్మన్ కీర్తి ఆ వూరి సరిహద్దుల్లోనే వుండేది. ఇప్పుడు అయిదు క్రోసుల్లో వూళ్ళన్నిటికీ వ్యాపించింది. ఆ వూరి వాళ్ళు చందాలేసుకోవడమేమిటి, సత్యనారాయణ వ్రతం చేయించడమేమిటి? అంతా వింతగా వుంది. "అసలు ఆ వూరి మనుషులు ఉత్త మూర్ఖులు లెమ్దూ! మేకపోతుకి ఓనామకరణంట జుమ్మనుట! జుమ్మను!

చందాలా, పూజలా – మరీ విచిత్రంవాళ్లది" అన్నాడో పెద్ద మనిషి. కాని చాలామందికిది నచ్చలేదు. అందరూ వాడ్ని తలోనాలుగూతిట్టారు. "ఏమిటోయ్ నువ్వు మహా! అసలు ఏదో కారణం లేకపోతే వూరు వూరందరూ ఎందుకు ఎగబడతారు?" అన్నారు. ఇది ఆలోచించ దగి నదే అని అందరూ అనుకున్నారు. ఆలోచించి చూస్తే వాళ్ల కది నిజమే అనిపించింది.

అసలు జరిగిన దానికంటె ఏవో విపరీతాలు, విడ్డూరాలు జరిగాయని ఆ వూళ్లల్లో గట్టి అభిప్రాయం ఏర్పడింది. దాని ప్రాణం రక్షించడం కోసం ఊరంతా పూనుకున్నారనీ, అది తిరిగి రాగానే అందరూ కలిసి సత్యనారాయణ వ్రతం చేశారనీ పదే పదే చెప్పు కున్నారు. ఇంతకీ ఈ జుమ్మన్ యెట్లా వుంటుందో మరి! ఎక్కడ నుంచి వచ్చిందో! ఎక్కడికెళ్లిందో మళ్లీ! అసలు ఎలా నడు స్తుందో! ఎలా మాట్లాడుతుందో! తిండి ఏం తింటుందో! ఎక్కడ నీళ్లు తాగుతుందో!

ఇంతట్లో ఎవరో అన్నారుగదా "ఉపవాసంలో ఉన్నవాళ్ళు తినే పదార్థాలు మట్టుకు తింటుందిట. అది కంటికి కనిపించినట్లా తినదట. ఎంగిలి తగలితే ముట్టుకోదట ధ్యానంచేస్తూ కూచుంటుందిట. మొక్కుకుంటే వరమిస్తుందిట. జబ్బు చేసిన వాళ్ళని తీసుకెళ్లి దగ్గర పెడితే ఓసారి కరుస్తుందిట. అంతే, దాన్తో వాళ్ళకి క్రమేణా నయమై పోతుందిట, అదీ అసలు సంగతి."

ఒకడు తాను పరిశోధన చేసి కనుక్కున్న అంశం మరొకటి ప్రచారంలోకి తెచ్చాడు. జుమ్మన్ ఆ వూరికి వచ్చిన రోజునుంచీ, అంటే ఈ రెండేళ్ళ నుంచీ, అవూళ్లో కలరా రాలేదట. ఇదివరలో ప్రతి సంవత్సరం విధిగా కలరా వస్తుండేది. ఈ సంగతులు దరియాప్తు చేశారు. చేస్తే నిజమేనని తెలింది. ఈ రెండేళ్ళనుంచీ కలరా రానిమాట నిజమే. అంతకుముందు ప్రతీ ఏడూ వస్తున్న మాటా నిజమే. ఇహ ఆ తర్వాత "జుమ్మన్" "జుమ్మను దేవుడు"గా అవటానికి చాలా కాలం పట్టలేదు.

పెద్దిగాడికి ఈ గొడవ లేం తెలియవు. ఓ రోజు ప్రొద్దున్నే జుమ్మానుని చూడాలని ఎవరో ఒకడొచ్చాడు. ఇంకోడొచ్చాడు. మూడవ వాడొచ్చాడు. ఆ తరవాత అంతులేకుండా వచ్చి పడి పోయారు పెద్దిగాడి కిదో సమస్య అయిపోయింది. చూడ్డానికి వచ్చిన ప్రతివాడూ అల్లంత దూరాన నిలబడి, భక్తిగా ఓ దణ్ణం పెట్టేవాడు. దానికేసి చూసేవాడు. బాగా పరకాయించి చూసేవాడు. అంతట్లో మిగిలిన పోతులకు, ఈ పోతులకు భూమికీ ఆకాశానికీ వున్నంత తేడా వుందని అతనికి నిశ్చయమైపోయేది. ఇహ వాడు అవతలికి వెళ్ళి "నేనసలు ఊరికే ఎవరో తమాషా చేస్తున్నా రనుకున్నా. పిల్లాటలేమో అనుకున్నా. కాని తీరా వెళ్ళిచూశానా? అదేం కాదు బాబూ! అసలు ఆ పోతు ఏదో అవతారం. చూడగానే తెలిసిపోయింది. దాని కళ్ళు చూశారా మీరు? చూడలేదూ? అదెంత శుభ్రంగా వుందో గమనించారా? తెల్లగా, శంఖంలాగ కళ్ళకి బదులు చక్రా లున్నాయి. అవునండీ, సరిగ్గా చూస్తే అంతే! రెండుకళ్లూ చక్రాలే. అదే నాకు మరీ ఆశ్చర్యం వేసింది. మొదట్లో నాకు నమ్మకం లేదు సుమండీ! తప్పుచేశాను. జుమ్మన్‌దేవా, క్షమించు.. చెయ్యాలని చెయ్యలేదు!" అంటూ నలుగురియెదటూ రెండుచెంపలూ వాయించు కుని, కళ్లు మూసుకుని జుమ్మనుదేవుడికి ఓ దణ్ణం పెట్టాడు.

భక్తులసంఖ్య పెరుగుతూ వచ్చింది. జుమ్మన్ ఉండే స్థలం ఒక రోజున్నట్లు ఆ మర్నాడుండటంలేదు. దానికి రకరకాల మార్పులు వస్తున్నాయి. అలంకారాలు ఏర్పడుతున్నాయి. జుమ్మను మామూలుగా పడుకునే జాగాని ఎవరో శుభ్రంగా ఆవుపేడవేసి నున్నగా అలికేవారు ప్రతిరోజూ. ప్రక్క గోడమీద దేవుళ్ళపటాలు తగిలించారు ఇంకో రోజుని. జుమ్మన్‌కి ఎండ తగలరాదని ఇంటి కప్పుమీద వట్టిగడ్డి వేశారు.

మొదట్లో జుమ్మన్‌కి ఎవరూ దణ్ణంపెట్టేవారు కారు. సిగ్గేసేది. మనస్సుల్లోనే చేతులు జోడించేవారు. ఆ తరవాత ఎవరూ లేకుండా చూసి దణ్ణం పెట్టేవారు. అది ఎవడో చూశాడు. వాడు అందరూ చూస్తూండగా వచ్చి చేతులెత్తి దణ్ణంపెట్టాడు. భక్తితో కళ్ళు మూసు

కున్నాడు. ఆ తర్వాత అది మామూలు అయిపోయింది. కర్పూరం, అగరొత్తులు పరిమళించాయి. పళ్లూ, పువ్వులూ ప్రత్యక్షమయ్యాయి.

పొద్దు పొడవకముందే ఈ భక్తులు తండాలుగా రావడం ఆరంభ మయ్యేది. కొంతమంది మొక్కులు చెల్లించుకోవటం కోసం వచ్చే వారు. కొందరు మొక్కుకోడం కోసం వచ్చేవారు. ప్రతి విష యానికీ 'జుమ్మన్ దేవుడికి' మొక్కుకోవడం ఆ చుట్టు ప్రక్క లంతా అలవాటయిపోయింది. పూలదండలు వేయడం ఆరంభ మయింది. దానికి గుడ్డలు కుట్టించి తొడగడం మొదలెట్టారు. ప్రతి రోజూ క్రొత్తగుడ్డలతో, పూలదండలతో భక్తులకు దర్శనమిచ్చేది. పచ్చటి ఆకులకోసం ఎండా వానా అనక తిరగవలసిన అవసరం పోయింది. ఒక చేత్తో పూదండా, ఒక చేత్తో పచ్చటిమండా పుచ్చు కుని భక్తులు వస్తూండేవారు.

జుమ్మన్ తన భక్తులకి నిదర్శనాలు, దాఖలాలు చూపించటం మొదలు పెట్టింది. ఒకడికి కలలో కనిపించింది. అది వా డందరితోటీ చెప్పేశాడు. యింకోడు "నాకు కలలోకి రాలేదేం దేవా?" అన్నాడు దీనంగా. వాడి కలలోకీ వచ్చింది. జుమ్మను ఏమాత్రం కదిలినా దానికి అర్థాలు పుట్టుకొచ్చాయి. అది తల అడ్డంగా తిప్పినా, ఓ పక్కకి వంకరగా పెట్టినా "ఉహు"అన్నమాట. పైకీ కిందకీ వూపితే "అవును" అన్నమాట. ఇది అందరికీ అర్థమయిపోయింది.

మనసులో వున్నది అడగటం, అదేపనిగా దాని తలకాయకేసి చూడటమూను. ఆ తర్వాత దాని చెవులూ, గిట్టలూ కదిలినా వాటి కర్థాలు ప్రాప్తించాయి. చాలామందికి వారివారి జీవితాలలో ఆశలూ, నిరాశలూ, ఆచరించవలసిన కార్యాలూ, తొక్కవలసిన దారులూ అన్నీ జుమ్మన్ కదలడంమీద ఆధారపడేవి. "మా అబ్బాయి ఉద్యోగా నికి దూరదేశం వెళతానంటున్నాడు. వెళ్ళమంటూరా వద్దంటారా?" అని ఒక పిల్లాడి తలిదండ్రులు వచ్చి జుమ్మనుని అడిగేవారు.

పెద్దిగాడి కిపుడు ప్రతి విషయంలోనూ జాగ్రత్తపడవలసిన అవ సరం లేకుండా పోయింది. బియ్యం, పళ్ళూ, పూవులూ, హారాలూ,

చిల్లర, కొబ్బరికాయలూ, యివన్నీ సర్దుకునేటప్పటికి అలిసిపోయే వాడు. ఊళ్ళోవున్న పిల్లలు అతని సహాయానికి వచ్చేవారు, ఈ పనుల్లో. వచ్చిన వస్తువులు అందరూ పంచుకునేవారు. ఇన్నాళ్ళూ వాళ్ళు పెద్దిగాడింటికి ఒక్క జుమ్మన్ కోసమే వచ్చేవారు. ఇప్పుడు కొత్తగా యిదో లాభంకూడా కనిపించింది. యిది జుమ్మన్ కంటె బలంగా వాళ్ళని ఆకర్షించేది. 9 గంటలయేటప్పటికి భక్తులందరూ ఎవరిదారిని వారు పోయేవారు. ఆ తరవాత ఈ పిల్లల రద్దీ మొదలయేది. ఏ ఒక్క పిల్లాడయినా వెళ్ళకపోతే, వాడి తల్లితండ్రులు "వెధవా, పాపం ఆ ముసిలివాడు ఒకడూ ఎన్నని సర్దుకుంటాడు ? వెళ్ళి సహాయం చెయ్యి," అని వీపుమీగ ఒకటి తగిలించి పంపించేవారు తిరిగి వచ్చేటప్పుడు వాడు కొంచెం బియ్యమూ, ఒకటి రెండు కొబ్బరి కాయలూ మూటుగట్టి చంకన పెట్టుకుని కాసిని చిల్లర డబ్బులు చేత్తో పట్టుకుని యింటికి వచ్చేవాడు.

జుమ్మను ఆ గ్రామానికి కామధేను వయి ఊరుకుంది.

ఈ సర్దుబాట్లు అన్నీ అయిపోయాక, పెద్దిగాడు జుమ్మనుని బరబరా ఇంట్లోకి యీడ్చుకు పోయేవాడు. దాని వంటిమీదవున్న హారాలూ, కుచ్చులూ, చొక్కాలూ, కండువాలూ లాగేసి విసిరి పుచ్చుకొని ఓమూల పడేసేవాడు. కోపంగా కూకలు వేశేవాడు: "ఏమిట్రా కుంకా, ఈ చవట పనులన్నీ ? అం? – నీలో దేవు డెక్కడున్నాడో చూపించునాకు. నే అడుగుతున్న ప్రశ్నకి జవాబు చెప్పవేం? ఈ ప్రశ్నకు జవాబు చెప్పు పోనీ: "నా పెళ్ళాం పుట్టింటి కెళ్ళింది. వస్తుందా, గాదా? చెప్పు "

జుమ్మన్ తలకాయ పైకీ క్రిందికీ ఆడించింది. పెద్దిగాడు పెద్దగా నవ్వేశాడు. దాని చెవులు మెలేసి "వస్తుందా ? నా పెళ్ళాం చచ్చిపోయిందో, బతికిందో కూడా నీకు తెలియదు మళ్ళా! దేవుడివెం నువ్వు ? ఈ వెట్టి వెధవలు నీ వెంబడి పడ్డారేమిటి ? అయినా నువ్వు మాత్రం ఎలా సహిస్తున్నా వివన్నీ ? మొదటు వచ్చిన చవటని ఒక్క కుమ్ము కుమ్మితే వాడు ఆమడదూరం పారిపోయే వాడే కదా ! అం! అయినా నీ కిలాంటివన్నీ ఇష్టం. అవునా ? అవునా కాదా ? యిపుడు

నేను కూడా నీ భర్తుంకు మల్లేనే ప్రశ్న వేసి జవాబు చెప్పమంటాను. చెప్పూ! ఇష్టమన్నమాట నిజమా, కాదా ?"

జుమ్మన్ తల వంకరగా పెట్టింది. పెద్దిగాడు కసురుకుంటూ "యిష్టంలేదూ ? అఁ ? అయితే వాళ్ళని గెడ్డుపోట్లు ఎందుకు పొడవ లేదు మరి ? ఒరేయ్ ! ఈ ముసలాండి దగ్గరే నాటకం ఆడుతున్నావూ ? నాటకమేనా యిది! చెప్పు! ఊరికే అలా గుడ్లుపెట్టి చూడకు! అవునా కాదా ? చెప్పు."

జుమ్మన్ పైకి క్రిందికీ తల ఆడించింది. పెద్దిగాడు మళ్ళీ పెద్దగా నవ్వుతూ.

"అవునూ? నీకవన్నీ అర్థమవుతూ ంటే వాళ్ళని ఒక్కపోటు ఎందుకు పొడవ లేదు ? యిలాంటి దగాపనులు చేయటానికా నిన్ను విడిపించి తీసుకొచ్చింది ? మరినిన్ను నేనింత చెవులు మెలేస్తానా, యిన్ని తిట్లు తిడతానా, మరి నీలో దేవుడు ఎక్కడికి.పారిపో యాడు ? నన్ను ఏం చెయ్యమంటావు మరి ? నీకు సరయిన ఉజ్జీ దొరికాను."

పెద్దిగాడు అమాంతం దానిమెడ కావలించుకునేవాడు. ఒళ్ళంతా దువ్వేవాడు. తన పక్కన పడుకో బెట్టుకునేవాడు

తొలికోడి కుయ్యగానే పెద్దిగాడి గుండెలు దడ దడా కొట్టు కునేవి. ఇక! ఆ నర రాక్షసులంతా వస్తారు! జుమ్మనుని అనవసరపు హింసలన్నీ పెడతారు. ఇంక మళ్ళీ రాత్రిపడే వరకూ జుమ్మను నా దగ్గిరకి రాకుండా చేసేస్తారు. ఎట్లా వేగడం ఈ మూర్ఖులతో ?

కొన్నాళ్ళకి పెద్దిగాడికిదంతా విసుగేసింది. కోపం వచ్చింది. ప్రతిరోజూ అతనికి ఒకటే ఆలోచన. ఇలా యెన్నాళ్ళు సాగిస్తారు యీ తిరణాళ్ళు ? ఎన్నాళ్ళు పీడించుకు తింటారు మమ్మల్ని ? నే చచ్చేవర కూనా ?

చివరకి ఒకరోజున ఒక నిశ్చయానికి వచ్చేశాడు. ఇహ చాలు. ఈ వెట్టి వేషాలింక కట్టి పెట్టించాలి. మేకపోతుని పట్టుకొని "దేవు"డట, "దేవు"డు.కసాయివాడు తోలుకుపోయినప్పుడు నేను నానాతాపత్రయం పడవలసి వచ్చిందేం మరి ? ఇదంతా వుత్తది. ఇహ రేపటినుంచి ఈ యింటి కెవడూ రాకుండా చెయ్యాలి."

'నేనూ నా జుమ్మనూ మా యిష్టం వచ్చినట్లు బతుకుతాం. దొరి కింది తింటాం. లేకపోతే మానేస్తాం. మధ్య వీళ్ళకెందుకు ?'

# 7

ఆ మర్నాడు పొద్దున్నే పెద్దిగాడు నిద్రలేచి నిజంగానే జుమ్మన్‌ని వెంటపెట్టుకొని బయల్దేరాడు. అందరూ వాడికేసే చూస్తున్నారు. ఎవరో యెదురువచ్చి—'ఎక్కడికి బయల్దేరావు ?' అన్నారు.

'ఎక్కడికంటే ? పనిలోకి.'

'అయితే, మరి దేవుణ్ణికూడా తీసుకెళతా వెందుకు నీతో ?'

'దేవుడా ! దేవు డెవరు ? ఇది నా జుమ్మన్ ! మేపడానికి తీసికెళుతున్నాను.'

'పెద్దిగా ! ఒరేయ్ ! నీకు చెవులు పొడుగయిపోయినయి. ఇదేం బాగులేదు.'

'ఏం ? ఏం చేశానేమిటి ?'

'దేవుడికి అపచారం చేస్తున్నావు !'

పెద్దిగాడు ఆ మాటలు లక్ష్యం చెయ్యలేదు. ముందుకి నడిచాడు.

ఇంతట్లో జుమ్మను దేవుడికి భక్తులెదురవటం మొదలయింది. జుమ్మనుని బరబరా లాక్కుని వెళుతున్నాడు. ఆ దుర్మార్గం చూసి, అందరికీ గుండెలు కరిగిపోయాయి. ఈ అత్యాచారం ఆపడానికి అందరూ పూనుకున్నారు. పెద్దిగాడి దోవ కడ్డంగా నుంచున్నారు.

'ఎక్కడికిరా పెద్దిగా ?'

'ఎక్కడికంటే ? పనిచేసుకోటానికి. దారి వదలండి !'

'నువు పనిచేసుకోవటం ఎందుకు ?'

'అది మీ కెందుకు ?'

'ఔనురా ! ఇన్నాళ్లనుంచీ నువ్వేమయినా ఉపోషం ఉంటున్నావా ? కృతఘ్నుడిలా వున్నావు బొత్తిగా !'

"మాటలు తిన్నగా రానియ్యండి! ఇప్పుడే చెబుతున్నాను. నా ఇంటికి వచ్చి పోగులుపోసి పోతున్నారుమీరు. నేనేంచెయ్యను?"

"కాని, ని న్నెవరేమన్నా రిపుడు? నువ్వు అడిగేవు కనక చెప్పాం. నువ్వు జుమ్మనుని పెద్దయేదాకా పోషించావా? యిపుడు హాయిగాకూచుని సుఖంగా తిను."

"సోమరిపోతులాగా కూచుని తినటం నాకిష్టంలేదు. ఏ ముద నష్టపు ముష్టికూడా నా కక్కరలేదు."

"జుమ్మను దేవుడి ప్రసాదాన్ని ముదనష్టపు ముష్టి అంటావా? నీకు పిచ్చి-గిచ్చి పట్టిందా ఏఁవిటి?"

"మేకపోతుది ప్రసాదం ఏవిటోయ్? మీరందరూ మూర్ఖులు లాగా అయారు! నన్నుకూడా కలుపుకుందామని చూస్తారెందుకు?"

"మేం ఇంతమందిమి మూర్ఖులమూ, నువ్వు ఒక్కడివే తెలివైన వాడివీనా! నువ్వు కొంత పుణ్యం చేసుకొన్నావు గనక ఈ సారి క్షమించాం జుమ్మనంటే ఏమి టనుకుంటున్నావు!"

"ఏమిటా! కొమ్ములూ గడ్డమూ నాలుగు గిట్టలూ వున్న మేక పోతు."

"ఛ ఛ ఛ! చెవులు మూసుకోండర్రా! ఈ పెద్దిగాడు నోటి కొచ్చినట్లు వాగుతున్నాడు. ఇట్లాటి మాటలంటే ఊరందరకీ ఏదైనా విపత్తు కూడా వస్తుంది. అంటు వ్యాధులు వస్తాయి. పెద్దిగా! ఇక తన్నులు తినే లక్షణాలే యివి!"

"పూలదండలు వెయ్యగానే మేకపోతు దేవుడెలా అవుతుం దయ్యా? ఇంతమాత్రం తెలియదేవిఁటి మీకు? ఎవడో ఏదో వాగాడని మీరంతా పిచ్చాళ్ళలాగా దీనిమీద పడ్డారేమిటి? ఒక్క నిముషం దాన్ని దగ్గరికి తీసుకుందాం అంటే వీలుండటంలేదు. ఇహ మీదట ఈ పిచ్చి చేష్టలన్నీ సాగనివ్వను. దారివదలండి."

"జుమ్మనుని వదిలిపెట్టు. ఆ పైన నువ్వెక్కడికి వెళ్ళినా సరే మాకేం అభ్యంతరం లేదు"

"ఏమిటదీ? జుమ్మనుని వదిలి పెట్టాలా? ఇదేమన్నా మీకు సొంతం అనుకుంటున్నారా ఏమిటి?"

"నువ్వు మంచిమాటలతో విడిచిపెట్టకపోతే నీదగ్గరనుంచి లాక్కుంటాం! అంతే!"

"జుమ్మనుని మీ కివ్వను. ఇహ మొదలు నాదగ్గరకి రాకండి మీ రెవ్వరూ! నాకు మీఅన్నం అక్కర్లేదు మీ చిల్లరా అక్కర్లేదు. ఏమీ అక్కర్లేదు. పూర్వంలాగే పనిచేసుకొని నాపొట్టకి నేనుసంపాయించుకొంటాను. నాజుమ్మన్ హాయిగా అడవిలో తిరిగి పొట్ట పోసుకొంటుంది."

"నీ జుమ్మనే? ఎవరిచ్చారు నీకు దాన్ని?"

"ఎవరిచ్చారా? అది చాలా పాతపురాణం. వినాలనుంటే చెప్తా లెండి."

"కాని జుమ్మనుని విడిపించిందెవరోయ్? డబ్బు తెచ్చి కట్టిం దెవరు?"

"ఆ పైకం ఇచ్చేస్తానన్నానుగా? మీరు తీసుకోకపోతే నేనేం చేస్తాను?"

"ఆ పైకం మేం కట్టినమాట నిజమా అబద్ధమా?" దానికి పెద్ది గాడు ఏంసమాధానం చెబతాడు? ఇంకోదెవరో గద్దించి మళ్లీ అడి గాడు:

"పెద్దిగా! ఆ పైకం మేం కట్టినమాట నిజమా అబద్ధమా?"

"అబద్ధం, శుద్ధఅబద్ధం!"

"అబద్ధమా? ఏదీ మళ్ళీ అను."

"అబద్ధం కాకపోతే ఏమిటిమరి? పైకం వాపసు చేస్తానంటే తీసుకోకపోతిరి. మీరసలు యిలాంటి హక్కు ఏదో జుమ్మనుమీద చెలాయిస్తారేమో అని నాకు అప్పుడే అనుమానం వచ్చింది. అసలు అప్పుడే యీ సంగతి తేల్చుకోకపోవటం నాదే బుద్ధిపొరపాటు."

"అయితే ఆ బుద్ధిపొరపాటుకి ఫలం యిప్పు డనుభవించు! కాని పెద్దిగా! పిచ్చోడా! నీకేమిటి మతిపోయింది యిలా? నీ కిపు డేంతక్కువయింది?"

"మీ రందరూ వచ్చి కూచుని నన్ను జుమ్మన్ దగ్గరకే వెళ్ళ నివ్వటంలేదు ఎప్పుడుచూసినా నా వసారాలో పెద్దమీ క. అది వట్టి మేకపోతుగదా! దానికి మీరు లేనిపోని మహాత్యం అంటు

గడతారేమిటి? ఇప్పుడు నేనెవరిని చూసుకు బతకను? మీకు ఒక్క షరతుమీదయితే జుమ్మన్నిచ్చేస్తాను పోనీ".

"అయితే చెప్పు. నీ కేంకావాలో చెప్పు". నువు చెప్పకపోతే ఎలా తెలుస్తుంది మాకు? కాని జుమ్మన్ని ..."

"పదినిమిషాల్లో, బాధపెట్టకుండా ప్రాణంతీసే విషం తెచ్చి యివ్వండి నాకు. ఆ తర్వాత జుమ్మన్ని తీసుకెళ్ళండి. నే చచ్చి పోయాక మీ యిష్టంవచ్చినట్లు చేసుకోండి దాన్ని."

"పెద్దిగా! అయితే మంచిగా చెబుతూంటే వినవన్నమాట! రండయ్యా! లాక్కోండి ఆ జుమ్మనుని."

"ఒరే, ఒరే! కాని ఆగండి!"

"ఇంక, కానీ గీనీ ఏమీ పనికిరావు."

"పోనిలెండి! కాని దాన్నలా ఈడవకండి. నే నివ్వను. చూస్కోండి! కావలిస్తే! నేను యిప్పుడే... నారివెధవల్లాలా!"

కాస్సేపు గుంజులాడుకున్నాక జుమ్మన్ పెద్దిగాడి చేతినుంచి పోయింది.

పెద్దిగాడు ఆ మూర్ఖులకేసి చూస్తూ అలాగే నిలబడిపోయాడు చాలా సేపు. ఆ తర్వాత బరువుగా అడుగులు వేసుకుంటూ ఇంటివైపు నడిచాడు. పెళ్లాం పిల్ల లందరూ చచ్చిపోయినపుడు ఏర్పడిన శూన్యతే మళ్లా ఏర్పడింది.

# 8

అతి ఖిన్నుడై, అడుగులు తడబడుతూ అతను తన యింటి దగ్గిర కొచ్చాడు. "పెద్దిగాడు వచ్చాడు!" అని ఎవరో ఒక కేక పెట్టారు

అతను అసలా పక్కకే చూడలేదు. తలవంచుకొని యింట్లోకి వెళ్ళాడు. యింతట్లోకే జుమ్మను స్వరూపాన్ని మార్చేసి, గంగిరెద్దులా చేసేశారు.

క్రిందటిరాత్రి మల్లేనే ఈ రాత్రికూడా పెద్దిగాడికి నిద్రపట్టు లేదు. అటూ యిటూ పక్కమీద పొర్లుతున్నాడు. ఆలోచిస్తున్నాడు. జుమ్మనుని తన వసారాలోంచి తప్పించి, యింకెక్కడయినా పెట్టా లని కొంతమంది గుస గుస లాడటం తన చెవిని పడింది. ఏది ఎట్లా అయినా, అటువంటి దారుణం జరగకుండా కట్టుదిట్టం చేసుకోవాలనే తనూ నిశ్చయించుకున్నాడు. తొలికోడి కుయ్యగానే నిద్ర లేచాడు. జుమ్మన్ దగ్గర కెళ్లాడు. మేలుకునే వుంది. పెద్దిగాడు దాన్ని ముద్దా డుతూ నిమురుతూ సంప్రతింపు లారంభించాడు. 'జుమ్మా! మనం వెళ్ళిపోదాం. ఏం? ఎందుకట్లా ఏడుపుముఖం పెడతావు? వెళ్ళి పోదాం. ఎక్కడికా? పిచ్చిదానా! ఎక్కడికి పడితే అక్కడికే! మన యిష్టం! ఆ దయ్యాలదిబ్బ దగ్గర కెడదాం. పోతురాజుకి దణ్ణం పెట్టు కుందాం. ఆ తర్వాత కొండమీద కెళ్ళిపోదాం. అక్కడ పైభాగంలో అడవిలో కొంతమంది కొండజాతి వాళ్లున్నారు. వెళ్ళి వాళ్ళల్లో వుండి పోదాం. వాళ్లు అమాయకులు. కాని యిక్కడి వాళ్ళంత అజ్ఞానులు కాదు. అక్కడే వుండిపోదాం. యేం? చచ్చేవరకూ. నేను మొదట చచ్చిపోతే నువ్వు ప్రాణం వదిలెయ్. నువ్వు చచ్చిపోతే నే ప్రాణం యిచ్చేస్తాను."

అని నచ్చచెప్పి జుమ్మను కట్టు వదిలేశాడు. ఇద్దరూ బయలు దేరారు. మాలగూడెం దాటి దయ్యాలదిబ్బమీదికి వచ్చారు. పోతు రాజుకి దణ్ణం పెట్టాడు పెద్దిగాడు. ఆ తర్వాత కొండమీదికిపోయే బాట పట్టారు యిద్దరూ.

పొద్దు పొడుస్తోంది. ఆ అడవి వేపు తిరిగి నడుస్తున్నారు.

ఇ తట్లో—

"స్సో..... స్సో..... " అని ఏదో చప్పుడు వస్తున్నట్టు అని పించింది పెద్దిగాడికి. శ్రద్ధగా విన్నాడు. ఆ శబ్దం ఏమిటో ఏమీ అర్థం కాలేదు.

యింకొంచెం దూరం వెళ్ళాక ఆ "స్సో...స్సో—" అనే శబ్దం స్పష్టంగా వినిపిస్తోంది.

ఎంతో దూరంగా సముద్రంమీద ఒక పెద్ద నల్లటి మేఘం అతి

వేగంగా భూమివేపు వస్తూండడం కనిపించింది. ఆశ్చర్యంతో కూలబడి పోయాడు భూమిమీద. జుమ్మనుని దగ్గిరకి తీసుకొని ఆ మేఘంవేపు చూపించాడు. ఆ మేఘం సరిగ్గా తనవేపే వస్తున్నట్లనిపించింది అతనికి. అది నిమిషనిమిషమూ పొడుగయిపోతున్నట్టు తోచింది. అది ఎంత పొడుగు వుండివుంటుందో అని కొంచెంసేపు అంచనా వెయ్యబోయాడు. కాని ఆ తర్వాత ఆ ఆలోచన వదిలేశాడు. అది పరీక్షగా చూస్తూ వుంటే, అసలు "స్సో స్సో" అన్న శబ్దం ఆ మేఘంలోంచే వస్తోందని ఒక భ్రమ కలిగింది. ఆ మేఘంయొక్క విస్తీర్ణంచూసి భయభ్రాంతుడై పోయాడు. అసలు యింకొంచెంసేపట్లో ఈ భూమినంతటినీ ఆక్రమించుకొనేటంత పెద్దదైపోయేలాగ కనిపించే ఆ మేఘం ఇపుడెటు పోతోంది? అది చెప్పడానికి వీల్లేకుండా వుంది. అది క్షణానికి ఓ వేపు వెళుతున్నట్టుంది. పెద్దిగాడు అడివిలోవున్న కొండజాతులదగ్గిర కెళదామనుకున్న సంగతే మరిచిపోయేడు. పచ్చటి ఆకులు తినాలని జుమ్మన్ దూరంగా వెళ్ళింది.

ఆ శబ్దం యింకా అలాగే వస్తోంది. అసలు ఆ నల్లటిభూతం తనవేపే వస్తోందని నిశ్చయంగా తెలియగానే, పెద్దిగాడికి ఊళ్లో వాళ్ళన్న మాటలు హఠాత్తుగా జ్ఞాపకం వచ్చాయి: 'ఇలాటిమాటలంటే వూరందరికీ కూడా విపత్తు సంభవిస్తుంది.'

అయితే ఇదే ఆ విపత్తుకాదుగదా ?

ఇలా స్ఫురించేటప్పటికి గాబరా పుట్టింది. ఒళ్ళంతా చెమట పోసింది. చేతుల్లోనూ, కాళ్ళల్లోనూ సత్తువ పోయింది. కూలబడి పోయాడు. నెత్తిన విరుచుకుపడే సమ్మెటపోటు కానుకునేందుకు రెండు చేతులతోనూ తల గట్టిగా పట్టుకున్నాడు. జుమ్మను యెక్కడుందో అని కళ్ళతో వెతుకుతున్నాడు. ఆ శబ్దం అలా వస్తూనేవుంది.

కంగారు కంగారుగాలేచి, జుమ్మనుని పిలుస్తూ వెతుకుతున్నాడు. "జుమ్మన్ ! జుమ్మన్ ! !"

జుమ్మన్ ఆ దగ్గిరలో ఎక్కడా లేదు. సముద్రం మీంచి వస్తున్న ఆ భయంకర శబ్దమూ, ఊళ్ళోవాళ్ళన్న ఆ అమంగళపు వాక్యమూ, జుమ్మన్ కనిపించకపోవటమూ ఈ మూడూ అతన్ని

కందిరీగల్లాగా పట్టుకుని బాధపెడుతున్నాయి. అతను అటూ ఇటూ తిరుగుతూ జుమ్మన్‌ని వెతుకుతూనే వున్నాడు. ఇంతట్లో 'ఒకవేళ జుమ్మనని ఇలా తీసుకువచ్చెయ్యడం తప్పేనేమో! నిజంగానే ఊరందరికీ ఏదయినా అరిష్టం వచ్చేస్తే?' అనే సందేహం ఏర్పడింది మనసులో.

'స్సో స్సో' శబ్దం ఎక్కువవుతూంది. నిజంగానే క్షణ క్షణం ఎక్కువవుతోంది.

పెద్దిగాడు ఇప్పుడేం చెయ్యాలి? ఏమిటి చెయ్యడం? అని ఆతురతతో ఆలోచిస్తున్నాడు.

'స్సో... స్సో . స్సో...'

అమ్మనాయనోయ్! ఇంక ఆ అడివిలోకి వద్దు ఏమీ వద్దు! జుమ్మన్ కనిపించదేం? వాళ్ళన్నమాట నిజమవుతుందా ఏమిటి?

'స్సో... స్సో... స్సో...'

పెద్దిగాడు ఆ ఆలోచనాపరంపరలో పూర్తిగా మునిగిపోయాడు.

'జుమ్మన్! జుమ్మన్! జుమ్మన్!' అంటూ జీరబోయిన స్వరంతో గట్టిగా అరుస్తూ పరిగెత్తడం మొదలెట్టాడు

'స్ స్ స్ స్ స్సో' శబ్దం మరీ ఎక్కువవుతోంది. అయితే వాళ్లు చెప్పింది తథ్యమే? అంటే జుమ్మన్ నిజంగా దేవుడన్నమాటే? కాని, తనకుమాత్రం ఇంకా నమ్మకం కలగలేదు. ఇంకా ఆ శబ్దం దగ్గరకొస్తూనేవుంది. తనని మింగెయ్యడానికే వస్తోందేమో! జుమ్మనింకా కనిపించడంలేదు. ఇహ ఆఖరి ప్రయత్నంగా, వంట్లో వున్న శక్తినంతా ఉపయోగించి, పొట్ట రెండుచేతుల్తోనూ నొక్కుకుంటూ 'జుమ్మన్! నా అంతు చూడకురోయ్! ఇలారా! నువ్వీ ప్రాంతాల్లో వుంటే ఇలారా! మనం ఇంటికి పోదాం! నేనింక భరించలేనురోయ్! జుమ్మన్!' అని ఏమేమో కేకలు పెట్టాడు.

ఎంతో దూరంనుంచి జుమ్మన్ బదులు పలికింది. పెద్దిగాడు అటువేపు పరిగెత్తాడు పిల్చుకుంటూ: 'జుమ్మన్! జుమ్మన్! జుమ్మన్!'

జుమ్మన్ ప్రతి పిలుపుకీ పలుకుతూ దగ్గరకి వచ్చి నుంచుంది.

'వచ్చావా? పద యింటికిపోదాం! నిన్ను తిట్టానుకదూ!

ఇప్పు డేమవుతూందో చూశావా? చూడు. అలా పడమటివేపు చూడు!'

జుమ్మనుకి చూపించటం కోసమని తనూ పడమటివేపు చూశాడు.

ఇంత సేపటినుంచీ నల్లగావుండే ఆ అనంతమయిన మేఘం యిప్పుడు ఎఱ్ఱగా కనిపిస్తోంది. ఇదేమిటి? ఏమయినా భూతమా యిది? లేకపోతే మేం చేసిన పాపాలకి శిక్షగా భగవంతుడు పంపించిన నిప్పుల మేఘమా?

పెద్దిగాడు యిక అటు చూడలేక పోయాడు. జుమ్మనుని వెంట బెట్టుకుని, నెత్తిన చెయ్యి కొట్టుకుంటూ ఇంటిదోవ పట్టాడు.

మళ్ళీ దయ్యాల దిబ్బమీదకి వచ్చాడు. అక్కడ తన కళ్ళకి కనిపించినవే తను నమ్మలేక పోయాడు. ఊరి చివరనున్న కొబ్బరి తోటలూ, పోకతోటలూ, అన్నీ ఎఱ్ఱగా వున్నాయి. ప్రతిచెట్టూ గురి వెంత గింజలతో కుట్టినట్టుంది.

ఉరివేపు ఒక్క పరుగున బయలుదేరాడు. కొంతదూరంవెళ్ళి చటుక్కున ఆగి జుమ్మన్‌ని పిల్చాడు: 'జుమ్మా, జుమ్మా! పద తొందరగా! ఏమిటీ విపరీతం? ఆఁ! నువ్వు నిజంగానే ఎవరో దేవుడివా? నా జుమ్మన్‌వి కావా? నే తప్పేచేశాను! నన్ను క్షమించేం!' అంటూ భక్తిగా నమస్కారం పెట్టాడు. 'నేను ఉత్తశుంఠని. మూర్ఖుణ్ణి. నన్ను క్షమించు. ఏం క్షమిస్తావా? నీ మీద నా హక్కులన్నీ వదిలేస్తున్నాను. కాని యిప్పుడు మనం పరిగెత్తాలి. యీ రోజు మనకి ప్రతికూలంగా వుంది.' అంటూ మళ్ళీ పరుగుతీశాడు. ఉళ్ళో ప్రతిచెట్టూ ఎఱ్ఱగా వుంది. పెద్దిగాడికి అప్పుడర్థమయింది. 'ఓరి! యివి మిడతలు! అమ్మ నాయనోయ్! మిడతలదండు! యింక గ్రామం నాశనం అయిపోతుంది! పూర్తిగా నాశనం అయిపోతుంది!'

పెద్దిగాడికి యింత వరకూ మిగిలివున్న కాస్త ధైర్యంకూడా యిప్పుడు పోయింది. ఒంట్లో ఏదో పులకరింపు లేస్తోంది మాటిమాటికీ ఎరుపు వచ్చినప్పుడల్లా నాలిక పీక్కుపోతోంది. హఠాత్తుగా జ్వరం వచ్చిన వాడిలా అయిపోయాడు. మొగం పీక్కుపోయింది. కళ్ళు లోపలికెళ్ళిపోయాయి. వాడి ముసిలి దేహం క్షణ క్షణమూ ఎండిపోతోంది.

సన్నబడిపోతోంది. మళ్ళీ అది అంతా అతనికి తెలుస్తునూ వుంది. అతనికి యిప్పుడు ఒక్కటే ధ్యాసః తన దేహం పూర్తిగా నిస్సత్తువతో వాలిపోయే ముందు జుమ్మనుని యింటికి తీసికెళ్ళి మళ్ళీ ఆ వసారాలో కట్టి ఒక్క పూలదండవేసి నమస్కారం చెయ్యాలని. అది ఒక్కటే కోరిక. కాని అనుక్షణమూ అది నెగవేరక ముందే తన దేహం కింద పడిపోతుందేమోనని భయం పట్టుకుంది. ఒకవేళ తను పడిపోతే యిప్పుడీ మిడతల దాడిలో జుమ్మన్ ఏమయిపోతుంది మరి? ఎక్కడి కెళుతుంది పాపం? అప్పుడీ ఊరంతా ఏమయిపోతుంది? ఇప్పుడు యీదండు తాకిడి నుంచి తప్పించుకోడానికి ఒక్కటే వుపాయం: దండవేసి దణ్ణం పెట్టాలి.

అంగుళం అంగుళమూ మిడతలతో నిండిపోయింది. వెనకా, ముందూ, కిందా, పైనా ఎక్కడచూసినా మిడతలే! ఒక్క చెట్టునుకూడా వదిలిపెట్టలేదు ఆ మిడతలు. ప్రతి చెట్టూ దూసినట్టయి పోయింది. అందమైన ఆడదానికి బోడిగుండు చేయిస్తే ఎంత భయానకంగా వుంటుందో అలా వుంది ప్రతిచెట్టూ.

పెద్దిగాడు యింటి ముంగిట్లోకి వచ్చాడు. పక్క యింట్లోంచి ఎవరో కేకపెట్టారు: "ఎక్కడికెళ్ళావు పెద్దిగా? తొందరగా యింట్లోకి పోరా! మిడతలని చంపకేం?"

పెద్దిగాడు జుమ్మనుని యింట్లోకి తీసుకెళ్ళి గడిగుడ్డేసుకుని బయటికి చూస్తూ వుండిపోయాడు. పెరటి గుమ్మంవేపు వెళ్ళడానికి ధైర్యం చాలలేదు. ఎక్కడచూసినా ఎర్రగావుంది.

"కట్ ... కట్ ... కట్ ... కట్" ఈ అనంతమైన శబ్దం కోటి ప్రాణులు చేస్తున్నట్టు అంతరిక్షం వరకూ నిండిపోయింది. ప్రతి వస్తువూ నాశనమయిపోయింది.

పెద్దిగాడు యింట్లో కూచునివుండలేకపోయాడు. పెరటి గుమ్మం దగ్గరకెళ్ళాడు. జుమ్మన్‌కూడా బయటికి బయలుదేరింది. దాన్ని లోపలికి నెట్టాడు.

"ఎక్కడికి బయలుదేరావు? ఆకలేస్తోందా? ఇంకిప్పుడు

పచ్చటిఆకుల సంగతి మరిచిపో! వట్టిగడ్డితిని బతకాల్సిందే. అదిమాత్రం ఎక్కడదొరుకుతుంది ?'

జుమ్మనుని లోపల కట్టేసి తను ముంగిటిలోకి వచ్చాడు. ఆ ప్రదేశమంతా ఏదో నల్లటి గొంగళి పరిచినట్లుంది. ఇదేమిటి యీ విపరీతం! కిందికి వంగి పరీక్షగా చూశాడు.

పైనుంచి వర్షం పడ్డట్టు నల్లగా, ఎర్రగా పురుగులు పడుతున్నాయి దట్టంగా. భూమ్మీదనుంచి ఒక మట్టిపెల్ల తీసి, "దుంపలుతెగ! అంతా నాశనంచెయ్యండి! అంతా!" అని అరిచాడు.

అంతటితో ఒక రాయితీసి చేత్తోపట్టుకొని పళ్లుబిగించి ఆ వర్షంలా పడుతున్న పురుగులమీదికి విసురుదా మనుకొన్నాడు. "మిడతలని చంపకేం ?" అన్న కేక జ్ఞాపకంవచ్చింది. "ఏం? ఎందుకు చంపకూడదు?" అని బిగ్గరగానే అడిగాడు ఆ నిర్జనప్రదేశాన్ని. ఈ మూర్ఖపు ప్రజకి జుమ్మనులాగే మిడతలుకూడా దేవుళ్ళేనని నమ్మకం కాబోలు!' ఈ ఆలోచన తోచేటప్పటికి అతనికి ఊపిరి సలపలేదు. చేతిలోరాయి జారి కిందపడిపోయింది. ఆ అందమయిన తోటని క్షణంలో మేసేస్తున్నాయి మిడతలు.

"టక్ ... టక్ ... టక్ ... !"

"స్ స్ స్సే ... ... స్స ... ... !"

"టప్ ... టప్ ... టప్ ... !"

ఇంకక్కడ నుంచోలేకపోయాడు. నెత్తిమీద చేతులు పెట్టుకుని యింట్లోకివచ్చి ఆలోచిస్తూ కూచున్నాడు. చివరి కేమవుతుందిప్పుడు ? ఈ మిడతల విషయం ఊళ్లో యెవరూ పట్టించుకోరేమిటి ? ఏమిటి వీళ్ళభయం ? వీళ్ళమీద యీ మంత్రం ఎవరువేశారు ? తమరు సర్వనాశనం అయిపోతూంటే ఊరివాళ్ళందరూ అలా చూస్తూ వూరుకుంటారేం ?

కాని, ఆ పరిస్థితే అటువంటిది. ఒక్క మనిషికూడా ఇంట్లోంచి బయటికి రావటానికి సాహసించలేదు. పెద్దిగాడికి మట్టుకు "అసలు అందరూకలిసి గోలచేస్తూ తప్పెటులూ – తాళాలు వాయిస్తూ, ఖాళీ డబ్బాలు కొడుతూ, రాళ్ళు రువ్వుతూ, పొగా మంటలూ పెడితే

యీ మిడతలదండు వచ్చినదారిని పోయేది! కాని ఆ గొడవల్లో కొన్ని మిడతలు తప్పకుండా చచ్చేవి. వీళ్లందరికీ మిడతలని చంపకూడదని ఓ నమ్మకం!" అనిపించింది. "ఏం ఎందుకు చంపకూడదు? ఆవే మయినా మన స్నేహితు లనుకోవటంలేదుగా ఎవళ్లూ! ఇప్పుడే జనం అంతా ముష్టెత్తుకోవాల్సి వస్తుందే! మరి దానిసంగతి ఏమిటి? ముష్టెత్తుకోవాలసిరావటం ఎప్పుడోకాదు. రానేవచ్చింది. ఇప్పటి నుంచీ ముష్టెత్తుకోవాలి!

చక్కగా పచ్చగావుండే ప్రదేశమంతటిలోనూ యిప్పుడు పుల్లలూ స్తంభాలూ మిగిలాయి. ఊరంతా స్మశానంలాగ అయి పోయింది. ఈదండుదెబ్బకి ప్రతిచోటూ బూడిదపూసినట్టయిపోయింది.

# 9

ఆతర్వాత, త్వరలోనే ఊళ్లో వాళ్ళందరూ చేరి సభ చేశారు. చాలా సేపు ఆలోచనలు చేశారు. ఇంత నష్టం పూడ్చడం ఎలాగ? ఎవరు పూడ్చగలరు? మనుషులెవరూ ఈ పని చెయ్యలేరు! అయితే ఇక ఆ పోతురాజు చెయ్యాల్సిందే! ఆయనని శరణనాలి. అంచేత ఆయనకే మొక్కుకున్నారు. ఆయన్ని ప్రార్థించారు: "వచ్చిన నష్టం అంతా ఈ ఒక్క సంవత్సరంలోపల పూరించు!" పెద్దిగాడికి ఈ మొక్కు బడి యిష్టంలేదు. కాని వూరంతా కావాలన్నాక వాడి మాటేం చెలు తుంది? ఏవయినా పోతురాజు ఎవరినీ అన్యాయం చెయ్యడనే ధైర్యంతో తనూ ఆ మొక్కుబడికి ఒప్పుకున్నాడు.

సభనుంచి బయటికి కాళ్ళీడ్చుకుంటూ వచ్చాడు. ముంగిట్లో కాలు పెట్టేటప్పటికి జుమ్మన్ పరుగు లెత్తుకుంటూ అతని దగ్గరకి వచ్చింది. ఇదివరలో తనికి దుఃఖంగానూ కష్టంగానూ వున్నప్పు డల్లా జుమ్మన్‌దగ్గరకొస్తే అదికొంచెం తగ్గేది.తన భారం తేలికయేది. ఇప్పుడు కూడా జుమ్మనుని తన దగ్గరకి లాక్కొని గబ గబా ముద్దులు పెట్టుకొన్నాడు.

తనకి ఎంతో ఆకలిగావుంది. అయినా అన్నం రుచించలేదు. అన్నం తింటూ తింటూ మధ్య ఒకసారి జుమ్మన్ వేపు చూశాడు; ఆ అపేక్ష ఆపుకోలేక తన దగ్గరకి లాక్కున్నాడు భోజనం మధ్యే. అప్పుడు దానికి సర్ది చెప్పడంమొదలెట్టాడు: "పోతురాజు ఈ మొక్కు తీసుకోలేదు. అంతనష్టం సంవత్సరంలోపల పూడ్చడం అంటే మాటలా ఏమిటి? ఎలా పూడుస్తాడు? ఊరికే అనవసరంగా బెంగ పెట్టుకుంటున్నాం అంతే! అక్షరాలా అంతే." ఈ గట్టినమ్మకంతో అతను నవ్వుకుంటూ, జుమ్మనుని ఆపేక్షగా నిమిరి, దాన్ని వెంటబెట్టుకొని బయలుదేరాడు.

ఊళ్లోవాళ్ళు జుమ్మనుని మళ్ళీ గారాబంగానే చూస్తున్నారు. ముందుకుమల్లే పూలమాలలూ అవీ వెయ్యటంలేదుగాని, దేవుడిపేర అచ్చువేసిన అంబోతు ఏంచేసినా పూరుకున్నట్లు, జుమ్మనుకూడా ఎక్కడికెళ్ళినా ఏంచేసినా అభ్యంతర పెట్టలేదు. ఈ మధ్య ఈ మధ్య జుమ్మను కొంత చిక్కింది. ఇప్పుడు మళ్ళా బాగా ఏపుగా బలిసి, గర్వంగా తల ఎత్తుకొని ఊరంతా తిరగడం సాగించింది. "జుమ్మన్! జుమ్మన్!" అంటూ పిల్లలంతా మళ్ళా దానిచుట్టూ చేరారు.

పెద్దిగాడు మాత్రం రోజురోజుకీ చిక్కిపోతున్నాడు. వాడికి తిండిమీద యిష్టంలేదు. నిద్రపోవాలని యిష్టంలేదు. అసలు బతకాలనే యిష్టం పోయింది.

ప్రాణం పోవటంలేదు గనక బ్రతికివున్నాడంతే.

ఎక్కడికీ వెళ్ళటంలేదు. ఎవరితోనూ మాట్లాట్టంలేదు.

"పెద్దిగా! ఇప్పుడు ఏమొచ్చిందిరా నీకు? కరువుకాలం వస్తే మట్టుకు నీ కెందుకు యింత బెంగ? పెళ్లామా పిల్లలా? ఎంత కరువు వస్తేమాత్రం నిన్నేమి కష్టపెడుతుంది?" అనేవారు.

పెద్దిగాడు పిచ్చివాడిలాగా వాళ్ళవేపు చూస్తూ ఊరుకునేవాడు.

గంటలాది యింట్లోనే పడివుండేవాడు. జుమ్మన్ తన దగ్గరికి వచ్చినపుడు మాత్రం తనకి తల తీసేస్తున్నట్టుండేది. కడుపున పుట్టిన పిల్లాడిలా పెంచాడు దాన్ని.

మిడతలదండు కలిగించిన నష్టాలు యిప్పుడిప్పుడే ఊరివాళ్ళకి తెలిసొస్తున్నాయి. క్రిందటి సంవత్సరం పండిన గింజలుండబట్టి ఉపో షాలు తప్పేయి. కాని ముద్ద మింగుడుపడేది కాదు. ఎవరి దగ్గరా ఎర్రటి ఏగాని కనిపించేది కాదు. పోకచెక్కలు లేవు. కొబ్బరికాయలు లేవు. ఉప్పు, మిరపకాయలు తెచ్చుకోవాలంటే ఎవరిదగ్గిరా దమ్మిడీ లేదు. ఇంక బట్ట లెక్కడినుంచి వస్తాయి? ఈ రోజుల్లో జబ్బుపడడం అంటే ఒక శాపం అనుభవించటమే అనిపించేది. ఔషధాలకి పైకం ఎక్కడనుంచి తేవటం? మనుషుల ముఖాలు నీరసించిపోయాయి.

కాని ఎవ్వరూ ఏడుపుముఖం పెట్టుకు ఢిగాలుపడి పోలేదు.

ప్రళయం వచ్చినట్లు వచ్చిన మిడతల దాడి అటు పోగానే, ప్రతి మనిషీ మళ్ళీ పనులు ప్రారంభించుకున్నాడు. ఒంట్లో ఏ కాస్త సత్తువున్నా, అదంతా వినియోగించి పొలంపనులు చూసుకుంటున్నాడు. ప్రతివాడి ఇంటిముంగిటా కొద్దో గొప్పో ఎరువు పోగుబడింది. ఇప్పు డా ముంగిళ్ళు అన్నీ శుభ్రం చేసుకుని ఆ పాటిమట్టి చేలలో పోసు కున్నారు.

మిడతలదండు వచ్చి ఆకులులేకుండా దూసేసిన పోకచెట్లూ, కొబ్బరిచెట్లూ ఎండిపోయాయి ఇప్పుడు అవన్నీ నరికేసి కొత్త మొక్కలు నాటటానికి చోట్లు చేసుకున్నారు. ఇన్నేళ్ళూ పదిలంగా ఆశతో పెంచుకున్నా, ఆ చెట్లని నరికెయ్యాలంటే కడుపులో దేవి నట్లుండేది. అయినా, అవి కూల్చేసి పంటచెరుకుగానూ, యింటి దూలాలుగానూ కోసేశారు. ఎవరివో ఆత్మబంధువు అంత్యక్రియలు చేసినట్టు ఆడవాళ్లు కళ్ళనీళ్లు కారుస్తూ పనులు చేసేవారు. పిల్లలు ఏడుస్తూనే వాళ్ళకి రొట్టెలుతెచ్చి అందిస్తూండేవారు.

తప్పనిసరి గనక, గుండె రాయిచేసుకుని ఈ కసాయి కృత్యాలు ముగించారు. పొలాల్లో ఎరువు పరిచారు. వర్షంపడడమే ఆలస్యం యింక. వెంటనే దున్నటం ప్రారంభించవచ్చు.

పోతురాజుమీద వాళ్ళందరికీ ఎంతో నమ్మకం. మొక్కు కున్నాంగా! రక్షించక ఏంచేస్తాడు? ఊరందరికీ ఆ నమ్మకం వుంది. ఆ ఆశావుంది. అంచేత ఈ కరువుని ఏం లెక్కచెయ్యలేదు వాళ్ళు.

పెద్దిగాడు అంతా గమనిస్తూనే వున్నాడు.

అరకలుకట్టారు. దున్నడం అయింది. విత్తనాలు జల్లారు.

మృగశిర ప్రవేశించగానే వర్షమూ పడింది. ఇక వాళ్ళ ఆనందం అంతా యింతా కాదు.

# 10

వానదేవుడు ఏమీ దగా చెయ్యలేదు. ఈ వర్షంచూచి పెద్దిగాడు నీరయిపోయాడు. పోతురాజుని మనసులోనే ప్రార్థించాడు. కాని హస్తా నక్షత్రం వచ్చేవరకు వర్షం సమ్మృద్ధిగా పడుతూనే ఉంది. ఇంత సకాలంలో, యింత సమృద్ధిగా, వర్షంపడడం పెద్దిగాడు తన జన్మలో ఎప్పుడూ చూడలేదు.

నవరాత్రులు వెళ్ళాయి. దసరా పండుగొచ్చింది.

'జుమ్మన్! జుమ్మన్ ! ఎంత పని చేశాను? రేపు ఏదైనా అటూ ఇటూ అయితే ఏం చెయ్యను నేను? యింక నాకు ఘట్టుగతులుండవు!' అని ఏడవడం మొదలు పెట్టాడు పెద్దిగాడు.

నూర్పు లారంభించారు. బ్రహ్మాండమయిన రాశి చూచి పెద్దిగాడి గుండెలు బద్దలయిపోయాయి.

ఊరి వాళ్ళందరూ సంతోషంతో గంతులేస్తున్నారు. ఆ నూర్పుళ్ళప్పుడు ఊరుఊరంతా పొలాల్లోనేవుంది.

రోజురోజుకి ధాన్యం రాశిలో చేరుస్తున్నారు. ఆ రాశి చూచి జనం ఆనందపడిపోయారు.

ఈ కని విని ఎరగని పంటకి స్వాగతంచెప్పడానికి ముంగిళ్ళలో కూడా కొత్తగా నాటిన కొబ్బరి పిలకలు తలలూగిస్తున్నాయి. అవి అంత ఏపుగా, ఎత్తుగా, ఏడాదిలోపలే ఎలా ఎదిగి పోయాయా అని అందరూ ఆశ్చర్యపడ్డారు. తాత ముత్తాతల నాటినుంచీ యిట్టాటి వింత చూడలేదు. యింత పంట చూడలేదు.

ఇహ ధాన్యం కొలిచే రోజు వచ్చింది. పొలానికి వెళ్ళే ముందు అందరూ పెద్దిగాడింటికి వెళ్లి వాణ్ణికూడా రమ్మని పిల్చారు.

"పెద్దిగా! భగవంతుడు కనికరించాడు. పోతురాజు చల్లగా చూశాడు. పద పొలం దగ్గరికి! యివాళ రాశి కొలుస్తున్నాం."

పెద్దిగాడు కదలలేదు. నోరు మెదపలేదు. జనం వెళ్లి వాణ్ణి కదిలించారు. బుజం పట్టుకు కదిపి పిల్చారు. కొంచెం సేపటికి "మీ రెళ్ళండి చాలు" అన్నాడు.

"అలా వీల్లేదు! ఆనక నువ్వు పేచీ పెడతావు మళ్ళీ. నువు కూడా రా!"

"నేను రాను. నేను రాలేను. నాకు ఒంట్లో సత్తువ పోయింది. మీరెళ్ళండి."

"సత్తువ ఎందుకు పోయింది? నిన్న నీ అంతట నువ్వే నడిచి పొలం దగ్గరికి వచ్చావుగా! ఒక్కరోజులోనే సత్తువపోయిందేం?"

జనం వెళ్ళి ఒక బండి తెచ్చారు. తల దగ్గిర ఒకడూ, నడుం దగ్గిర ఒకడూ, కాళ్ళ దగ్గిర ఒకడూ పట్టుకుని పెద్దిగాణ్ణి ఎత్తారు. నాలుగోవాడు ఊతం ఇచ్చాడు "ఓం భాయి ఓం" అంటూ ఎత్తి తీసుకొచ్చి బండిలో పడేశారు.

బండి సాగింది.

పెద్దిగాడికి యిల్లు కనిపించటం లేదు. జనం కనిపించటం లేదు. వాణ్ణి బండిలో వేస్తున్నప్పుడు జుమ్మన్ "ఏమిటీ విచిత్రం!" అన్నట్లు చూస్తూ నుంచుంది. పెద్దిగాడు జుమ్మన్‌కేసి ఒక్కసారి చూశాడు. అంతట్లో ఏడుపు ముంచుకువచ్చేసింది.

ధాన్యం కొలుస్తున్నారు.

"లా...భం!"

"రెండూ...!"

క్షణాలు పరిగెత్తుతూన్నంత వేగంగా మానికల సంఖ్య పెరుగుతోంది. కొలవడం అంతా అయాక జనం ఒళ్ళు తెలియని సంతోషంతో గంతులు వేశారు. ఆ రాశి చూచి వాళ్ళ కళ్ళని వాళ్ళే నమ్మలేక పోయారు. మూడు రెట్లు పంటే! ఎలా పండింది?

పోతురాజు !

కాక యింకేమిటి ?

ఆ బలం ఎక్కడనుంచి వచ్చిందోమరి పెద్దిగాడికి, ఒక్క దుముకున బండిలోంచి దిగాడు.

"ఉత్తది! ఉత్తది ! పోతురాజు మన మొక్కుబడి పూర్తి చెయ్యలేదు !" అని అరిచాడు.

"పెద్దిగా ! ఏమిట్రా పేలతావు ?"

"నే నిజమే చెబుతున్నాను పోతురాజుకీ ఈ పంటకీ ఏమీ సంబంధం లేదు."

"అయితే నీ బాబు వచ్చి పండించాడా ఏంరా మూడురెట్లు?"

"మూడు రెట్లు కాదనడం లేదు నేను. కాని ఈ పంటకీ ఆ పోతురాజుకీ ఏమీ సంబంధం లేదంటున్నాను."

"వీడికేదో కొమ్ములు మొలుస్తున్నాయి! తన్నండి పట్టుకుని. లేకపోతే ఊరిమీదకి యింకో ముప్పు తెచ్చేలాగున్నాడు."

"వాణ్ణి మాట్లాడనివ్వండి. ఆఁ ఏమిట్రా పెద్దిగా నువ్వనేది? పోతురాజు మన మొక్కుబడి మన్నించలేదూ ?"

"లేదు."

"అయితే యింతపంట ఎక్కడినించి వచ్చింది ? మిగిలిన వూళ్లల్లో యిలా పండలేదేం మరి ?"

"మీరంతా చచ్చేటట్టు చాకిరీచేశారు. ఆ మిడతల ఎరువంతా పొలాల్లో వేసుకున్నారు."

ఆ మాట అనేటప్పటికి జనంలో అక్కడక్కడ పక్కున నవ్వులు వినిపించాయి.

"పెద్దిగా ! ముసిలివాడివయ్యావుగదా అని నోటికొచ్చింది మాట్లాడుతున్నావా ఏమిటి ?"

"నే నేం నోటికొచ్చినట్టు మాట్లాడ్డం లేదు. మీరే ఆలోచించండి కాస్త. మిగతా వూళ్ల వాళ్లందర్నీ అడిగి తెలుసుకోండి పోనీ. వాళ్లంతా మిడతలని తడిచేసి, సముద్రంలో పారేశారు. అంచేత పొలాలు

సరిగా పండలేదు. మీ రా పురుగులన్నింటినీ పొలాల్లో వేసేటప్పటికి భూమికి మంచిబలం వచ్చింది. అది వాళ్ళ వాళ్ళ అదృష్టం.'

'అవునుకద! వాళ్ళ వాళ్ళ అదృష్టమే కద! అయితే ఆ అదృష్టం మనకే ఎందుకుపట్టాలి? వాళ్ళకి ఆ అదృష్టపు ఆలోచనఎందుకు తట్టకపోవాలి? జవాబుచెప్పు మరి! ఆ అదృష్టపు ఆలోచన మన కెందుకు వచ్చిందంటే మనం మొక్కుకున్నాం గనక తెలిసిందా?'

ఆ తర్వాత యింకేమీ జవాబు చెప్పలేదు పెద్దిగాడు.

# 11

ఆ మర్నాడు ఊరిజనం అంతా మళ్ళా సభచేశారు. మొక్కుబడి చెల్లించుకోవటం ఎప్పుడని ఆలోచించారు. అసలు ఆ సభకి తాను వెళ్ళవద్దనే అనుకున్నాడు పెద్దిగాడు. కాని క్రితంరోజు మాదిరిగానే అందరూ వాడింటికే వచ్చారు ముందర. నలుగురూ చేరి బుజాలమీద వేసుకుని తీసుకొచ్చారు. ఇదేదో విచిత్రం జరుగుతుందని జుమ్మన్ కూడా చూడగానే గ్రహించింది. ఏదో బాధగా అరిచింది అతనివేపు చూస్తూ.

సభ ముగిసిన తరవాత, అశ్రువులా కరిగి కారిపోతూ ఇంటికి వచ్చాడు పెద్దిగాడు. ఇంట్లో అడుగుపెట్టీ! పెట్టగానే, బోరుమని ఏడిచాడు. ఆ గొల్లుమంటున్న స్వరం ఇల్లంతా వ్యాపించింది.

'జుమ్మన్! జుమ్మన్!' అంటూ దాన్ని దగ్గరకు లాక్కున్నాడు. గట్టిగా కౌగలించుకున్నాడు. వణికిపోతున్న తన తలని దాని వంటి మీద ఆన్చుకున్నాడు. 'జమ్మన్! ఇదేంవిటి ఇలా అయింది చివరకి?' అంటూ ఏడిచాడు.

ఆ రాత్రి అలాగే గడిచిపోయింది. దేనికీ లెక్కచెయ్యకుండా సూర్యోదయ సమయం దగ్గరపడుతోంది.

పెద్దిగాడికి మాత్రం ప్రతిదీ లోక విరుద్ధంగా ఉన్నట్టు తోచింది. మనుషులు కాళ్ళతో నడవడం మానేసి, తలకాయతో నడుస్తున్నట్టు అనిపించింది. పక్షులు పాడటం మానేసి ఏడుస్తున్నట్టు వినిపించింది జీవకోటి అంతా గొంతుకలు చించుకొని గొల్లుమని ఏడుస్తున్నట్టే తోచింది. ఊరంతా నిప్పంటుకు మండుకుపోతోంది. ఆ మిడతలదండు కంటె భయంకరమయిన ఆపద ఊరిమీద పడింది. తన ఇల్లుకూడా తగలడుతోంది. మంటలు ఆకాశంయెత్తున లేస్తున్నాయి.

# 12

ఇంకా స్సేపటికి తెల్లవారుతుందనగా ఊరిజనం యావన్మందీ పెద్దిగాడింటికి వచ్చారు. పూలదండలూ, ధూపం, దీపం పట్టుకొచ్చారు.

గుమ్మంముందు నిల్చుని పిల్చారు:

"పెద్దిగా! వెళ్దామా?"

పెద్దిగాడేం బదులు పలకలేదు.

అందరూ యింట్లో ప్రవేశించారు.

పెద్దిగాడింట్లో ఎక్కడా కనిపించలేదు.

వాళ్ళు ఇల్లు అంతటా వెతికారు.

ఇహ జుమ్మనుకోసం వెతికారు.

జుమ్మనూ కనిపించలేదు.

ఆ యింట్లో ఎవ్వరూలేరు.

ఎక్కడ కెళ్ళినట్టు?

త్వరత్వరగా యింట్లోంచే యివతలికి వచ్చారు జనం. సరిగ్గా సూర్యోదయంఅప్పుడే కదూ ముహూర్తం? మించిపోతే ఎట్టాగ? ఈ భయంతో జనం అంతా పరిగెట్టారు. వాళ్ళనుకున్నట్టే అయింది.

దయ్యాలదిబ్బ మీదుగా పెద్దిగాడూ, జుమ్మనూ ప్రాణాలు

అరచేతిలో పెట్టుకు పరిగెడుతున్నారు. పెద్దిగాడు వెనక్కి తిరిగి చూశాడు. "జుమ్మన్! ప్రమాదం వచ్చి పడుతోంది! పరిగెత్తరా! పరిగెత్తు!"

జుమ్మన్ మధ్య మధ్య అటూ యిటూ తాపీగా తిరుగుతోంది. పచ్చటి ఆకులు తినాలని తహ తహ లాడిపోతోంది. పెద్దిగాడు "ఒరేయ్! యిదా సమయం తిండికి? నువ్వెక్కడి మొగంవాచిన దానివే! క్షణ క్షణం ప్రాణం మీదికి వస్తుంటే, తెలుసుకోవేం?" అని కూకలేస్తూ దాన్ని చేతుల్లో ఎత్తుకున్నాడు. ఎత్తుకుని పరిగెట్టాలని చూశాడు. నాలుగు అడుగులు వేసేటప్పటికి ఒక దగ్గు పొర వచ్చి దాన్నికిందికి దింపాడు. తన వంట్లో బలం అంతా ఎక్కడికి పోయిందో అనుకున్నాడు. ఇహ కోపం వచ్చింది. అంచేత జుమ్మన్ తుంటి మీద ఒక్క చరుపు చరిచాడు. "పద, పరిగెత్తు! ఇలా నడుస్తుంటే లాభంలేదు!"

జుమ్మన్ పరుగు ప్రారంభించింది. పెద్దిగాడూ పరిగెడు తున్నాడు. ఒక పిలుపు దూరంలో జనం పరుగెత్తుకొస్తున్నారు.

దయ్యాల డిబ్బ దాటి వచ్చేస్తున్నారు. ఇహ పారిపోవటం శక్యమేనా?

కాని ఎవరు చెబుతారు పెద్దిగాడితో?

నోట నురగలు వస్తున్నాయి. ఒళ్ళంతా చెమటలు కారు తున్నాయి. ఒక వేపున ఆ పిచ్చి ముండ పరుగెడుతూనే వుంది.

ఇప్పుడు ఊరివాళ్ళకూ, వీళ్ళకూ మధ్య దూరంకూడా ఎక్కువ లేదు. వారు పరుగెడుతూనే ఏంవిటో అరుస్తున్నారు.

"పెద్దిగా! ఎంత దూరం పారిపోతావు? ఎందుకూ అసలు? ఛ ఛ! నీ కెలాటి కర్మం పట్టిందిరా!"

ఆ కేకలు చెవిని వేసుకోకుండా పోతురాజు గుడిదాటి కొండ మీదికి పోయే దోవపట్టాడు పెద్దిగాడు.

కాని మరుక్షణంలో ప్రజ వచ్చి అతనిముందు నిలబడ్డారు.

"పెద్దిగా! ఏమి టీ పని? పిచ్చివాడిలాగా!"

"పిచ్చివాళ్ళు మీరా నేనురా? నాజుమ్మనుని మొదట దేవుడన్నారు. ఇపు డేమో—" అని ఇహ చెప్పలేక పోయాడు.

తనవెనకే పోతురాజుగుడి వుంది. తను మనసులోనే పారిపోతున్నాడు. కాని అంతట్లోనే కొంతమంది జుమ్మనుని పట్టుకుని స్వాధీనం చేసుకున్నారు. సూర్యు డుదయించటానికి ఇంక ఎంతోసేపు లేదు. జుమ్మనుని నోరూ కాళ్ళూ కట్టేశారు. అది గింజుకోవడం చూసి పెద్దిగాడు బాధపడి పోయాడు.

"ఒరే, ఒరే! దాన్ని బాధపెట్టకుండా అయినా పట్టుకోండిరా!" అన్నాడు.

"బాధ పెట్టటంలేదురా పెద్దిగా! అయినా మాకుమాత్రం జుమ్మనంటే ప్రేమలేదా ఏంరా ?"

"హారి మీ నోళ్ళుబడ! ఇదా, ఇదా, ఇదిరా ప్రేమ?"

వాళ్ళు జుమ్మనుని తీసుకెడుతున్నారు. ఇహ యిప్పుడు పెద్దిగాడి కాళ్ళల్లో ఏమీ శక్తిలేదు. ప్రజలు తమ మధ్యవుంచుకుని జుమ్మనుని నడిపిస్తున్నారు. ఆ వెనకే పెద్దిగాడు నడుస్తున్నాడు. కొంచెంసేపటిలో పెద్దిగాడు వెనకఒడిపోయాడు. జుమ్మను తనకి దూరమై పోతోంది. దాన్ని వాళ్ళు తొందరగా నడపించటం తను చూడలేకపోయాడు.

"ఎందుకురా అట్లా తోలతారు? అది అలిసిపోయి వుందిరా! మీలాటివాళ్ళతో ఏమని చెప్పడం?" ఎంతో దూరంగా నుంచున్నాడు పెద్దిగాడు. జనం అందరూ గుడిదగ్గిర చేరారు. జుమ్మనుకి పూజ చేయడం అయింది. దండలూ అవీ వేసి అలంకరించారు. అంతట్లో ఎవడో "పెద్దిగాణ్ణి పిలవండిరా! లేకపోతే ఆఖరు క్షణాల్లో నన్ను చూడనియ్యనైనా చూడనియ్యలేదంటాడు ఆనక," అని హెచ్చరించాడు.

కొంతమంది పెద్దిగాణ్ని పిలవడానికి వెళ్ళారు. వాడికళ్లు నిప్పులు కక్కుతున్నాయి. వాడు నోరు తెరిచి మాత్రం ఏమీ అనలేదు. వాడి నోరు ఎండిపోయింది. చెమటలు పట్టేశాయి. నాలిక పీక్కుపోతోంది. తన కాళ్ళక్రింది నేల ఎటో జరిగిపోతోంది.

సాంబ్రాణి పొగ గాలిలో అలుముకుంది.

మరుక్షణంలో ...

పెద్దిగాడు అల్లంత దూరాన్నుంచి చూశాడు.

జుమ్మను ఛాతీని ఎవరో నొక్కారు. దాని మొండెంలోంచి చిమ్ముతున్న రక్తపుధారతో పోతురాజు తడిసిపోతున్నాడు.



| | |
|---|---|
| | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA1Q6B194 |
| పుస్తకం పేరు | కొండప్పలు కథ |
| తారీఖు | 25/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 129 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 2,70 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Hema |
| పేజీలు విడదీసినది | Bhanusree |
| స్కాన్ చేసినది | Pratyusha |
| పరీక్ష చేసినది | PRAGATHI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | No |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good |